

# జిగర్

## తెలంగాణ విశిష్ట కవిత్వ సంకలనం

ప్రధాన సంపాదకులు

**అనిశెట్టి రజిత**

సంపాదక వర్గం

కొమర్రాజు రామలక్ష్మి | కరిమిళ్ళ లావణ్య | భండారు విజయ | గడ్డం పద్మాగౌడ్





# జిగర్

## తెలంగాణ విశిష్ట కవితా సంకలనం

ప్రధాన సంపాదకులు

అనిశెట్టి రజిత

సంపాదక వర్గం

కొమర్రాజు రామలక్ష్మి

కరిమిళ్ళ లావణ్య|భండారు విజయ

గడ్డం పద్మాగౌడ్



రుద్రమ ప్రచురణలు

వరంగల్



ప్రతులకు

అనిశెట్టి రజిత
3-12-60 కుమార్‌పల్లి, హనుమకొండ-1
సెల్ :98494 82462

కొమర్రాజు రామలక్ష్మి : 98492 34725
కురిమిళ్ళ లావణ్య : 98484 10244
భండారు విజయ : 88019 10908
గడ్డం పద్మాగౌడ్ : 99636 11587



# జిగర్

తెలంగాణ విశిష్ట కవితా సంకలనం

జనవరి 2013

టైటిల్ ఆర్టిస్ట్ : అన్నవరం శ్రీనివాస్

డిజైనింగ్, బుక్ మేకింగ్ : జుగాష్‌విలి

డి.టి.పి. : కవిత, హైదరాబాద్
ముద్రణ : చరిత ఇంప్రెషన్స్ హైదరాబాదు- 20

ప్రతులకు:

సహచర బుక్ మార్ట్
విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు
నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైద్రాబాద్
దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైద్రాబాద్
ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు
నవయుగ బుక్‌హౌస్, సుల్తాన్‌బజార్, హైద్రాబాద్
తెలుగు బుక్‌హౌస్, కాచిగూడ, హైద్రాబాద్

For e Book : www.kinige.com

వెల : 250 రూపాయలు

# జిగర్

## తెలంగాణ విశిష్ట కవితా సంకలనం

ప్రధాన సంపాదకులు



అనిశెట్టి రజిత

సంపాదక వర్గం



కొమర్రాజు రామలక్ష్మి



కరిమిళ్ళ లావణ్య



భండారు విజయ



గడ్డం పద్మాగౌడ్

శనార్తులు



సినారె, బాపురెడ్డి, నిఖిలేశ్వర్, బి.నర్సింగరావు, వి.వి., బి.ఎస్.రాములు, ముదిగంటి సుజాతారెడ్డి, మలయశ్రీ, కాలువ మల్లయ్య, బోయ జంగయ్య

గద్దర్, గూడ అంజయ్య, అందెశ్రీ, గోరటి వెంకన్న, దేశిపతి శ్రీనివాస్, జయరాజ్, సుద్దాల అశోక్‌తేజ, మిత్ర, పైలం సంతోష్

బిరుదురాజు రుక్మిణి

ముత్యం, టి.శ్రీరంగస్వామి, నల్లెల రాజయ్య, తోకల రాజేశం, అన్నవరం దేవేందర్, కందిమళ్ళ భారతి, ఎస్వీ, పశ్యపద్మ, జాకబ్

జీవన్, సి.బి.లక్ష్మి, నెల్లుట్ల రమాదేవి, కొలిపాక శోభారాణి

వేణు సంకోజు, అన్నవరం శ్రీనివాస్, సంగిశెట్టి శ్రీనివాస్

జుగాష్‌విలి, కవిత, జ్యోతి



# సంపాదకీయం

చరిత్ర, సంస్కృతి, సాహిత్యం, కళలు, ఉద్యమం, విప్లవం కలబోసుకున్న ప్రత్యేక, భౌగోళిక, సామాజిక ప్రాంతం తెలంగాణ.

పది జిల్లాలు..జిల్లాకొక విభిన్నమైన భాషా మాండలికాల పలుకుబళ్లు.. వివిధ విశిష్టతల గుచ్ఛమే తెలంగాణ.

1946లో మొదలైన వీర తెలంగాణ సాయుధ పోరాటం సామాజిక, రాజకీయ రంగాలను కలుపుకొని తెలుగు సాహిత్య సాంస్కృతిక రంగాలలో ప్రవేశించి చరిత్రను సృష్టించింది.

కత్తులు దూసుకపోయినా, నెత్తురుటేరులు పారినా ఎత్తిన ఉద్యమపు జెండా దించలేదు నాటి ఉద్యమకారులు. అరుణ పతాకాలు ఆకాశాన్ని కమ్మేసినయి.

భూమికోసం, భుక్తికోసం, బానిసత్వపు (పేదరికపు) విముక్తికోసం పుట్టిన ఆ విప్లవ పోరాటంలో నేల రాలిన తొలి వీరుడు దొడ్డి కొమురయ్య. ఆ వీరుని నెత్తుటి ధారల్లోంచి ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లి వేలకొలది వీరులు ప్రభవించిరు.

ఉద్యమాల ఈ పురిటిగడ్డమీద ఉద్యమకారులు, కవులు, రచయితలు, గాయకులు, కళాకారులు.. అన్‌సంగ్ హీరోలు. మౌఖిక సాహిత్యం, పాండిత్యపు సాహిత్యం, వచన సాహిత్యం, పీడిత పక్ష సాహిత్యం, ఉద్యమ సాహిత్యం, విప్లవ సాహిత్య సేద్యాలు చేసింరు తెలంగాణా నేలన అంకురించిన అమర పండితులూ, రచయితలూ, కవి గాయకులూ, పరిశోధకులూ, కళాకారులూ, మేధావులూ, వైతాళికులూ..

నల్లగొండ కేంద్రంగా విష్ణుకుండినులు, కరీంనగర్ కేంద్రంగా శాతవాహనులు, ఓరుగల్లు కేంద్రంగా కాకతీయులు, హైదరాబాద్ కేంద్రంగా నైజాములు ఏలిన దక్కన్ భూమి..

కాకతీయ సామ్రాజ్ఞి రాణీ రుద్రమదేవి ధీశక్తి, ఆదివాసీల ఆరాధ్యులు సమ్మక్క సారలక్క, పగిడిద్ద, జంపన్నల ఖడ్గకీర్తి, సర్వాయి పాపన్న, కొమురం భీం, రాంజీగోండ్, సోయం గంగులు యుద్ధస్ఫూర్తి. పాలకుర్తి ఐలమ్మ, ఎరుకల గండెమ్మల గుండె బలం. షేక్ బందగీ, దొడ్డి కొమురయ్య, బత్తిని మొగిలయ్య గౌడ్‌ల బలిదానం..

తెలంగాణ అంటే ఒక చరిత్రకు వారసత్వం.. తిరుగుబాటు చైతన్యం.. సహజవనరుల, కళాసంపదల మాగాణం.. సాహిత్య సుక్షేత్రం.. విప్లవ నక్షత్రం..

ఇటు భారతదేశ పటంలోనూ అటు ప్రపంచ పటంలోనూ తెలంగాణ వైయక్తిక చిత్రం వేరు.. వేరు నేల, వేరు ఆకాశం, వేరు సంస్కృతి, వేరు పోరాటం, వీరత్వం, త్యాగతత్వం పొంగి పొరలే వేరు తెలంగాణ...

వీరులు, అమరులు, కవులు, కళాకారులూ.. ఇక్కడి ప్రతి పల్లె, ప్రతి జిల్లా.. ప్రతి వ్యక్తి.. ప్రతి ఒక్కరి జీవితం సంఘర్షణ, ఆరాటం, ఆప్తి, చైతన్యం, సృజనాత్మకం, ధిక్కార నైజం, నిరసనవాదం..

నదులు, చెరువులు, వాగులు, డ్యాంలు, జాతరలు, చరిత్ర దర్శనీయ ప్రదేశాలు, నిర్మాణాలు, చరిత్ర వ్యక్తులు, చరిత్ర ఘటనలు, ఆచారాలు, భాషా వ్యవహారాలు, ఆకాంక్షలు, ఉద్యమాలు అన్నీ తెలంగాణమే...

*

జన జీవనంలోని భాషా పలుకుబళ్ళ సొగసులు, అచ్చ తెలుగు పదబంధాలు, జాతీయాలు, ఉపమానాలు అంతా తెలంగాణమే... జొన్నచేన్లు, బంతిపూల తోటలు, గోగులు, పాలపిట్టలు, జడకొప్పులాటలు, కోలాటాలు, సిందాటలు, బోనాల వైభవం, మేడారం జనవనం...

అనేకానేక విశిష్టతల కలినేత తెలంగాణ. ఎర్రమల్లెల తోటలు, నీలి పువ్వుల గట్లు, పాటలు పూచిన చెట్లు... ఆదివాసీ, గిరిజన, దళిత, పీడిత జన జీవనాల ఆటుపోట్లు...

**స్వాతంత్ర్యపు పోరుబాట నీవమ్మా**

**గాయాల నెత్తుటి ఉట వైనావమ్మా**

**ఉద్యమాల ఉక్కు కోట నీదమ్మా**

**బతుకమ్మ బతుకు పాట తెలంగాణమ్మా**
**స్పష్టమైన తెలుగు మాట నీదేనమ్మా**
**తరగని చరిత్ర వారసత్వం నీదమ్మా**

తెలంగాణలోకి అడుగుపెట్టిన వాళ్ళెవ్వరూ తిరిగి వారి వారి ప్రాంతాలకు పోయేందుకు ఇష్టపడరెందుకనో సమజైందా..

*

ప్రస్తుతం ఒక దశాబ్దకాలంగా తెలంగాణ అస్తిత్వ కాంక్షతో తెలంగాణ విశిష్టతల తవ్వకాలూ, వెలికితీతలు ఊపందుకున్నయి. ఇంకా ఇంకా ఉటలూ పూడికలూ తీస్తూ చరిత్ర, విశిష్టతల నీరు చేదుకోవాల్సిన అవసరం ఉన్నది.

తెలంగాణ హృదయానికి ఎల్లలులేవు, మనుషులు బోళా, మనసులు స్వచ్ఛమైనవి, ఏమైన కల్తి అయితే అది వలసోల్ల పాపమే... ఇక్కడి జనం చేవకు లోపాల్లేవు, సాహసానికి వెనుకడుగుల్లేవు, తెగిస్తే హద్దులుండయి, ప్రేమిస్తే ప్రాణాలైనా ఇచ్చుడే.. మోసం చేస్తే తరిమికొట్టుడే.. ఇక్కడ జీవితమంటే నిత్యపోరాటం... బతుకు దినదినం ఉద్యమం.. నిత్య త్యాగాల గానం.. ఇప్పటిదాంకా ఘనమైన చరిత్రను నిలబెట్టుకున్న తెలంగాణ మరో చరిత్ర నిర్మాణం రక్తాక్షరాలతో కొనసాగిస్తున్నది.

అలస్యం అయినా కొంతమేరకు తెలంగాణకు సంబంధించిన వైవిధ్యభరిత అంశాలతో కూడిన కవితల్ని, పాటల్ని సేకరించగలిగినం. చేతికున్న ఐదువేళ్లను చైతన్య పర్చుకొని ఒక్కటిగా పిడికిలి పట్టి ఎరుకకొచ్చిన, ఎరుక చేసుకున్న కవులను కదిలించి కవిత్వం రాబట్టినం.

ఈ ప్రయత్నంల కవులను చాలా సార్లు పలకరించి సతాయించి ఉండవచ్చు. అంతా మన 'జిగర్'ను ఆవిష్కరించుడు కోసమే. ఈనాటి వర్తమాన, వర్ధమాన కవులతో పాటుగా మన అమర కవుల కవితలు, పాటలు కొన్ని సేకరించి, 'జిగర్'లో చేర్చినం.

చరిత్రకు సాచ్చీకంగ అనివార్యంగా కొన్ని ఉద్యమ, విప్లవ కవితల్ని చేర్చినం.

పెద్దా– చిన్నా, కొత్తా – పాతా, ప్రముఖులా – అముఖులా అని చూడలేదు. తెలిసిన, తెలుసుకున్న, కనబడిన వారందరినీ 'కవిత' అడుగుడు జరిగింది...

సంకలనం మొదలు అనుకున్న కాడినుండి కొసదాక కవులెందరో తమ కవితలు, పాటలు పంపించి, కవుల జాడలు, తావులు చెప్పి తెలంగాణ సాహిత్యోద్యమ స్ఫూర్తిని చాటిన్రు... ఎంత ఆరాటమున్నా కూడ మేము కోరిన కాన్సెప్ట్‌లో కవితలు పంపించలేకపోయిన కవులున్నరు...

తెలంగాణా పది జిల్లాల వైశిష్ట్యతను ఈ సంకలనంలో కొంతమేరకే చేర్చగలిగినం. అయితే కొన్ని జిల్లాల నుండి ఎంత కోషిష్ జేసినా కవుల స్పందన లేకపోవడం వలన కవితలు రాబట్టలేక పోయినం. ఈ సంకలనం సంపూర్ణ తెలంగాణ విశిష్టతను ప్రతిబింబించలేదు. తెలంగాణా చారిత్రక, సాంస్కృతిక, ఉద్యం విశిష్టతలు పాక్షికంగానే ప్రస్తావనకొచ్చినయి. ఇదొక ప్రారంభమే. ఇంకా ఎంతో కృషి జరగవలసి ఉన్నదని విన్నవించుకుంటున్నం.

ఇంగ అన్ని సరేగని పుస్తకానికి ముఖచిత్రం, పుస్తకం పేరు దగ్గర మొదలయ్యింది తండ్లాట... అన్వేషణ.. నలిమెల భాస్కర్, అన్నవరం దేవేందర్, పెద్దింటి అశోక్‌కుమార్, వేణు సంకోజులతో కలిసి పదే పదే ఆలోచించినం. కడకు వేణుసంకోజు ఆలోచనా మథనం చేసి సూచించిన 'జిగర్' పేరు సరీంగ సరిపోయింది అనుకున్నం. ఇంగ తిరిగి తిరిగి మొదలనుకున్న అన్నవరం శ్రీనివాస్ చిత్రాలను 'జిగర్' ముఖ చిత్రంగ చూసుకున్నం.

ఈ 'జిగర్' ద్వారా మన చరిత్రను.. వీరులను.. త్యాగాలను, కవులను, కళాకారులను, వైతాళికులను స్మరించుకునే అవకాశం కలిగినందుకు అశ్రునీరాజనాలు అర్పించుకుంటూ జై తెలంగాణ! జయహో తెలంగాణ!

అనిశెట్టి రజిత | కొమర్రాజు రామలక్ష్మి
| కరిమిళ్ళ లావణ్య | భండారు విజయ | గడ్డం పద్మాగౌడ్



## 'జిగర్'లో నింపుకున్న తెలంగాణ 'మర్ఫియా'

ఇప్పటికీ తెలంగాణ ఉద్యమానికి ఒక సామూహిక ప్రతీక లేదు. సర్వజనామోదం పొందుతుంది అనుకున్న 'తెలంగాణ తల్లి' కి కూడా ఆ హోదా దక్కలేదు. అందులో మా కట్టు, బొట్టు కనబడతలేదని కొన్ని సామాజిక వర్గాలు అభ్యంతరం వ్యక్తం జేశాయి. చిన్న రాష్ట్రాలవల్లే అభివృద్ధి సాధ్యమని చెప్పిన అంబేద్కర్, పీడిత, బహుజనుల హక్కుల కోసం కొట్లాడిన జ్యోతిబా పూలేను తెలంగాణ ప్రజలందరూ గౌరవిస్తున్నరు. వీళ్లను జాతీయ ఐకాన్స్‌గా తెలంగాణ ప్రజలు గుర్తిస్తున్నారు. అయితే స్థానిక 'ఐకాన్స్'ని తెలంగాణ ప్రజలు ఇంకా నిర్మించుకోలేక పోతున్నారు. సమైక్యవాదులందరికీ 'మదరాసు' రాజధాని కోసం సీమాంధ్రుల అత్యాశకు బలయిన ఓ షావుకారి ప్రతీక. తెలంగాణ వాసులందరికీ అమోదయోగ్యమైన ప్రతీకను వెతుక్కోవడం, ఎంచుకోవడం ఇప్పుడు తెలంగాణ ఉద్యమ అవసరం. ఈ దేవులాటలో అంబేద్కర్ కన్నా ముందు నుంచే ప్రజాహిత కార్యక్రమాలు చేపట్టి తెలంగాణ ప్రతిభను దేశం నలుమూలలా ప్రచారం చేసినప్పటికీ 'భాగ్యరెడ్డి వర్మ'కు 'ఐకాన్' స్థాయి దక్కలేదు. ఆఖరు క్షణం వరకూ తెలంగాణవాదిగా ఉండి 'గులాంకి జిందగీ సే మౌత్ అచ్ఛీ హై' అని నినదించిన కొండా వెంకటరంగారెడ్డి కూడా ఎవరికీ పట్టని బిడ్డ అయిండు. 1969 ఉద్యమంలో అటు అసెంబ్లీలో, ఇటు ప్రజాక్షేత్రంలో తెలంగాణ ఆకాంక్షవైపు నిలిచి వెలిగిన సదాలక్ష్మి, ఈశ్వరీబాయిగానీ, చివరికి జయశంకర్, కొండా లక్ష్మణ్ బాపూజీ కూడా సర్వ తెలంగాణ ఆమోద 'ఐకాన్స్'గా నిలువలేకపోయారు. వీళ్ళంతా ఇటీవల కాలానికి చెందిన వారు కావడం, వాళ్లు ఆమోదించిన రాజకీయాలు, ఉద్యమాలు అందరికీ సానుకూలంగా ఉండకపోవచ్చు. కొందరికి వ్యతిరేకంగానూ ఉండవచ్చు. దీంతో 'ప్రతీక'లుగా వారికి సర్వజనామోదం లభించడం లేదు. ఇలాంటి సందర్భంలో

తెలంగాణ 'ఐకాన్'ని నిర్మించుకోడానికి చరిత్ర నుంచే స్ఫూర్తి పొందాలి. రుద్రమ దేవి రూపంలో ఆ స్ఫూర్తిని అవాహన చేసుకోవచ్చు.

రుద్రమ దేవికి మాత్రమే తెలంగాణ జాతీయ/స్థానిక ప్రతీకగా గుర్తింపు పొందే అర్హత ఉంది. సమ్మక్క, సారక్కలపై హింసకు దిగిన తర్వాతి తరం వాడయిన ప్రతాపరుద్రుని కాలంలో జరిగిన అన్యాయాలకు కేవలం అదే వంశానికి చెందిన పాలకురాలు అన్న పేరిట రుద్రమదేవికి అంటగట్టలేము. సువిశాలమైన, సుభిక్షమైన రాజ్యాన్ని ఆమె పాలించింది. సాహిత్య, సాంస్కృతిక, కళా రంగాల్లో తెలంగాణ సగౌరవంగా నిలిచేలా ఆమె పాలన సాగింది. సమాజంలోని బహుజన మెజారిటీకి ప్రాతినిధ్యం వహించింది. పురుషాధిపత్యాన్ని అధిగమించింది. ఇప్పుడు ప్రత్యేక రాష్ట్రం కోరుకుంటున్న బుందేల్‌ఖండ్‌కు చెందిన ఝాన్సీ లక్ష్మీబాయికి జాతీయ స్థాయిలో గుర్తింపు వచ్చింది. లక్ష్మీబాయితో పోలిస్తే ఎక్కువ భూభాగాన్ని ఎక్కువ మంది ప్రజల్ని అంతకన్నా ఎక్వ జనామోదంతో పాలించిన రుద్రమదేవి గురించి జాతీయ స్థాయిలో ఎక్కడా సమాచారం రికార్డు కాలేదు. కాకతీయ ఉత్సవాల్లో సైతం ఆ విస్మరణ ప్రస్ఫుటంగా కనిపించింది. ఇంతజేసి తెలంగాణ మహిళల ఔన్నత్యాన్ని, గౌరవాన్ని, ప్రతిభను, ప్రజారంజక పాలనను, పోరాట పటిమను చాటి చెప్పిన ఆమె గురించి జరగాల్సినంత పరిశోధన జరగలేదు. ఆమె చరిత్ర అంతగా వెలుగులోకి రాలేదు.

ఇటీవల వెలుగులోకి వచ్చిన 'చందుపట్ల' శాసనంతోనే ఆమె మరణ తేదీ తెలియ వచ్చింది. ఇప్పుడు ఈ ఐదుగురు కవయిత్రులు కలిసి సంకలనం చేసిన 'జిగర్' ద్వారానైనా ఆమెకు సరైన, న్యాయమైన స్థానం దక్కాలి. వీరి ప్రచురణకు కూడా రుద్రమ ప్రచురణలు అనే పేరు పెట్టారు.

ఆమె పాలించిన కాకతీయ సామ్రాజ్యంపై ఈ సంకలనంలో చాలా కవితలే ఉన్నాయి. కాకతీయుల వైభవంపై కరిమిళ్ళ లావణ్య, పొట్లపల్లి శ్రీనివాసరావు, వల్లంపట్ల నాగేశ్వరరావు తదితరులు కవితలు వెలువరించారు. ఇవన్నీ ఆనాటి కాకతీయుల పాలనను, చరిత్రను చిత్రికగట్టాయి. వీటిలో రుద్రమదేవి పాత్ర మరువలేనిది. అందుకే "ఏకశిలనెక్కి పారజూసిన కాకతీయ పౌరుషాన్ని / శత్రువు పొలిమేరల్లో రగలిన అగ్ని కణాన్ని / నేను రాణి రుద్రమదేవిని" అని కాసుల లింగారెడ్డి రుద్రమ్మ శౌర్యాన్ని కీర్తించిండు.

నిజానికి ప్రతీకలు అనేవి తరాలు ఆలోచనలు మారుతున్న కొద్దీ మారుతూనే ఉంటాయి. ఏ తరానికి ఆ తరం ప్రతీకను నిర్మించుకుంటూనే సర్వజనామోదమైన శాశ్వత ప్రతీకల్ని ఏర్పాటు చేసుకోవాలి. తరాలకే గాదు, వర్గాలకు కూడా ప్రతీకలుంటాయి. ఆ వర్గ

ప్రతీకలే మొత్తం జనావళి ప్రతీకలుగా గుర్తించలేము. తెలంగాణ లాంటి సంక్లిష్టమైన, భిన్నమైన ఆలోచనల మేళవింపుతో ఏర్పడ్డ సమాజంలో ఇది మాత్రమే 'తెలంగాణ ప్రతీక' అని తేల్చి చెప్పడం కష్టం. ఊహాజనిత 'తెలంగాణ తల్లి' స్థానంలో రుద్రమను ఎంచుకోవచ్చు. చరిత్ర నుంచి స్ఫూర్తిని ఆవాహన చేసుకోవడంలో భాగంగా పోరాట పటిమను, ఆత్మగౌరవ పతాకను ఎత్తి పట్టిన చైతన్య శిఖరం 'రుద్రమ'ను తెలంగాణ ప్రతీకగా ప్రచారం చేయవచ్చు. ఈ పనిని ఈ సంకలనం ద్వారా ముందుకు తీసుకెళ్ల వచ్చు. ఇది సాధ్యమే! కాకతీయుల వెయ్యేండ్ల పాలనా ఉత్సవాలు జరుపుకుంటున్న ప్రస్తుత తరుణంలో తెలంగాణవాదులుగా ఆమెను 'ఓన్' చేసుకోవడం అంటేనే ఆమె పోరాట వారసత్వాన్ని కొనసాగించటమే!

తెలంగాణ మట్టిలోనే పోరాట వారసత్వముంది. న్యాయం కోసం నిలదీసి, ఎదిరించే సాహసముంది. పీడకులను, దోపిడీ, దౌర్జన్యకారులను ప్రశ్నించే తత్వముంది. ప్రాణాల్ని పణంగా పెట్టి తెగించే ధైర్యముంది. అయితే ఆ దమ్మూ, ధైర్యం సమ్మక్క, సారక్కల కాలం నుంచీ ఈనాటి వరకు మృత్యురూపంలో తెలంగాణను ముద్దాడుతోంది. వారి అకాల మరణాలు మనల్ని జాగృతం చేస్తూ మరింత పట్టుదలతో ముందుకు నడిచేందుకు దారి చూపుతున్నాయి. అయితే ఇక్కడ ప్రశ్న ఎప్పుడూ మరణం వైపే తెలంగాణ ఎందుకు నిలబడుతోంది? తెలంగాణ ఎప్పటికీ 'వేదనా సాహిత్యా'న్ని సృజించాల్సిందేనా? ఇంగ్లీషులో దీన్ని 'లామెంట్' (' ament') సాహిత్యం అంటారు. హైదరాబాద్‌లో దీన్ని 'మర్సియా' అంటారు. ఈ 'మాతం'కు అంతం లేదా? బహుశా ప్రత్యేక తెలంగాణ సాధన ఒక్కటే దీనికి తెరదించుతుందేమో! కాకతీయుల కాలం నాటి సమ్మక్క, సారక్కల పోరాటాలు కావచ్చు, సర్వాయి పాపన్న, నాగమ్మ, అక్కన్న, మాదన్న, సదాశివరెడ్డి, మియాసాహెబ్, పండుగ సాయన్న, రాంజీగోండ్, తుర్రేబాజ్‌ఖాన్, నక్కలపల్లి రాముడు, బండ్లోల్ల కురుమన్న, కొమురం భీమ్, బందగీ, షోయెబుల్లాఖాన్, సోయం గంగులు, బండి యాదగిరి, ఆర్యసమాజ్, సాయుధ పోరాట, పరకాల మృతులు, 1948 పోలీసు చర్య అమరులు, 1969 తెలంగాణ ఉద్యమ యోధులు, 1970 నుంచి నక్సలైట్ ఉద్యమంలో ప్రాణాలు కోల్పోతున్న వాళ్ళు, బెల్లి లలిత మొదలు ఇవ్వాళిటి తెలంగాణ ఉద్యమంలో అమరులైన, ఆత్మ బలిదానాలు చేసిన, చేస్తున్న వాళ్ళు ఎందరో ఉన్నారు. వీరి ప్రాణ త్యాగాలను, స్ఫూర్తిని, పోరాటాలను బాధాతప్త హృదయాలతో కీర్తిస్తూ ఎంతో సాహిత్యం వెలువడింది. అట్లా రాసిందే 'వేదనా సాహిత్యం' దీన్నే 'మర్సియా' అనవచ్చు. ఆ కవిత్వం ఈ సంకలనంలో కొంత చోటు చేసుకుంది. పోరాటంలో భాగంగా కాకుండా సహజ మరణం పొందిన వారినీ, వాళ్ల ఉద్యమాల్నీ, సాధించిన ఫలితాల్నీ పొగుడుతూ 'స్మృతి' కవిత్వం వెలువడుతుంది.

ఈ సంకలనంలో నాగమ్మ, సర్వాయి పాపన్న, కొమురం భీమ్, బందగీ, సోయం గంగులు సింగరేణి రమాకాంత్, బెల్లి లలిత తదితరులందరూ ఈ 'మర్సియా'లో భాగమయ్యారు. బహుశా ఇది తెలంగాణకే పరిమితమైన/ ప్రత్యేకమైన సాహిత్యం కావచ్చు. మొహర్రం సందర్భంగా కూడా ఇలాంటి పాటలే పుట్టుకొస్తాయి.

"గతంలోంచి వర్తమానానికి / ప్రయాణించే వాడే అమరుడు/ అమరుని ధీరత్వాన్ని జనం మెచ్చుకోవడమే/ అతని మహోన్నత జ్ఞాపకం/ వీళ్ల అమరులనడానికి/ పండగలైన పల్లెలే ప్రభల సాక్ష్యం/ కాలం మారినా జీవితాలు వాడినా/ బతుకులు దుర్భరంగా శుష్కించినా/ మీ ఆత్మార్పణని కథలుగా, గాథలుగా/ చెప్పుకుంటూనే ఉంటారు/ మీ అమరత్వాన్ని పీరీల జెండాలుగా/ ఎగరేస్తూనే ఉంటారు" అని రక్తంతో తడిసిన జెండాలను ఎగరేసే జ్ఞాపకాలను, పల్లె ప్రజల బాధను 'వీరుల పండుగ' పేరిట ఉదారి నారాయణ రికార్డు చేసిండు. మొహర్రం సందర్భంగా అశన్న, ఊశన్నల తలుచుకొని వాళ్ల జ్ఞాపకాలను తలుసుకుంటూ, త్యాగాలకు వేదనతో, నివాళీ, నీరాజనాలు అర్పిస్తూ పాడే పాటలు 'మర్సియా' సాహిత్యంలో భాగం. అలాంటి త్యాగధనులు తెలంగాణలో మొదటి నుంచీ ఉన్నారు. వీరి త్యాగాలకు ఈ సంకలనంలో బాసిత్, కొమర్రాజు రామలక్ష్మి, భండారు విజయ, జీవన్, బత్తుల దేవన్న, రత్నమాల, రాపోలు సత్యనారాయణ తదితరులు అక్షర రూపమిచ్చారు. కొమురం భీమ్ గురించి "మావూళ్లో మా రాజ్యమని/ స్వావలంబ పతాక పాతిన/జోడెన్‌ఘాట్ వీరుడా కొమురం భీం!/ నూతన మానవ సారమైన యోధుడా/ నువ్విప్పుడు వేలాది పోరుబిడ్డలై ఈ గడ్డమీద పునరుద్దిస్తావ్/ స్వావలంబ వటవృక్షమై నిలుస్తావ్" అని ఎం.ఎ.బాసిత్ ఆయన స్ఫూర్తిని ఆవాహన చేసుకుంటాడు. 'ధీర వనిత నాగమ్మ' గురించి కొమర్రాజు రామలక్ష్మి రాస్తూ "ప్రతి నాయకురాలిగా వక్రీకరించబడి/ కరీంనగర్ గడ్డపై సైతం/ వివక్ష నెదుర్కొన్న మన నాగమ్మ/ మరుగున పడిన వెయ్యేళ్ళ చారిత్రక విశేషం" అని యాద్జేసుకుంది. అట్లాగే సర్వాయి పాపన్నను "తెలంగాణ ఛత్రపతివి / అణగారిన జాతుల బానిసత్వాన్ని ప్రారదోలిన వాడివి/ లండను మ్యూజియంలో చోటు సాధించిన వాడివి / భూస్వాముల గుండెల్లో నిద్రించి/ పీడిత జనుల రాజ్యాధికార జండాను పాతినాడవు" అని భండారు విజయ కీర్తించింది. "...మగ్గం మీద తెలంగాణ జెండానేసి, ఎగురేసి/ పచ్చబొట్లను పొడిపించుకోవాలనుకున్న/ తొలిపొద్దులు ఉరిని ముద్దాడే ముందు/ ఊరుకొక్కసారన్న వచ్చిపోండి/ మీరు రాసిన ఆకలి అక్షరాలు / కడుపులో పిస్కుతున్నై/తల్లెలోని బువ్వంతా కన్నీరైంది / అమరజ్యోతులారా/ ఆగిపోయిన మీ పిడికిళ్ళను / మశాల్లుగా మండిస్తాం" అని వనపట్ల సుబ్బయ్య ఒక హామీ ఇచ్చిండు.

ఇన్నేండ్లు తెలంగాణ సాయుధ పోరాట చరిత్రలో ఒకటి రెండు వాక్యాలకే పరిమితమైన సోయం గంగులు ఇప్పుడు జీవన్ చేతిలో మళ్ళీ ప్రాణం పోసుకుంది. "ప్రజాపోరుకు భాష్యం చెప్పిన/ సమర సేనానిరా సోయం గంగులు / నిరంకుశులపై విసిరిన అంకుశము/ శూరుడు సోయం గంగులు/ పోరు చరిత్రల చిరస్థాయిగా/ వెలుగును అమరుడు సోయం గంగులు" అని అక్షరీకరించిండు.

"...తెలంగాణ రాష్ట్రానికి నెత్తుటి ముగ్గుబోసినావే/ మా అమ్మో బెల్లి లలిత/ తెలంగాణ రాష్ట్ర పోరు జెండా వైతివమ్మా/ మా చెల్లి బెల్లి లలిత" అని భువనగిరి ముద్దుబిడ్డ ఆట, పాటలతో తెలంగాణ ఉద్యమ స్ఫూర్తి నింపిన బెల్లి లలితను యం.రత్నమాల మతికి తెచ్చుకుంది. బందగీ గురించి రాపోలు సత్యనారాయణ, సింగరేణి రమాకాంత్ గురించి బత్తుల దేవన్న, పల్లేరు వీరస్వామి రాసిన అమరధామము పరకాల! కవితలు కూడా ఈ కోవకు చెందినవే! ఇవి చూడ్డానికి స్మృతి కవితలుగానే కనబడవచ్చు కాని కేవలం ఎలిజీలుగా వీటిని జమకట్టినట్లయితే వారి త్యాగానికి సరైన గుర్తింపు రాదు. ఆకస్మిక / బలవంతపు మరణం కాకుండా సహజ సిద్ధంగా మరణించిన వారి స్మృతిలో రాసిన కవితలను 'ఎలిజీ'లుగా పిలువొచ్చు. అయితే జీవితమంతా పీడిత ప్రజల పక్షాన నిలబడి, అలుపెరుగని పోరాటం చేస్తూ ఆధిపత్య శక్తుల/ దోపిడీ, దౌర్జన్య శక్తుల చేతిలో అమరులైన వారిన 'లామెంట్' చేస్తూ వచ్చిన సాహిత్యాన్ని మొహర్రం సాహిత్యం మాదిరిగా ప్రత్యేకంగా గుర్తించాల్సిన అవసరముంది. దాన్ని మనం ప్రస్తుతానికి 'వేదనా సాహిత్యం/ మర్సియా'గా పిలువొచ్చు. ఈ సాహిత్యం కూడా తెలంగాణ నుంచే ఎక్కువగా వచ్చింది. సీమాంధ్ర ప్రాంతంలో ఉయ్యాలవాడ నరసింహారెడ్డి, సుబ్బారావు పాణిగ్రాహి, పంచాది నిర్మల తదితరులపై కొంత సాహిత్యం వచ్చింది. సమ్మక్క, సారక్క, అక్కన్న, మాదన్నలు మొదలు తుర్రెబాజ్‌ఖాన్, షోయెబుల్లాఖాన్, బండి యాదగిరి వరకు వివిధ చారిత్రక పోరాట యోధులపై 1920వ దశకం నుంచే తెలంగాణలో కవిత్వం వెలువడింది. సురవరం ప్రతాపరెడ్డి సంకలించిన గోలకొండ కవుల సంచిక ఆ తర్వాత వెలుగు చూసిన స్రవంతి, ప్రత్యూష, ఉదయఘంటలు, తొలికారు లాంటి అనేక సంకలనాల్లో తొలి తరం తెలంగాణ త్యాగధనులను కీర్తిస్తూ బాధాతప్త హృదయాలతో రాసిన కవిత్వం రికార్డయింది. ఈ పరంపర మళ్ళీ తెలంగాణ ప్రజల దురదృష్టవశాత్తు నేటి వరకూ ఏదో ఒక రూపంలో కొనసాగుతూనే ఉంది. రోజూ తెలంగాణలో బలవంతపు చావుల డప్పు మోగుతూనే ఉంది. చావు పరిష్కారం కాదు, పోరాటం ద్వారా తెలంగాణ సాధించుకోవడం ఒక్కటే పరిష్కారమని చెబుతూ ఇప్పటికీ తెలంగాణలోని పది జిల్లాల నుంచి ప్రతివారం ఏదో ఒక సంకలనం వెలువడుతూనే ఉంది. వరంగల్ నుంచి "ఊపిరి" వెలువడింది. మహబూబ్‌నగర్ నుంచి భీంపల్లి

శ్రీకాంత్ 'అమరం' వెలువరించాడు. వ్యక్తులుగా తమ స్వీయ సంపుటాల్లోనే గాకుండా సంకలనాల్లో కూడా తెలంగాణ కోసం ఆత్మబలిదానాలు చేసిన యాదయ్య, శ్రీకాంతాచారి, యాదిరెడ్డి, వేణుగోపాల్ రెడ్డి, భోజ్యా, ఇషాంత్ ఇలా ఎందరో అమరులపై కవిత్వం వందల మంది రాసిండ్రు. ఈ సంపుటంలో జ్వలిత 'బందగీ మల్లోజుల సరసన నిలిచే/ శ్రీకాంతాచారి భోజ్యా రెడ్యానాయక్‌లు/ నా తల్లికై పోరే ముద్దు బిడ్డలు" అని నినదించింది. ఇదంతా వారి అమరత్వాన్ని కీర్తిస్తూనే బాధతో రాసిన కవిత్వం. అందుకే దీన్ని కేవలం 'ఎలిజీ'లుగా ప్రకటించినట్లయితే అమరులకు సరైన నివాళి కాదు. ఎలిజీ స్థానంలో దాన్ని ప్రత్యేకంగా 'వేదనా సాహిత్యం'గా పిలవాల్సిన అవసరం, ఆ దృష్టితో పరిశీలించాల్సిన అవసరముంది. 'మర్సియా'తో పాటుగా ఎలిజీలు లేదా స్మృతి కవిత్వం కూడా ఇందులో ఉంది.

ఈ సంకలనంలో కులీ కుతుబ్‌షా, మఖ్దూం, చిందు ఎల్లమ్మ, ముద్దసాని రామిరెడ్డి, కొండా లక్ష్మణ్ బాపూజీ, పాకాల యశోదారెడ్డి, కాపు రాజయ్య, కొత్తపల్లి జయశంకర్, సామల సదాశివల 'స్మృతి' కవితలు కూడా ఉన్నాయి.

"కుమారగిరి సింగభూపాల / కృష్ణరాయల రాసిక్య రచనా పల్లకీల మోతల్లో/ నువ్వు లేవు గానీ/ తరాజు ముల్లు నీవైపే/ తొలి ఉర్దూ రాజకవీ/ నీ పేరులేని హుసేన్‌సాగర్ విగ్రహాల/ విధ్వంసం కర్తవ్యమేనంటే/ నువ్వేమంటావో గాని/ నీపేరు ఉచ్చరించని వాడికి/ ఈ నగరం మీద హక్కు లేదంటున్న!" అని ఈ నగరం మీద హక్కు ఎవరికుంటుందో చెప్పకనే చెబుతూ హైదరాబాద్ నిర్మాత కులీ కుతుబ్‌షాని స్మరిస్తూ, కీర్తిస్తూ, సుంకిరెడ్డి నారాయణరెడ్డి కవిత్వమల్లిండు. స్మృతి కవిత్వంతో పాటు ఈనాటి మన చుక్కా రామయ్యపై వఝుల శివకుమార్ 'తెలంగాణ రామానుజం' పేరిట కవిత్వం రాసిండు.

తెలంగాణలోని దాదాపు అన్ని ప్రాంతాల ప్రాశస్త్యం, సంస్కృతి, చరిత్ర, వీరులు, సాహిత్యం, ప్రతిభ, యాది/నోస్టాల్జియా విశిష్టతను ఈ సంకలనం చాటి చెప్పింది. ఊరు జ్ఞాపకాలను, అందాలను తనివిదీరా తడిమి చూసుకున్న నోస్టాల్జియా విషయాల్ని మరొక చోటు చర్చించడమైంది. నోస్టాల్జియాతో పాటు ఇక్కడ తెలంగాణకు గర్వకారణమైన పండుగలు, గత వైభవం, ఆటలు, కళలు, కన్నీళ్లు అన్నీ ఇందులో అక్షరాకృతి దాల్చాయి. ఖమ్మం, రంగారెడ్డి జిల్లాలు మినహా అన్ని జిల్లాల చారిత్రక వైశిష్ట్యతను చాటే కవిత్వం ఇందులో ఉంది. వరంగల్, నల్లగొండ, కరీంనగర్ చరిత్ర, సంస్కృతి, గత వైభవాన్ని గానం చేసే కవిత్వం అధికంగా ఉంది. ఖమ్మం, రంగారెడ్డి జిల్లాల నుంచి అలాంటి వైభవ కవిత్వం రాకపోవడానికి గల కారణాల్ని కూడా అన్వేషించాల్సి ఉంది. 'ఆకాశం ఆంధ్ర నేల తెలంగాణ' అన్న ఖమ్మం నుంచీ, సెజ్‌లకు

చేన్లు అప్పగించి బేదఖల్ అయిన రంగారెడ్డిల నుంచీ వెతికితే కవిత్వం దొరక్కపోదు. 'గుమ్మం' పేరిట ఖమ్మం కవులు తమ జిల్లా అస్తిత్వాన్ని గానం చేసింద్రు. ఇక ఇక్కడ చోటు చేసుకున్న జిల్లాల వారి సాంస్కృతిక అస్తిత్వానికి అవసరమైన చారిత్రక వారసత్వాన్ని రికార్డు చేశాయి. "కంద పద్యం కన్పించింది కురిక్యాలలో / నన్నయ్య కన్నముందే/ జినవల్లభుడు కందం చెక్కిండు/ కన్నడ ఆదికవి పంపడు/ మన కొంపవాడే" అంటూ కరీంనగర్ ఖ్యాతిని 'బృహత్కవిత' పేరిట అన్నవరం దేవేందర్ చరిత్రలో శాశ్వతత్వాన్ని చేకూర్చాడు. "సాహిత్య ప్రేమికుడు ఎల్లందుల నారన్న/ మదిలోకొచ్చి కవితాత్మను వెలిగిస్తాడు/ మా ఊరి పరంధాములు నేసిన చీరె / అగ్గిపెట్టెలో ఇమిడి / ఖండాంతర ఖ్యాతిని మూటగట్టిన మురిపాలు/ కళామతల్లి కరీటాన్ని గర్వంగా ముద్దాడుతుంది..." అంటూ కరీంనగర్ జిల్లా ఎల్లందుల వైభవాన్ని అడెపు లక్ష్మణ్ చెప్పిండు. "కాశీలో ఊపిరాడని సదాశివుడు/ మనసుపడీ ఇటకు వచ్చి ఉంటాడు/ పరిమళించే ప్రశాంతతకు/ మురిసి ముక్తేశ్వరుడై వెలసి ఉంటాడు" అని గోదావరి, ప్రాణహితల సంగమం కాళేశ్వరం గురించి కాళిదాసు చెప్పిండు 'కోటి కోటల విలువ మన కోటి లింగాలది" అంటూ మలయశ్రీ చెప్పిండు. "..మంజీర సెలిమె ఊట కరిగెడమడి/ సక్కెర పండ్ల తీపి సెర్కు జూడీల తోట/ పాలకంకుల సేను/ తీరొక్క పువ్వుల పూత మెతుకు సీమదే" అని మెదక్ తియ్యదనాన్ని డప్పోల్ల రమేశ్ తినిపించిండు. "వాసర వాసిని/ జ్ఞాన సరస్వతి ఒళ్ళో/ ఓనమాలు దిద్దుకుని/ దిన దిన ప్రవర్ధమాన మౌతొన్న/ అసమానవతి నిర్మల" అంటూ నిర్మల్ చరిత్రను దామెర రాములు, జీవన విధ్వంసంపై తిరుగబడుతున్న ఉద్యమ కెరటానివి అని కుంతల (ఆదిలాబాద్) గురించి నూటెంకి రవీంద్ర రాసింద్రు. "చార్మినార్ ముందు గడియారం/ పేదవాని గుండెలాగా పనిచేస్తనే వుంటది/ చార్మినార్ మైసమ్మ గుడిగంట/ అజాతో పాటు మోగుతూనే వుంటది" అని అన్వర్ హైదరాబాద్ తెహజీబ్‌ని అక్షరీకరించాడు. అలాగే "రంజానూ బోనాలు చూడకపోతే/ భిన్న మతాలు కలిసి బతికే సంస్కృతికి / ఆనవాళ్ళు దొరికేవి కాదు" అని ఇక్కడి జీవితాల్ని ఆశారాజు కవిత్వంగా అల్లిండు. "అందాల చిందు ఎల్లవ్వ చందం/ ధ్వనించే, గజ్జెల కంకణ ద్వయం" అంటూ ఇందూరు వైభవం పేరిట వి.త్రివేణి కవిత్వమల్లింది. "మాకు ఒక ఆకాశం వుంది/ మాది పాలమూరు ఆకాశం/ తలమీద తట్టైన ఆకాశం" అంటూ పాలమూరు వలస బతుకుల గోసను జనజ్వాల వినిపించిండు. జ్ఞాపకాల కొండ పేరిట నల్లగొండ బతుకు గోసను నిఖిలేశ్వర్, కడుపుల పెరిగె పిండానికూడా ఫ్లోరైడ్ ఒక గండమైంది అని పి.యాదగిరి రాసిండు.

తెలంగాణకే పరిమితమైన బతుకమ్మ, బోనాలకు సంబంధించిన కవిత్వముంది. తంగెడుపూల గురించి ఎన్.గోపీ, నుమాయిష్ గురించి ఎస్వీ సత్యనారాయణ, తెలంగాణ భాషపై నలిమెల భాస్కర్, హుస్నాబాద అంగడి గురించి నాంపల్లి సుజాత, తెలంగాణ ఎవుసం గురించి పప్పుల రాజిరెడ్డి, అజాంజాహి మిల్లు గురించి పారిపెల్లి రవీందర్, ఇరానీ చాయ్ గురించి నాగేంద్రశర్మ రాసింద్రు. వీటన్నింటిలోనూ తెలంగాణ సంస్కృతి, కనుమరుగవుతున్న వారసత్వం, మాయమవుతున్న జ్ఞాపకాలు, జీవితాలు రికార్డయ్యాయి. వృత్తుల మీద కూడా ఇందులో మంచి కవితలున్నాయి. పత్తిపాక మోహన్ వెతల పాలవుతున్న పద్మశాలి బతుకులపై, వృత్తిని నమ్ముకొన్న జీవితాలపై ఏనుగు నరసింహారెడ్డి గుండెల్ని పిండే కవిత్వం రాసింద్రు. "తెలంగాణ వస్తదని తెగించి గొంతెత్తవే/ అకురాలు పొలనలో అమనివై రాగదే/ వేప చేదు బతుకునుంచి తీపి పాట పాడవే/ చిన్ని చిన్ని చెల్లెలో చిన్నారి నా చెల్లెలా" అని వరవరరావు పిలుపునిచ్చిండు. ఈ పిలుపుకు ప్రతిస్పందనగా అన్నట్టుగా ఈ సంకలనం వెలువడింది.

**తెలంగాణ మహిళా చైతన్యానికి, సాహితీ ప్రతిభకు, పట్టుదలకు ఈ సంకలనం అక్షరరూపం.రెండున్నర దశాబ్దాల క్రితం, తనను తాను తెలుసుకుంటున్న స్త్రీ సమాజం 'మనకు తెలియని మన చరిత్ర' పేరిట చాకలి అయిలమ్మతో పాటు అనేకమంది సాహస నారీమణుల చరిత్రను వెలుగులోకి తీసుకొచ్చింది. అట్లాంటి** పనే తెలంగాణ **దృక్కోణంతో ఈ సంకలనం కూడా చేసింది.** లేకుంటే అందెశ్రీ 'తెనుగోల్లా ఎల్లమ్మా', కాలువ మల్లయ్య, 'తెలంగాణ అవ్వ', అలిశెట్టి ప్రభాకర్, 'భాగ్యలక్ష్మి'లకు ఇందులో స్థానం దక్కేది కాదు.గ్రామీణ జీవితంలో శ్రమైక సౌందర్యానికి, ఆర్థిక స్వయంప్రతిపత్తికీ, అడవికీ- ఊరుకీ వారధిగా నిలిచిన 'బంటోల్ల ఎల్లమ్మ' అగమౌతున్న బతుకుని అందెశ్రీ అక్షరబద్ధం చేసిండు. అలాగే 'బెటర్ హాఫ్' భాగ్యలక్ష్మి మీద కవిత్వమల్లుతూ అలిశెట్టి"కలగా పులగంగా కలిసిపోయిన రోజుల్లో/ ఇంచుమించు ఒకే కంచంలో/ ఇంద్రధనస్సుల్ని తుంచుకుని తిన్న రోజుల్లో/ మా గుండెల్లో సమస్యలు మండని రోజుల్లో/ సిగరెట్ పీకలాంటి నన్ను సిగలో తురుముకొని/ గాజు కుప్పెల్లాంటి నా కళ్ళలోనే/ ఆశల అగరొత్తులు వెలిగించుకుందే తప్ప/ తులతూగే ఐశ్వర్యమో/ తులం బంగారమో కావాలని ఏనాడూ ప్రాధేయ పడలేదు" ఆమె గొప్పదనాన్ని చెప్పిండు. కాలువ మల్లయ్య "తెలంగాణ అవ్వను" ఆమె కరుణను, అప్యాయతను, జేబులు కాకుండా కడుపును చూసే తీరుని తలుసుకుండు.

"గోచీ పెట్టి కట్టిన ఎనిమిది గజాల చీర/ తలమీద శిఖరమోలె ముడిసిన శిగ/ కాళ్ళు చేతులకు వెండి కడాలు/ ముక్కుకు ముక్కెర చెవులకు గంటీలు/ కారుణ్యం నిండిన

కరుణామయమైన ముఖవర్చస్సు/ ఇంటి కొచ్చినవారి కడుపు చూసే కరుణార్ద్రత/ మాతృత్వం మూర్తీభవించిన ముఖకవళికలు/ అభయహస్తమిచ్చే ఆర్ద్ర హృదయం/ మాతృస్వామ్య వ్యవస్థలోని మమకారం/ ఇవన్నీ రంగరిస్తే మా అవ్వ తెలంగాణ" అని అవ్వని గానం చేసిండు. తెలంగాణ తల్లినీ, ఔన్నత్యాన్ని ఎంత పొగిడినా తక్కువే! అయితే సమ్మక్క, సారక్కల సాలు, సాయుధ పోరాట పటిమ ప్రస్తుత ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో కొరవడినట్లుగా కనిపిస్తోంది. తెలంగాణ, చరిత్ర, సాయుధ పోరాట మహిళా చరిత్ర ఎంతో కొంత రికార్డయినప్పటికీ ప్రత్యేకమైన తెలంగాణ మహిళా ఉద్యమాల చరిత్ర ఇంకా వెలుగులోకి రావాల్సిన అవసరముంది. తొలి తెలుగు రాజులు శాతవాహనులు తమ తల్లుల పేరిటనే ('గౌతమీ పుత్ర శాతకర్ణి' అని) వ్యాప్తిలో ఉండేవారు. అంతకుముందే గుణాఢ్యుడి 'బృహత్కథ'లోనే ఎందరో మాతృమూర్తుల చరిత్ర ఉంది. శాతవాహనుడి పట్టమహిషి మలయవతి, ఆ కాలంనాటి బాలశ్రీ, గౌతమి, దేవి నాగానిక, బోధిశ్రీ, రాణి వాసిష్టదేవిల గురించి క్లుప్తంగానైనా తెలుగువారికి తెలియని స్థితి. మైలాంబ, కామసానమ్మ, మైలాంబిక, సోమాంబ, రాణీ రుద్రమదేవిల శాసనాలు చరిత్రావశేషాలు గాకుండా విశిష్టమైన తెలంగాణ ఆనవాళ్లుగా రికార్డు చేసుకోవాల్సిన అవసరముంది. తెలుగులో తొలిసారిగా పద్యం రాసిన గోన బుద్ధారెడ్డి కూతురు "కుప్పాంబిక' గురించి ఇంకా పరిశోధనలు జరగాలి. సమ్మక్క సారక్కలతో పాటుగా పాపన్నపేట రాణి శంకరమ్మ గురించి, మాచాల్దేవి, పురంధ్రీ, బాలనాగమ్మతో పాటు ధర్మాంగద చరిత్రలోని ధర్మపురి "సత్యవతి"ని కూడా తెలుసుకోవాలి.

ఈ సంకలనంలో సుంకిరెడ్డి నారాయణరెడ్డి ఉర్దూలో తొలి కవిత్వమల్లిన కుతుబ్‌షా గురించి రాసిండు. అయితే అదే ఉర్దూలో మొట్టమొదటి సారిగా కవిత్వం సృజించిన మహలఖాబాయి చాందా గురించి (విదేశస్తులు పరిశోధనలు జరిపిన అనేక కొత్త విషయాల్ని) ఆమెపై పరిశోధనలు చేసిన వారి కృషి మేరకు అమెరికా ప్రభుత్వం హైదరాబాద్ (మౌలాలి)లోని ఆమె సమాధిని రక్షించడానికి, ఆమె ఉపయోగించిన ఎష్లాలోని 'బాయి'ని చారిత్రక కట్టడంగా రక్షించడానికి ఆర్థిక సహాయం చేస్తోంది. ఇంత జరుగుతున్నా సీమాంధ్ర ప్రభుత్వం మాత్రం అది తమకు సంబంధించిన విషయం కాదు అన్నట్టుగా చోద్యం చూస్తోంది. ఈనాటి ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రాంతం మొత్తం ఒకప్పుడు ఆమె జాగీరు గ్రామం. అయినా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆమెపైన ఇంతవరకూ ఎలాంటి పరిశోధనా జరగలేదు.

ఆధునిక కాలంలో మొత్తం భారతదేశంలోనే మొట్టమొదటిసారిగా అనస్తీషియాకు సంబంధించిన విద్యను ఇంగ్లండ్, జర్మనీల్లో నిజాం ప్రభుత్వ స్కాలర్‌షిప్‌తో చదివిన

రూపాబాయి ఫర్దూంజీ, 1907 నాటికే మహబూబియా స్కూల్ ప్రిన్సిపాల్‌గా పనిచేసిన జర్మనీ మహిళ. ఆమె ఆనాటి ముస్లిం, దేశ్‌ముఖ్‌ల బాలికల్ని అభ్యుదయ పథంవైపు నడిపించింది. జజ్జీఖానాలో డాక్టర్లుగా పనిచేసిన ఇంగ్లండ్ మహిళా డాక్టర్లు వారితో పాటు పనిచేసిన తెలుగు డాక్టర్ వరలక్ష్మమ్మ, సరోజినినాయుడు, ప్రిన్సెస్ నిలోఫర్, ప్రిన్సెస్ దుర్రెషెవార్, సాహితీ విదుషీమణి రూప్‌ఖాన్‌పేట రత్నమాంబ దేశాయి, సామాజిక కార్యకర్త బత్తుల సుమిత్రాదేవి, అహల్యాబాయి, మల్లన్న, సదాలక్ష్మి, రంగమ్మ, ఓబులరెడ్డి, పద్మజానాయుడు, సుగ్రాహుమాయున్ మీర్జా, కుముదినీ దేవి, రోడా మిస్త్రీ, ఈశ్వరీబాయి, హెడ్డా, నందగిరి ఇందిరాదేవి, సాయుధ పోరాటం చేసిన కోయ పాపక్క, లంబాడి లచ్చక్క, ఇట్లా కొన్ని వందల సంఖ్యలో ఆధునిక కాలంలో తెలంగాణలో మహిళాభ్యుదయానికి కృషిచేసిన వాండ్లు ఉన్నారు. సంస్థాన పాలకుల్లో కూడా మహిళలే ఎక్కువ. తమ ప్రాంత చైతన్యంలో ఆయా సంస్థానాధీశుల పాత్ర కూడా మరవలేనిది. కేవలం వ్యక్తులుగానే గాకుండా ఆంధ్ర యువతీ మండలి, ఆంధ్ర సోదరీ సమాజం, ఆంధ్ర మహాసభలు– మహిళలూ, కమ్యూనిస్టు ఉద్యమం – మహిళలూ, వివిధ బాలికా పాఠశాలలూ వాటి కార్యకలాపాలూ, బతుకమ్మ పాటల్లో నక్క ఆండాళమ్మ ఇవన్నీ ఈనాటి తెలంగాణ సమాజానికి తెలియాల్సిన విషయాలు. వీటిని మహిళలే నడుంగట్టి గ్రూపులుగా ఏర్పడి ప్రణాళికబద్ధంగా వెలుగులోకి తీసుకురావాలి. 60 యేండ్ల తెలంగాణ ఉద్యమంలో ఇప్పటికీ కమ్యూనిష్టులు రాసిన విస్మరణ చరిత్రనే చదువుకోవడం వల్ల మన ప్రత్యేకత, విశిష్టత స్మరణకు నోచుకోకుండా పోయింది.

కమ్యూనిస్టులు హైదరాబాద్‌లో సైతం 'మోటూరు ఉదయం' పేరిట భవంతులు నిర్మించుకుంటారు. కాని ఈ కవిత్వ సంకలనంలో కొలిపాక శోభారాణి స్మరించుకున్న "తన ఇంటిని పంటనూ కాపాడుకొనే క్రమం / తొడగొట్టి ఎదురొడ్డి.... నిల్చింది...పాలకుర్తి అయిలమ్మ/ అణచివేత ప్రజలను అనివార్యంగా ఉద్యమాల వైపు నడిచింది/ సంఘపోల్లను ఆదరించి అన్నంబెట్టిన అన్నపూర్ణ/ జడవక, వెరువక పట్టు పడక... కట్టుగా నిలిచింది గెలిచింది, కంగునా కంచుగంటోలె మోగింది/ పాలకుర్తి కోడలమ్మ/ చిట్యాల అయిలమ్మ/ గురించి ఈ కమ్యూనిష్టు సంఘాలు ఎన్నడూ గుర్తుంచుకోవు. వారి పేరిట ఏ భవంతినీ నిర్మించబోరు.

1969 ఉద్యమంలో అమరులైన మహిళలు/ బాలికలు కూడా ఉన్నారు. పోరాటం చేసిన దేవకీదేవిలాంటి వాళ్లూ ఉన్నారు. ఈనాడు అన్ని విశ్వవిద్యాలయాల్లో ముందుండి ఉద్యమాన్ని నడిపిస్తున్న విద్యార్థినులున్నారు. చివరికి ఉద్యమం కోసం ప్రాణత్యాగం

చేసిన మహిళలు కూడా ఉన్నారు. వీరి చరిత్రను తర్వాతి తరాల వారికి అందించి వీరూ చరిత్రకు ఎక్కదగిన వారే అని నొక్కి చెప్పాల్సిన అవసరం నేటితరం పరిశోధకులూ, బుద్ధిజీవులపై ఉన్నది.

చరిత్ర నుంచి స్ఫూర్తిని పొందాల్సిన అవసరముందని భావించి పాత తరంవారి రచనలు కూడా ఇందులో సంపాదకులు చేర్చారు. వాటిలో కాళోజి, సుద్దాల, చెరబండరాజు, దాశరథి, మఖ్దూం మొహియుద్దీన్, ముద్దసాని రాంరెడ్డి, కృష్ణమూర్తి యాదవ్, పాకాల యశోదారెడ్డిల కవితలున్నాయి. ఇందులోని కాళోజి కవిత మినహా మిగతావన్నీ తెలంగాణ చారిత్రక ఔన్నత్యాన్ని చాటేవే. తెలంగాణ విశిష్ట సంచికలో రజాకార్ల గురించి రాసిన కవిత కాకుండా కాళోజి ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో రాసిన వందకు పైగా కవితల్లోంచి ఏది తీసుకున్నా బాగుండేది. అలాగే ఆయన తెలంగాణ విశిష్టతను ఇనుమడిస్తూ రాసిన కవితలు కూడా ఉన్నాయి. అలా గాకుండా ఎన్నో చర్చోపచర్చలకు తావివ్వడమే గాకుండా బిజేపీ లాంటి పార్టీలు రజాకార్ల పాలన వస్తుందంటూ ముస్లిములను ప్రస్తుత సందర్భంలో కూడా విమర్శిస్తున్న కారణంగా అందుకు భిన్నమైన భావజాలంతో పనిచేస్తున్న ఈ సంపాదకులు ఆ కవితను తీసుకోకుండా ఉండాల్సింది. 1948లో కవిత రాసిన నాటికీ ఈనాటికీ 'రజాకార్ల' విషయంలో అనేక కొత్త విషయాలు వెలుగులోకి వచ్చాయి. అనేక పరిశోధనా గ్రంథాలు వెలువడ్డాయి. ఈ వెలుగులోకి వచ్చిన విషయాలను దృష్టిలో పెట్టుకొని అటు రజాకార్ల దుర్మార్గాన్నీ, అంతకన్నా ఎక్కువ స్థాయిలో భారత ప్రభుత్వ మిలిటరీ దురాగతాలనూ కూడా నిలదీయాలి.

దాశరథి, మఖ్దూంలు తెలంగాణ ఔన్నత్యాన్ని తమ కవితల్లో చాటారు. ఈ సంకలనంలో గత వైభవాన్నీ, పురాస్మృతుల్నీ తాజా చేసుకుంటూ రాసిన విలువైన కవిత్వం కూడా ఉంది. అందులో కృష్ణమూర్తీ యాదవ్ ముందువరుసలో నిలబడతాడు. అందుకే బహుశా ఆయన ఇప్పుడు జీవించి లేకపోయినా ఆయన కవిత్వాన్ని తీసుకున్నారు. 'ఊరు పికాసో చిత్రం' పేరిట రాసిన ఈ కవితలో "ఊరు పక్కనే / వాలిన నెలవంకలా చెరువు/ అందులో పూసిన మల్లె మొగ్గలు కొంగలు/కొంచెము దూరాన జొన్నకర్రల చేన్లు/ జనం జండాలు పట్టుకొని నిలబడినట్లు /మోటబావి నీళ్ళు/బొక్కెనలో ప్రాణం పోసుకొని/ గలగల నవ్వేసి/ పొలంతల్లి ఒడిలో నిద్రపోతాయి" అని చెప్పిండు. ఇప్పుడు మోటబావి, బొక్కెన రెండూ కనబడకుండా పోయినయి.

నల్లగొండ బిడ్డడు అంబటి వెంకన్న తన జిల్లా గోసను, గొప్పతనాన్ని 'నను గన్న పల్లె' పాటలో చెప్పిండు.

"సోగుబడ్డ కొండలు నిండ భోనగిరి వేములకొండ/ కొండమీద పేర్చిన గుండ్లు చెరువు గట్టు మూడు రాళ్ళు/ సెరికల్లో దాగిన శివుడమో ఈ జడగట్టి ఎత్తుకున్నాడా/ నీలగిరి కొండలు రెండు నింగినెపుడు వంచుతునుండు/ ఆ మెడలో బంగారు హారం మెరిసేటి దేవరకొండ/ కులమత బేధం లేకుండా ఈ కూడుండే సంపద నిచ్చేనవే" అని నల్లగొండ జిల్లా ఔన్నత్యాన్ని గానం చేసిండు. అలాగే కేతిరెడ్డి యాకూబ్‌రెడ్డి "దసర పండుగ నాడు పాలపిట్టను జూసి/జమ్మిసేతులపెట్టి వంగి దండం బెట్టి/ అలాయి బలాయి అందరమూ తీసుకొని/ మంత్రనగర మాయెనే నా పల్లె/ మనసు సింగిడేసేనే..." అంటూ పల్లె సుంబరం జెప్పిండు. బండ సరోజన "మారుమూల నా ఊరు మనసైన నా ఊరు/ చుట్టూరా చింతచెట్లు చూడముచ్చటైన ఊరు/ ఎల్లంబావి నీళ్లతోని ఎదనింపిన నా ఊరు / కళకళలాడుతూ కనులకు విందుగూర్చు నా ఊరు" అంటూ, సన్నాయిల కృష్ణవేణి "నాపల్లె సౌరభించిన సిరిమల్లె/ఓరుగల్లు సిగలో విరిసిన ఎర్రమల్లె/ తన బిడ్డల్ని ఊతంగా ఇచ్చి/ విప్లవానికి ఊపిరూదిన పెద్దతల్లి నా భట్టుపల్లి" అంటూ తమ ఊరి జ్ఞాపకాలను మనతో పంచుకున్నారు.

మొత్తం తెలంగాణ మీద కాసుల లింగారెడ్డి, ముదిగంటి సుజాతారెడ్డి లాంటి వాండ్లు కవిత్వ మల్లింద్రు. జిల్లాల నుంచి ఊర్ల వరకూ అన్ని ప్రాంతాల ఔన్నత్యాలపై కవులు అక్షరదీపం వెలిగించింద్రు. నిత్యం తెలంగాణ కోసం తీరొక్క రీతిలో కొట్లాడుతుంద్రు. ఇవ్వాళ తెలంగాణ బిడ్డలు సామూహిక అకాంక్షను సంయమనంగా వ్యక్తం చేస్తున్నరు. తెలంగాణలోని ప్రతి పల్లెలో, ప్రతి ఇంట్లో జై తెలంగాణ నినాదం వినపడుతోంది. దాదాపు ప్రతి ఊరు నుంచి సాహిత్య సంపుటాలు/ సంకలనాలు వెలువడ్డాయి, అయా గ్రామాల వారిగా ఘన చరిత్రను తవ్వుకుంటున్నారు. గానం చేస్తున్నారు. 'రింగ్ టోన్ల'యి వినిపిస్తున్నారు. యే ఊరి బస్సు ఎక్కినా సెల్‌ఫోన్ల నుంచి పాటలు చైతన్యాన్ని పంచిపెడుతున్నాయి. 'ధా..ల్' అంటూ పాటకు కోట్ల మంది 'జైకొట్టి' కోరస్ అయితుంద్రు. 'ధూం ధాం'లయి అడుతుంద్రు. వీటికి తోడు 'వేలరీ' ('Valour') పర్యటనలు పెరిగిపోయ్యాయి. అంటే యోధులను ముఖ్యంగా పోరాటయోధులను స్మరిస్తూ వారు పుట్టిన ఊరునూ, సమాధినీ, నడయాడిన ప్రదేశాన్నీ దర్శించడం పెరిగిపోయింది. ఇది ప్రతి తెలంగాణవాదిలో ఉద్యమ స్ఫూర్తిని రగిలిస్తోంది. తెలంగాణ ప్రతి పల్లె నుంచి సాహితీ/ సాంస్కృతిక కళాకారులు ఉద్యమ దివిటీలై వెలుగుతుంద్రు. తెలంగాణ హృదయాంతరాల్లో గూడుగట్టుకున్న సాంస్కృతిక వైభవాన్నీ, కళల్నీ, కన్నీళ్ళనీ కైగట్టి 'జిగర్' ద్వారా పంచుతున్నరు సంపాదకులు. ఇందులో మహిళా ధృక్కోణంలో అవసరమైన తెలంగాణ ఆవిష్కరించబడింది.

అలనాటి తెలంగాణ మౌఖిక సాహితీ సంపదను కూడా ఈ సంకలనం పుక్కిటబట్టింది. బిరుదురాజు రామరాజు సేకరించిన జానపద సాహిత్యాన్ని మళ్ళీ ఒకసారి తెలంగాణా ప్రజల యాదికి తీసుకురావడం అనేది ఈ సంకలనానికి అదనపు గౌరవాన్ని కలగజేస్తుంది.

ప్రత్యేక తెలంగాణా సాధన కోసం తెలంగాణ ప్రజలు చేపట్టని పోరాట రూపం లేదు. ఓపికతో, ధైర్యంతో కొసకంటూ కొట్లాడాలంటూ ఇక్కడి ప్రజలు వేల రోజుల నుంచి దీక్షలు చేస్తున్నరు. తెలంగాణ ప్రజలు, విద్యార్థులు, రాజకీయ నాయకులు, బుద్ధిజీవులు, కవులు, రచయితలు అందరి కృషి మూలంగా హైదరాబాద్‌లో ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని రాజకీయ పార్టీలు డిసెంబర్ 7, 2009న సమావేశమై ప్రత్యేక తెలంగాణ ఇచ్చి తీరాల్సిందేనని తీర్మానించింద్రు. ఈ తీర్మానాన్ని శిరసావహిస్తూ కేంద్ర ప్రభుత్వం తరపున అప్పటి హోంమంత్రి చిదంబరం డిసెంబర్ 9, 2009న ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమైందని ప్రకటించిండు. అయితే ఢిల్లీలో మాట ఇచ్చి హైదరాబాద్ వచ్చిన తర్వాత కుట్రారాజకీయానికి అప్పటి ముఖ్యమంత్రి రోశయ్య తెరదీస్తూ సమైక్యవాది చంద్రబాబుతో కలిసి ఎమ్మెల్యేల రాజీనామా డ్రామాలాడించారు. సీమాంధ్రల్లో కృత్రిమ అలజడిని సృష్టించారు. దీంతో కేంద్రం పార్లమెంట్‌లో ఇచ్చిన మాటను వెనకకు తీసుకుంది. మొత్తం ప్రపంచంలోనే అతి పెద్ద ప్రజాస్వామిక దేశం అని చెప్పుకునే భారతదేశంలో కొంతమంది వ్యక్తులు కూడబలుక్కొని, అలజడి ద్వారా పార్లమెంట్‌లోని ప్రకటన మార్పించగలిగింద్రు అంటేనే మన ప్రజాస్వామ్యంలోని డొల్లతనం తెలుస్తున్నది. అన్ని పార్శ్వాలనుంచి ఆలోచించే తెలంగాణకు అనుకూలంగా ప్రభుత్వం పార్లమెంట్‌లో తమ నిర్ణయాన్ని ప్రకటించింది. అట్లాంటి నిర్ణయం కూడా అమలులోకి రాకుండా పోయింది. ఇవ్వాళ దేశంలో పార్లమెంటరీ వ్యవస్థ ఉన్నదా లేదా కొంతమంది వ్యక్తుల ఇష్టాఇష్టాల మేరకు పార్లమెంట్ నడుస్తున్నదా అనే అనుమానం ఈ పరిణామాలను చూస్తున్న సామాన్య మానవునికి కూడా కలుగుతుంది. ఈ సంశయ నివారణ జరగాల్సిందే! తెలంగాణను 'సమస్య'గా కాకుండా 'పరిష్కారం'గా ఆలోచించాల్సిందే!!

రాష్ట్రపతి తన ప్రసంగంలో చెప్పి, పార్లమెంట్‌లో ప్రకటన చేసి వెనుకడుగు వేయడంతో ఇప్పుడు తెలంగాణ ప్రజలు ఏమిజెయ్యాలి అనే కూడలిలో ఉన్నారు. ఈ రోజే (డిసెంబర్ 28,2012) తెలంగాణపై మరోసారి ఢిల్లీలో అఖిలపక్షం సమావేశం కానుంది. ఇందులో ఎవరేం చెప్తారో, మరెన్ని కొత్త కుట్రలకు తొవ్వలేస్తరో తెలియదు. 1969లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఆశించిన ఫలితాన్ని ఇవ్వకపోవడంతో యువత

నక్సలిజం వైపు మళ్ళింద్రు. ఆ కడుపుకోతను ఇప్పటికీ తెలంగాణ అనుభవిస్తూనే వుంది. పోరాట వారసత్వం, తెగించే ధైర్యం ఉన్న తెలంగాణ ప్రజలు 'ఎక్స్ట్రీమ్'గా ఆలోచించక ముందే ప్రభుత్వం సానుకూల నిర్ణయాన్ని ప్రకటించాలి.

తీరొక్క రీతిలో 56 యేండ్ల సంది ప్రత్యేక తెలంగాణ కోసం కొట్లాడుతున్న ప్రజల ముందు ఇప్పుడు 'తెలంగాణ దేశం' డిమాండ్ చేయడం ఒక్కటే పరిష్కార మార్గమని కందుకూరి శ్రీరాములు చెప్పిండు. ఇది లిటరల్‌గా సాధ్యం కాకపోవచ్చు. అతిశయోక్తి అనిపించవచ్చు. ఇప్పుడున్న పరిస్థితుల్లో తెలంగాణ ప్రజల ధర్మాగ్రహం, కేంద్ర ప్రభుత్వ ఊసరవెల్లి రాజకీయాల పట్ల నిగూఢంగా దాగి ఉన్న నిరసనా, కమిటీలంటూ అఖిలపక్ష సమావేశాలంటూ కాలయాపన చేసే తీరుపై వ్యతిరేకతా వ్యక్తమవుతున్నది. అందుకే "ఇక అసెంబ్లీ తీర్మానాలు/ పార్లమెంటు బిల్లులు అఖ్కర్లేదు/ ఇకనుండి రాష్ట్ర ప్రభుత్వమూ/ కేంద్ర ప్రభుత్వంతో సంబంధమూ లేదు/ ఒక దేశానికి మరో దేశానికున్న / అనుబంధమో బంధుత్వమో మొదలవుతుంది/ ఒకడు ఇచ్చేది లేదు ఒకడు చచ్చేది లేదు/ సపరేట్ రాష్ట్రం కాదు కోరుకునేది/ దేశం కావాలని కోరుకోవటమే..! కొట్లాడటమే..! అన్నీ అయిపోయి అఖరి అస్త్రం వాడుతున్న సందర్భమిది. అంటే తెలంగాణ ప్రజలకు భారత రాజ్యాంగంపై, పార్లమెంటుపై, రాష్ట్రపతిపై విశ్వాసం సడలక ముందే కేంద్ర హోంమంత్రి డిసెంబర్ 10 నాడు పార్లమెంటులో చేసిన ప్రకటనకు ఖచ్చితంగా కట్టుబడి ఉండి తీరాలని ఇవ్వాళ తెలంగాణ ముక్తకంఠంతో డిమాండ్ చేస్తోంది. ఆ డిమాండే ఈ సంకలనంలో అంతర్లీనంగా అక్షరరూపం దాల్చింది. తెలంగాణ ప్రజల హృదయాంతరాలలోని ఆకాంక్షను సంపాదకులు 'జిగర' ద్వారా వినిపించారు. అందుకు వారందరికీ అభినందనలు.. మాట రాసేందుకు నాకు అవకాశం ఇచ్చినందుకు శనార్థి...

– సంగిశెట్టి శ్రీనివాస్

28 డిసెంబర్ 2012



# జిగర్ ✻



# అందెశ్రీ

## తెనుగోల్లా ఎల్లమ్మా ఏదీ... ?

ప । తలమీద సుట్టాబట్టా
ఆ పైనా పండ్లా తట్టా
పండ్లు పండ్లమ్మో అంటూ
పల్ల్యంతా దిరుగుకుంటు
బజార్ల కూసుండమ్మీ
బతుకెల్లదీసుకున్నా
తెనుగోల్లా ఎల్లమ్మా ఏదీ..?
మా పల్లేల్లల్లా
కండ్లల్లా కానారాదేమీ.. తలమీద ॥

చ కమ్మా కత్తీ దీసీ
కొమ్మాలన్నీ గోసీ
జిట్టీత పండ్లూ దెంపీ
బుట్టలా వోసుకోనీ
కట్టామనకా తిరిగమ్మీ
పొట్టాబోసుకున్నా..
తెనుగోల్లా ఎల్లమ్మా ఏదీ..?
మా పల్లేల్లల్లా
కండ్లల్లా కానారాదేమీ.. తలమీద

చ ॥ నల్లాతుమ్మెదలా వోలే
అల్లా నేరేడూ పండ్లూ
బల్లూన తెల్లారంగా
డొల్లాల్ల నింపూకోనీ
ఇల్లూ ఇల్లూ దిరిగమ్మీ
ఇల్లెల్ల దీసుకొన్నా..
తెనుగోల్లా ఎల్లామ్మా ఏదీ..?
నా చిన్నా నాటీ
ఆనావాళ్ళ్యాడా లేవేమీ ॥ తలమీద

చ ॥ చెరువుల్లో దుంపాగడ్డా
చేతనైనంతా బీకీ
కట్టేలా పొయ్యీ మీదా
కమ్మంగా ఉడుకా బెట్టి
ఉడికీన దుంపా గడ్డలు
ఊరూ ఊరంతా అమ్మే
తెనుగోల్లా ఎల్లామ్మా ఏదీ..?
నా తల్లీ జాడా
కండ్లల్లా కానారాదేమీ.. । తలమీద ।

చ చింతా సిగురూ దూసీ
సిన్నసిన్నా కుప్పలు వోసీ
వడ్లా గింజాలు వెడితే
ఒట్టీ శాపాలా పులుసు
వండూ కుంటే.. సాలు
వాడా కట్టంతా వాసన
ఆ రోజూల్యాడా వాయేనా
మా పల్లెల్లల్లా
ఎల్లమ్మా ఏమైపోయేనా
॥ తలమీద

। చ ॥ సిమసింతా కాయాలమ్మే
సిత్పల్కా పండ్లు అమ్మే
కందా గడ్డాతో పాటూ
కందీ కాయుడికేసమ్మే
అనుపా అర్చంతా కాయా
శనిగే గుడాలు ఏవీ..?
ఉలువా కట్టూసే లేదమ్మో
మా పల్లేల్లల్లా
ఉసిల్లా జాడే లేదమ్మో ॥ తలమీద ।

చ । అడవీనీ గుత్తా గుత్తావట్టీ
ఆడానే పొయ్యీ వెట్టి
తిండి గింజాల కొరకూ
తిప్పాలెన్నో పడుతూ
కండల్లా వొత్తులేసుక
కావల్లు కాసిన తల్లీ
తెనుగోల్లా ఎల్లమ్మేమాయే..?
పల్ల్యంతా సూడా
కండ్లల్లా నల్లా పూసాయే । తలమీద ।

చ । తల్లీ కోడీ సుట్టూ
పిల్లాలూ తిరిగీ నట్లూ
బంటోల్లాతల్లీ గంపా
సుట్టూ పిల్లాలగుంపూ
రెండు పావులా దినుసు
ఒక్కా పావేడు పండ్లూ
పెడితే బుద్ధ్యేడ దీరేదీ
కాసన్ని పండ్లూ
కొసరేసి బుజ్జాగించేదీ । తలమీద ॥

చ ॥ చెరువు కుంటాలు పోయే
వలలన్నీ సీకీ పోయే
ముదిరాజులు కలలు
గంగాలా కలసీ పోయే
పొంగీ పొర్లేటీ వాగూ
వంకాలన్నెండీ పోగా
గూడూ జెదిరినా పక్షుల్లా
గంగమ్మా బిడ్డెలు
గూడ్యాలు వొదిలీ పోతుంఁడ్రా ॥ తలమీద ॥

చ దొనెలల్లా తునికీ పండ్లూ
దొరికీనా ఉనికే లేదూ
చిలుకా కొరికీనా జామా
పండ్లా ఎరుకేడా లేదూ
పండ్లూ కాయలతో పల్లే
పలువారిల్లేదీ పోయి
పొరకా పొరుకైయ్యి పోతుందో
మా తెలంగాణా
ఎరుకేమారి పోతుందో
॥ తలమీద ॥

ముంతా మామీడి పండ్లా
ముచ్చట్లు లేనే లేవూ
సిలకమ్మా కలికీ పండ్లా
పలుకూలా జాడాలేవీ
కంట జూద్దామన్న
జుంటీ తేనే లేదు

అడవంతా మాయామవుతుందో
మా పల్లే తల్లీ
అల్లాడీ పోతావున్నాదో ॥ తలమీద ॥

।చ ।    చింతా చెట్లెవడూ నరికే
శిథిలామైనట్టు ఊరూ
కానికాలాల నడుమా
కరువూ రాకాసీ దాడి
పట్టాణాలాకు వలసా
పల్ల్యంతా బోసీవోయి

ఊరూ ఉరుమయ్యీ ఉరిమిందో
తన ఉనికీ పచ్చగ
చిగురూ తొడుగాలను కుంటుందో..





# అమ్మంగి వేణుగోపాల్

## జీవితమే యుద్ధం

నేను తెలంగాణ వాణ్ణి
నాకు ప్రపంచ యుద్ధ నేపథ్యముంది
నాకు రైతాంగ పోరాట సారథ్యముంది
తీగలు తెగినా రాగాలాపన ఆపని వాణ్ణి
రుధిర ధారల్లో కూడా ధైర్యం వీడని వాణ్ణి
నేను తెలంగాణ వాణ్ణి

సిపాయిల విప్లవం నా చరిత్రలో అధ్యాయం
జాతీయ జెండా నాగుండెలో భాగం
కోట్ల ఊపిర్లు పెనవేసుకున్న ఈ ఉద్యమంలో
ఆకాంక్షల పర్వతాలను తలకెత్తుకున్న వాణ్ణి
నేను తెలంగాణ వాణ్ణి

'తెలుగు' అన్నమాట అనుమానాస్పదమైనప్పుడు
చరిత్రలో మునిగి కోటిలింగాలలో తేలినవాణ్ణి
గోదావరి కృష్ణలకు ఉపనదుల్ని బలిచేసి
తాతల కాలం నుంచి తల్లడిల్లుతున్న వాణ్ణి
నేను తెలంగాణ వాణ్ణి

తరం నుంచి తరానికి పోరాటమే వారసత్వం
తీరం నుంచి తీరానికి సుడిగుండాలే రహదారి

పులి పంజాలో పూలగుత్తిని చూస్తున్నవాణ్ణి
నేను తెలంగాణ వాణ్ణి

ప్రజాస్వామ్యంలో నియంతృత్వాన్ని అనుభవిస్తున్నవాణ్ణి
తెలంగాణ భారతంలో ఇదే చివరి ఘట్టం
బతుకే రణరంగం మిగిలిందిక ఊరు భంగం
కుట్రలకు కుట్రలతో జవాబు చెప్పలేని వాణ్ణి
సత్యాన్ని వివాదం చేస్తే సహించలేని వాణ్ణి
నేను తెలంగాణ వాణ్ణి





# అలిశెట్టి ప్రభాకర్

## భాగ్యలక్ష్మి..

నాకు బెర్నార్డ్‌షాలు, షేక్స్‌స్పియర్‌లూ తెలియదు
తనకు గుడిపాటి వెంకటాచలం, గురజాడా తెలియదు
ఇద్దరం ఉత్త పిచ్చివాళ్ళం
కానీ–
అడుగంటిన కిరసనాయిలు స్టవ్‌తో
అన్నం ఎట్లా ఉడికించాలో తనకు తెలుసు
దగ్గు తెరల నెత్తుటి రెపరెపల
ఊపిరితిత్తుల్లో
కవిత్వమెట్లా రాజేయాలో నాకు తెలుసు
ఇద్దరం కలిసి కలగా
కలగాపులగంగా కలసిపోయిన రోజుల్లో
ఇంచుమించు ఒకే కంచంలో
ఇంద్రధనస్సుల్ని తుంచుకుని తిన్న రోజుల్లో
మా గుండెల్లో సమస్యలు మండని రోజుల్లో
సిగరెట్ పేకలాంటి నన్ను
సిగలో తురుముకొని
గాజుకుప్పెల్లాంటి నా కళ్ళలోనే
ఆశల అగరొత్తులు వెలిగించుకుందే తప్ప
తులతూగే ఐశ్వర్యమో
తులం బంగారమో కావాలని
ఏనాడూ ప్రాధేయ పడలేదు.



# అనిశెట్టి రజిత

## ప్రాణహితవై ప్రవహించు..

అగ్ని ప్రవాహమైన ఓ అంబేద్కరా
ఇగ తెలంగాణా ప్రాణహితవై
ప్రవహించు మహోదయా
సుజల స్రవంతి గీతమై ధ్వనించు
తెలంగాణా చిరకాల స్వప్నమై ఫలించు
తొలకరిలా పులకరింతలు చిలకరించు..

చిన్న రాష్ట్రాలను సమర్థించిన
మహాధినేతవు నీవు
రాజ్యాంగ రూపశిల్పకర్తగా
జ్ఞానోన్నత సృజనుడివి నీవు
తెలంగాణా ప్రత్యేకతను గుర్తించిన
దార్శనిక సాహసికుడివి నీవు...

బోధిసత్త్వుని ఆధునిక భారత వారసుడా
నవ బౌద్ధ దమ్మ ఆచరణాత్మకుడా
నీవుంటే మా కష్టం తీరేది
కొండంత అండగా నీ గుండె బలం
మాకూ అబ్బేది
నీ ఒక చేత బతుకు ప్రపంచ గ్రంథం

మరో చేతి చూపుడువేలు
చూపేను మన కర్తవ్య సమరాంగనం...
బాబాసాహెబ్! బహుజన సేనానాయక్
నీ పేరున మహా జల తరంగాల ఉరులింక
ఆదిలాబాద్‌ను అదుముకొని
ఆశీర్వదిస్తాయి
రంగారెడ్డి మట్టి దారులంట
జలకాలాడుతూ జలకళలు
ధూంధాం జేస్తాయి
మాడిపోయిన రైతు ముఖం మీద
ఒక చల్లని నీటి చిలకరింపు
చిరునవ్వై ఓదార్పునిస్తుంది
ఓడిపోయిన సేద్యగాని నాగలి
ఒక కొత్త పదునుతో భూమిని దున్నేస్తుంది

సుగమ మార్గమున తెలంగాణా
వానకారు కోయిలలు ఎలుగెత్తి
యవుసం పాటలు పాడుకుంటయి
గడ్డి చిలుకలు గుంపులుగా
పంట పొలాల గట్లమీద చేరి
బురదనేలను ముద్దాడి
ముచ్చట్లాడుకుంటయి

అంబేద్కరా! ఆయకట్టుల ఆయువు పట్టువై
ఆశలు పండించు
జలధారల గలగల విద్యుత్‌వై ఆవహించు
సస్యశ్యామల సంగీతమై మా ఏడు జిల్లాల
ఎడారి బతుకుల్ల నవ్వులు పూయించు

ఇక తెప్పరిల్లవమ్మా తెలంగాణమ్మా
నీ ప్రాణాలను నిలబెట్టేందుకు

శిరమెత్తిన ఉద్యమ పతాకమై
అంబేద్కరుడే నీటి ప్రాజెక్టుగా
నిప్పులను తడుపుతూ నీరై
సంతసాన మెరిసే కన్నీరై
వస్తున్నాడమ్మా నీ బిడ్డడిగా
తెలంగాణమ్మా ఆహ్వానించమ్మా
మనకు కాలం కనిస్తున్న ప్రేమయోధున్ని
అనురాగాలు మీటే ఆ అమలిన పుత్రున్ని
ప్రాణహితవై ప్రవహించమని..






# అన్నవరం దేవేందర్

## బృహత్కవిత

కరీంనగర్‌గా పులశిల్లుతున్న సబ్బిసాయర
వేల ఏళ్ళుగా నిబాయించుకున్న నాగరికత

శాతవాహనరాజు సిముకుని కవి
గుణాఢ్యుని బృహత్కత
ప్రపంచ జాతక కతల్లోకి పారింది
'పైశాచీ' బృహత్కతను
సోమదేవుడు 'కథా సరిత్సాగరం' పేర
సంస్కృతీకరించిందిక్కడే

హాలుని 'గాథా సప్తశతి' నుంచి
సినారె 'విశ్వంభర'దాకా
జగజ్జేయమానం చేస్తున్న భూమి ఇది

కంద పద్యం కన్పించింది కురిక్యాలలో
నన్నయ్య కన్నముందే
జనవల్లభుడు కందం చెక్కిండు
కన్నడ ఆదికవి పంపడు
మన కొంప వాడే

రాజుల ఆస్థానాల్లో పద్యాలల్లిన
మడిక సింగన, వెలగందుల నారయ

చరికొండ ధర్మన వేములవాడ భీమకవుల
వాదనలోనూ వేదన ఉన్నది

దశాబ్దాలు దశాబ్దాలు శతాబ్దాలు శతాబ్దాలు
శకలాలు శకలాలుగా పోతున్నాయి
సాహిత్య కర్త లెందరున్నా
సామాన్యులకై పిడికిలెత్తిన వాళ్లు పిడికెడు మందే
ఎలగందుల వేములవాడ కొటిలింగాల
దూళికట్ట రామగిరి ధర్మపురి పెద్దబొంకూరు
ఎన్ని బొంకులైనా బొంకు
ఆ కట్టడాల్లోంచి నాకు
మనిషి సచ్చిన కమురు వాసనే వస్తుంది

ఎన్ని రాజ్యాలు ఎన్ని బురుజులు
నిర్మించిన దొరల గడీలెన్ని
ఎన్ని చేతులిరిగినయి
ఎవని కాళ్ళకు దండం పెట్టాలె
ఎవని తలకాయ కొట్టాలె

నేడు కరీంనగర్ ఒక సంకేతం
కరీంనగర్ ఒకానొక సందర్భం

కరీంనగర్ పల్లె
గాయమై కలవరిస్తున్న పెయ్యి
ఒర్రొర్రి బొంగురు పోయిన బొండిగ
కొలిమిలోంచి తెచ్చిన గొడ్డలి శిప్ప
తల్లడిల్లుతున్న తనువు
సబ్బండ వర్ణాల తల్లి





# అయాచితం నటేశ్వరశర్మ

## చద్దుల బతుకమ్మ

చద్దుల బతుకమ్మ
చల్లగా చూస్తది
చెరువు కట్ట మీద కూర్చొని
బరువులు బాధలు చెప్పుకుంటే
చెలికానిలా ఓదారుస్తది
ఇంటింటినీ తీర్చిదిద్దే బతుకమ్మ
కంటి వెలుగుల్ని కలకాలం కాపాడుతది
పూటగడవనినాడు పొద్దున్నే ప్రత్యక్షమై
ఆటపాటలతో సేదదీరుస్తది
రగిలిపోయే ఆకలిని చల్లార్చడానికి
మిగిలిపోని చద్దిని నోట్లో పెడ్తది
దారుల్లో ఎక్కడ చూచినా బతుకమ్మే
తీరులసౌరులతో బ్రతుకుమంటది
పోరి సాధించుకొమ్మంటది
ధైర్యంతో నిలబడుమంటది
శౌర్యాన్నే ఎప్పుడూ కొలువుమంటది!





# అన్వర్

## చార్మినార్

మనిషెంత చిన్నవాడు నీ ముందు
నిన్ను పూర్తిగా తలెత్తి చూస్తేనే
నీకూ గౌరవం మాకూ గౌరవం ఆహ్లాదం

❋

పురానీ బస్తీమే
పురానీ నిషానీ
చార్మినార్
భాగ్యనగర్‌కీ షాన్-

❋

చార్మినార్ ఎక్కినకొద్దీ ఎక్కాలనిపిస్తది
కూసున్నకొద్దీ కూసోవాలనిపిస్తది
మీనార్లసుట్టూ తిరిగినకొద్ది తిరగాలనిపిస్తది

❋

నాలుగు మీనార్ల మీదికెళ్లి
మబ్బులు తగులుత పోతుంటయి
మీనార్లల్ల జతకూడిన పావురాలు
ప్రేమజంటలకు కువకువలు నేర్పుతయి

❋

ఒంటరిగా చార్మినార్ కొచ్చి
తమ జంటపేరు చెక్కిండ్లెందరో ప్రేమికులు

చార్మినార్ ముందు గడియారం
పేదవాని గుండెలాగా పనిచేస్తనే వుంటది
చార్మినార్ మైసమ్మ గుడిల గంట
అజాతో పాటు మోగుతనే వుంటది

❋

దూరంగా గోల్కొండ
ఫలక్నుమా ప్యాలెస్లు  కనిపించి సంబరపెడతయి
కంటికి దగ్గరగా జామా మసీదు
నిజామియా జనరల్ హాస్పటల్లు కనిపిస్తయి

❋

పురానీబస్తీ ప్రజలు చార్మినార్ సుట్టూ
దినాం ఎన్ని ప్రదక్షిణలు చేస్తరో...
గరీబ్లోగోంకా అడ్డా – చార్మినార్
గరీబ్ లోగోంకా హర్ ఏక్మాల్ – చార్మినార్

❋

చార్మినార్కు పోటీగా
హైదరాబాద్ సుట్టుతా
ఎన్నో కొత్త కట్టడాలు కట్టిండ్లు-
ఏది సుత చార్మినార్ కాలేదు

❋

హైదరాబాద్కు మరోపేరు చార్మినార్
చార్మినార్కు మరోపేరు పురానీబస్తీ
పురానీబస్తీకి మరోపేరు తెలంగాణ

❋

విదేశీయులు స్వదేశీయులు అందరొస్తరు కానీ
అంధ్రోనికి గీడికి రావాలంటేనే ఉచ్చ బడ్తదీ





# అంబటి వెంకన్న

## నను గన్న పల్లె

ప  నన్నుగన్న పల్లే తల్లి నా జిల్లా నల్లగొండ
వెలసినావు వైభోగంగా – నిలిసినావు గుండెల నిండ

చ॥ సింగభూపాల రాజు రాజధాని రాసకొండ
యాదవర్షి తపసు ఫలితం తెలంగాణ తిరుపతి కొండ
యాదగిరి లక్ష్మి నర్సింహ్మా నీ గర్భాన వెలసీనాడమ్మా
పానగల్లు నిలయామైన పచ్చల సోమేశ్వరుడు
చాళుక్య చోళుల నాటి దట్టమైన శిల్పాలెన్నో
త్రికూటాలయములో ఉన్నా ఈ నీడల గమ్మత్తు నీవేలే ॥నన్నుగన్న॥

చ॥ సోగుబద్ధ కొండలు నింద భోనగిరి వేములకొండ
కొండమీద పేర్చిన గుండ్లు చెరువు గట్టు మూడు రాళ్ళు
సెరికల్లో దాగిన శివుడమ్మో ఈ జడగట్టి ఎత్తుకున్నాడా
నీలగిరి కొండలు రెండు నింగినెపుడు వంచుతునుండు
ఆ మెడలో బంగారు హారం మెరిసేటి దేవరకొండ
కులమత బేధం లేకుండా ఈ కూడుండే సంపద నిచ్చినవే ॥నన్నుగన్న॥

చ॥ నైజాము పాలనలోన రగిలినట్టి రజాకార్లు
మాన ప్రాణాలెన్నో దీసి దోసుకున్న దొంగల గుంపు
గుర్రాల సకిలింపింటేనే నీ గుండె సప్పుడాగిపోయిందా
ఖాసీము రజ్వీగాడు కండ్లెర్ర జేసిననాడు

నీకన్నా బిడ్డాలంత ఎదురు నిలిసి పోరాడింద్రు
ఏమిరాత రాసుకున్నావే ఈ నెత్తురంటని జాగే లేదాయె
నన్నుగన్న పల్లే తల్లి నా జిల్లా నల్లగొండ
తిరగంగా ఊరూవాడ కనరాదు నీటిజాడ ॥నన్నుగన్న॥

చ॥ గల గల గోదారమ్మ పొలిమేర దాకకుంట
పరిగెత్తి పరుగూలెత్తి పొంగిపొర్లి సంద్రము జేరే
మనమేమి పాపం జేసినమో ఈ సుక్కనీటి కెక్కిళ్ళు బెడ్తీమీ
బిరబిరా వచ్చిన కృష్ణ నల్లగొండ నడుమా జేరి
సంద్రమంటి సాగరులోన చెంగనాలు దోలూతుంది
ఎన్నిరాళ్ళు ఏరుకొచ్చేనూ ఈ గుక్కెడన్న గొంతు జేరంగ నన్నుగన్న

చ॥ కాళ్ళుజూసి సెప్పొచ్చయ్యో కంకనాల పెల్లోడాని
తాటికల్లు పాలూనీల్లు మొత్తం అంత ఫ్లోరిన్ మయము
కాలుజెయ్యి మెలికలు దిరిగేనే ఈ శివరామ ధనుసులాయెనే
నింగి తొంగీ చూసీనట్టు వంగి వంగి నడిసే మాకు
రెండు కాళ్ళు ఈడ్చి ఈడ్చి మోకాల్ల సిప్పలు అరిగే
కాళ్ళీడ్సే గాడిద బతుకాయె మము జూసే దిక్కే లేదాయె ॥నన్నుగన్న॥

చ॥ ఈగముసిరి గడ్డల్లాంటి చక్రాల బండ్లను డొలిపి
ఉన్నొక్క చెయ్యిగూడ కాయగాసి కంతిదేలే
కవికరించె దేవుళ్ళేరయ్యో.. మా ఉసురు దగిలి ఒరిగిపోతారే
మూతి మీసమొచ్చిన గాని అమ్మసంక దిగరాదాయె
వచ్చినోనికి పబ్బుతిబట్ట ఒక్క సెయ్యి కదలక పాయె
పొగరుబోతు గడ్డనుకుంటారే పొర్లుదండాలెన్ని పెడుతున్నా





# అడువాల సుజాత

## పాలపిట్టల తోట సంతకం

తేనెపలుకుల తేటగీతి అమె
అప్యాయతల లతలు అల్లుకున్న
పలుకుబడుల చెట్టు రీతి ఆమె
నిప్పుకణికలా నిజతేజం అమె నీతి
ఆత్మగల్ల పూర్ణజీవని యశోదమ్మ
పాల పిట్ట పాట సంతకం అయమ్మ
తేనె పువ్వుల తోట పద్యం అయమ్మ...

తెలంగాణా జాతీయాల బొందుమల్లెలు
తురిమిన సిగతో
జాతి పౌరుషాలు చిమ్మిన
మేరు నగధీర
చూడ చక్కని తల్లి అయమ్మ
పాలమూరు అక్షరోద్యానవనంలో
బిజినేపల్లి మట్టి పొత్తిళ్ళలో
కాశిరెడ్డి సరస్వతమ్మల సంతానమై
కోతిలా కొమ్మచ్చిలాడుతూ కేరింతలు కొట్టిన
కొంటె కోనంగి కొదమ సివంగి అయమ్మ...

రంగుల జగత్‌జట్టీ విశ్వవిఖ్యాత చిత్రకారుడు
పి.టి.రెడ్డి మనసు గెలిచిన సహచరి

దక్కన్ రేడియోలో మహాలక్ష్మి ముచ్చట్లతో
తెలుగు పల్లె తేనెలు పంచిన కొండమల్లి
ఎచ్చమ్మ తెనుగు కథావీధుల్లోకి తెచ్చిన
కలం కత్తిపట్టిన కదనాల సాహసి..

పోతన కావ్యసుధలు హరివంశోత్తర తత్వాలు
ఎఱ్ఱాప్రగడ ప్రతిభోత్పత్తులు
ఉత్తహరివంశ విశదీకరణలు
మా ఊరి ముచ్చట్ల తప్పెటలు
ధర్మశాలల కథా కమామిషులు
హరిశ్చంద్రోపాఖ్యాన ద్విపదలు
విరచించిన నిత్య పరిశోధకురాలు
విశ్లేషించిన యశోవంతురాలు...

నారదీయ పురాణాన్నీ- నాచన సోమనూ
భారతంలో స్త్రీనీ - కథా చరిత్రనూ
వచన వాచక గరళాన్ని సరళం చేసిన
మన మట్టిన మొలిచిన బొడ్డెమ్మ
భావికలో దేశీయతనూ జాతీయతనూ
ఉగాదికి ఉయ్యాలలో సహచర్య సరసితనూ
భాషతల్లి తలపై తలంబ్రాలుగా
పోసిన పామర పండితాచార్యిని
అధికార తెలుగు భాషను జనం శ్వాసతో
అభిషేకించిన విప్లవ పూజారిణి...

ఏ భాషకు ఆయా స్థానిక
యాసలే జీవనాడియని
జీవన పర్యంతం అనర్గళ ధ్వని కావ్యమైన
ఆ కలకంఠి గళ గాంధర్విని
నిరాడంబరత్వం నిర్భయ వ్యక్తిత్వం
కలబోసుకున్న సాంఘీక తపస్విని...

మహబూబ్‌నగరపు రైతుబిడ్డ
భాగ్యనగరంలో పొంగిన తియ్యని జున్నుగడ్డ
కరీంనగరం అన్నారం గ్రామంలో
పాకాల వారింట మెట్టిన వానకోయిలమ్మ
తెలంగాణింట తీరొక్క పువ్వులతో
తీర్చిన వన్నె చిన్నెల బతుకమ్మ
'సుధర్మ' పతాకమై ఎగిరిన యశోదమ్మ
తెలుగు సాహితీ సీమలో విరబూసిన
అమృత పుష్పరాగం!
మన సాహిత్య వైతాళికంలో పొదిగిన
జాతి రత్నం!







## ఆశారాజు

*

# చిలుకల మేడ

చార్మినారే లేకుంటే
ఇంతకాలం చందమామ
దీపంలా వెలిగేదికాదు

లాడ్‌బజార్ కనిపించకపోతే
బారాత్‌లా తారలు బారులు తీరి
గుంపులుగా చేరేవికాదు

గుల్జార్ హౌజును చూడకుంటే
ఇంద్రధనుస్సుకి యిన్ని
హోలీ రంగులు తెలిసేవికాదు

మూసీనది నగరంలో పారకుంటే
దుమ్మునిండిన అద్దానికి
వడ్డాణం గుర్తుండేది కాదు

మ్యూజియం ఇక్కడ లేకుంటే
సాలారుజంగు కలగన్న సౌందర్యం
తరాల పిపాస తీర్చేదికాదు

ఫలకునామా కట్టకపోతే
ఎగిరే చిలుకల అందం

కదిలే గాలిలో నిలిచేదికాదు
దేవిడీలు కనబడకపోతే
ఊగేటి ముత్యాల దండకు
నగిషీల సొంపులు దొరికేవి కాదు

గోలకొండను చూడకపోతే
మబ్బులు రెక్కలార్చడానికి
చరిత్రమెట్లు దొరికేవికాదు

ఇరానీ హోటళ్ళు లేకపోతే
ఎదురు చూసే మిత్రుడికి
స్నేహంరుచి తెలిసేదికాదు

గండిపేటను చూడకుంటే
ముషాయిరాలో షాయరీకి
ఇంత లోతుండేదికాదు

అత్తరు పరిమళం లేకపోతే
పిలిచి కూర్చోబెట్టే
మర్యాద అబ్బేదికాదు

రంజానూ బోనాలూ చూడకపోతే
భిన్న మతాలు కలిసి బతికే సంస్కృతికి
ఆనవాళ్ళు దొరికేవి కాదు

నుమాయిష్ రాకపోతే
అలసిన మనసులకు
సేద తీర్చే రుతువు దక్కేది కాదు

మనుషుల సందడి పెరుగకపోతే
అల్లాను ఇష్టంగా అడిగిన

పాదుషా కోరిక తీరేది కాదు
ట్యాంకుబండు లేకపోతే
మువ్వలు మోగే ఉదయాలకు
జరీ అంచుమెరుపులు వుండేవి కాదు

హైదరాబాదు లేకుంటే
మల్లెపందిరిలా అల్లుకొన్న
ఆకాశం కూడా వుండేది కాదు





# ఆడెపు లక్ష్మణ్

## ఎలుగందుల దో మినార్

తలపై కదులుతున్న మేఘ సందేశాలను
అందుకుని ఆడుకుంటుంది మా దోమినార్
మహబత్ మైకంలో మైమరిచే జంటలను
తన బాహువుల్లోకి తీసుకొని
మబ్బుల పడవలెక్కిస్తుంది
మా ఊరి హునర్

చుట్టూ పచ్చలారబోసినట్లున్న ప్రకృతిలో
మానేరుడ్యామ్ గలగల సవ్వడులు
ఆహ్లాదరాగాలు తీస్తుంటే
చల్లని పిల్లగాలి వీచికలు
అలాయి బలాయి తీసుకుంటునట్లు
ఆత్మీయాలింగనం చేసుకుంటయి..

రాయి రప్పా చరిత్ర అనవాళ్ళను
పైకి తేలుస్తుంటే భూగర్భంలో దాగిన
బావులూ అర్రలూ ప్రాంగణాలూ
అశ్చర్య చకితం చేస్తుంటయి
ఔరంగజీబ్ రాచరిక తహెజీబ్‌తో
పలకరించినట్లు మేను జలదరిస్తుంది..

గంభీరంగా శిరసెత్తి నిలబడిన
అందాల ఎలుగందుల ఖిల్లా

దూసిన ఖడ్గం
తరగని రక్తదాహానికి గుర్తులా అనిపిస్తుంది
యుద్ధదాడుల్లో గాయపడిన కోట గోడలు
ఇదీ మాకథ అని సలాం చేస్తాయి..

అటు ఖిల్లా ఇటు దో మినారు
శకలాల నుండి
గత స్మృతులు దూసుకొచ్చి
గాలిని సెగలెక్కిస్తయి
ఈ మట్టిలో పుట్టి అమరులైన
ఆశయ శూరులను యాదికి తెస్తయి..

సాహిత్య ప్రేమికుడు ఎల్లందుల నారన్న
మదిలోకొచ్చి కవితాత్మను వెలిగిస్తాడు
మా ఊరి పరంధాములు నేసిన చీరె
అగ్గిపెట్టెలో ఇమిడి
ఖండాంతర ఖ్యాతిని మూటగట్టిన మురిపాలు
కళామతల్లి కిరీటాన్ని గర్వంగా ముద్దాడుతుంది..

కోట పక్కనే పారుతున్న
మానేరు వాగు ఝురులు
టక్ టక్ మగ్గాల చప్పుళ్ళతో కలసి
నేతకారుల బతుకు పాటల్ని వినిపిస్తయి..
చూడ చక్కని నేత బట్టలు
రంగు రంగుల దృశ్యాలై మురిపిస్తయి..
మా ఎల్లందుల ఖజానాలోని
చరిత్ర సంపద ఖిల్లా- మినార్‌లు
ఊరి పొలిమేరల్లో నిలబడి
రండి రండి అంటూ షాన్‌గా
పచ్చిక తివాచీలు పరిచి
స్వాగతిస్తుంటయి..





# ఉదారి నారాయణ

## వీరుల పండుగ

గతంలోంచి వర్తమానానికి
ప్రయాణించేవాడే అమరుడు
అమరుని ధీరత్వాన్ని
జనం మెచ్చుకోవడమే
అతని మహోన్నత జ్ఞాపకం
వీళ్లు అమరులనడానికి
పండగలైన పల్లెలే ప్రభల సాక్ష్యం

తల్లి భీంపాత్మ కొంగు స్పర్శ ఎంత గొప్పదో
హస్సేన్ హుస్సేన్‌లు చివరి నెత్తిటి చుక్కతో
యుద్ధభూమికే తిలకం దిద్దారు

ఇక్కడ ఎవరిని కదిలించినా
పూలకొమ్మని ఊపినట్లు
దూలపాటలే రాలుతుంటాయి
మహా చరిత్ర సందర్భానికి
జనం ఉత్సాహమవుతుంటారు

పీరీలు, సవార్లు, పంజలు
వీరులారా!
ఎక్కడో ఎప్పుడో ఆరిపోతే

ఆరని దీపాలకు చమురై
మిమ్మల్ని మళ్లీ వెలిగిస్తున్నారంటే
నిజంగా మీరు వీరులకు వీరులే

స్మరించుకోవడంలో గొప్ప ఆనందాన్ని
మీ ప్రాణార్పణలే చూపిస్తున్నాయి

చిన్నా పెద్దా అందరు
ఒకచోట కలసి సంద్రమై
పండగ వరవళ్లవుతున్నారంటే
కచ్చితంగా మీరు ప్రజలు మెచ్చిన శూరులే

సంబరాల సంద్రాన్ని చూసి
మతం ఎక్కడో తలదాచుకుంది
కులం గోతిలో పడి కుంటిదైంది

మీరు ప్రజల స్వప్నమని
మీ త్యాగాలు ప్రజల ఊపిరని
మీకో ధర్మ నియతి ఉందని

కాలం మారినా జీవితాలు వాడినా
బతుకులు దర్భరంగా శుష్కించినా
మీ ఆత్మార్పణని కథలుగా, గాధలుగా
చెప్పుకుంటునే ఉంటారు
మీ అమరత్వాన్ని పీరీల జెండాలుగా
ఎగిరేస్తునే ఉంటారు





# ఎన్.గోపి

## తంగెడు పూలు

తంగెడుపూలు అంటే ఒప్పుకోను
బంగరుపూలు
పొంగిన విచారాన్ని
దిగమింగిన పూలు..

వెలగలిగిన గులాబీలకన్న
వెలవెలబోయే మల్లెలకన్న
వెలలేని ఈ పూలు మేలు..

తెలుగువారి బతకమ్మల కమ్మని మొగాల
వెలుగు నింపు పూలు
కాపుకన్నెల ముద్దు గొలుపు
ముద్ద కొప్పుల్లో
కాపురముండే పూలు..

మనసున్న పూలు
మమతలున్న పూలు
వాసన లేకున్నా
వలపు బాసలు నేర్చిన పూలు..

పేద పూలు
పేదల పూలు
తంగెడు పూలంటే ఒప్పుకోను
బంగరు పూలు



# ఎన్. వేణుగోపాల్

## ఐలయ్య, రాయలింగు నగర్, మే 6

కటిక చీకటి కమ్మిన కారు నల్లని మేఘం
అంచుల మీద మెరిసే వెండిరేఖ
భళ్ళున హర్షమై కురుస్తుంది
ఇక మైదానం కాంతి పుంజాల కదనసీమ

పాదముద్రలు చెరుపుకుంటూ
నడవవలసి వచ్చిన చోట
లక్షల పాదాలు నేలమీద
చెరగని బాటల నినాదాలు రాస్తాయి
ఇక నగరం ఒక నవజీవన రవళి

ఐదు యుగాలయిన సంవత్సరాలు
పిడికిట్లో మూసిపట్టుకున్న గొంతులు
రెక్కవిప్పిన పావురాలయి
ముక్తకంఠమవుతాయి
ఇక ప్రకృతంతా ఒక ప్రభంజన ధ్వని

వెలిగే దీపాన్నార్పుతావు
మంటల మైదానాన్నేం చేస్తావు
కదిలే పాదాన్ని నరుకుతావు

గడ్డిపోచలకి పాదాలు మొలిస్తే ఏం చేస్తావు
పలికే గొంతును నులుముతావు
గాలి నినదించేటప్పుడేం చేస్తావు

చూడు
ప్రతి మిణుగురు మీదా
ప్రతి ముందడుగు మీదా
ప్రతి గాలి తెమ్మెర మీదా
పరుచుకుంటున్న ప్రజా విశ్వాసం

('పాఁవురం'లోంచి)






ఎం. ఏ. బాసిత్

# కొమురం భీమ్!

ఇప్పుడతడు
ప్రాతఃస్మరణీయుడు..

ఇప్పపూల వనంలా
అప్పుడప్పుడె వికసిస్తున్న
లేత్రాయపు స్వచ్ఛత! మల్లెపూల మనస్సు..
అడవి బిడ్డకు అలివైన తెగువ!
కొదమ సింహమె తలవంచిన పటిమ!

వెన్నెల రాత్రి... ఆకాశం నిండా మెరిసిన
తొలి యవ్వన ప్రశ్నలు..

వెన్నెల వెలుగుకు అధిపతి ఎవ్వడు?
అడవితల్లి ఒడిలోని సంపదకు
వారసుడెవ్వడు?
పోడుజేసిన భూమికి
పాతమైన కమతానికి
అధికారమెవ్వడిది?

నేలతల్లిని కన్న బిడ్డలకు
దూరం చేస్తున్న దెవ్వరు?

కబ్జాకోరవ్వడమె సర్కారు ఇజమా?
ప్రకృతి సంపదను
ప్రజల్నుంచి లాక్కోవడమే పాలక నైజమా?

అడవి జొచ్చిన సర్కారుకు
ఆ బలిమి ఎక్కడిది?

కొరికొర్ల సర్కారుకు
ఉప్పందించిన ద్రోహమెవ్వడిది?
నాటి గూడెం గుట్టు, నేటి తెలంగాణ గుట్టు
చక్రభ్రమణం చేసుకున్న విద్రోహం
పరాయి పాలనకు కోవర్టై
గుండె బలమిచ్చింది కలుగుతవ్విన బయటి దొంగకు
పలుగు పారా ఇచ్చింది
ఇంటి దొంగే కదా?

చరిత్ర పునరావృతమైనట్లు
బ్రిటిషోడు నిజామోడై
వలసాంధ్ర పాలకుడుగా
పునరావిష్కృతమవ్వడమే కదా
వికృత వాస్తవం?
అచ్చమైన మనిషికి...
జీవితమంటె పోరాటమే కదా?

ఆదివాసీ గూడుజొచ్చిన
గూండారాజ్ మీదికి
జెండా ఎత్తిన యోధుడా!
పొద్దున్నె... తెలంగాణకు
అచ్చంగా పొద్దోలె.. నువ్ కనబడతావ్....!
పందికొక్కు పరాయిపాలన ధిక్కరించిన
బిర్సా ముండా... రాంజీ గోండు

భూంకార్ హూంకరింపైన గుండాధర్
నైజమోడి గుండెల్లో..
మావూళ్లో మా రాజ్యమని
స్వావలంబ పతాక పాతిన
జోడెన్‌ఘాట్ వీరుడా కొమురం భీం!
నూతన మానవ సారమైన యోధుడా!
నువ్విపుడు వేలాది పోరుబిడ్డలై
ఈ గడ్డమీద పునరుద్ధస్తావ్
స్వావలంబ వటవృక్షమై నిలుస్తావ్





# ఎస్వీ సత్యనారాయణ

## నుమాయిష్

నా బాల్యం హైదరాబాద్ పాతనగరం
నగర జన సరోవరంలో పూచిన పల్లె పుష్పం
నాకు ఆట, మాట, పాట నేర్పిన వీధులకు, వాడలకు నమస్కారం

చిన్నప్పటి మా ఇల్లు అనుబంధాల పొదరిల్లు
అమ్మా నాన్నలతో పాటు మేనమామ మేనత్తలూ, అన్నదమ్ములూ,
అక్కా సెల్లెండ్రు, వదినా మరదళ్లూ
ఇల్లంతా ఒక జన సముద్రం-

పాత పెంకుటిల్లే మా భూలోక స్వర్గం
నేలతల్లి మాకు పూలపాన్పు
ఆకాశం మా ఊహల హరివిల్లు
పై కప్పు చిల్లుల్లోంచి మెరిసే నక్షత్రాలు మా నేస్తాలు
కురిసే వాన చినుకులతో నిండే గిన్నెల ధ్వని మా సంగీతం-

చుట్టూతా మనుషులుండేవారు
మమతలుండేవి..ఆప్యాయతలుండేవి... ఆత్మీయతలుండేవి..
ఎవరైనా అతిథులింటికొస్తే
మమ్మల్ని పేరుపేరునా పరిచయం చేసేవారు
బహుశా వారు మమ్మల్ని చూడడానికే వచ్చేవారనుకుంటా-
ఏడాదికోసారి నుమాయిష్‌కెళ్ళి

ఏవేవో వస్తు సముదాయాలను అలా చూస్తూ చూస్తూ పోతూపోతూ
ఒక చిన్న ఆట వస్తువును జ్ఞాపక చిహ్నంగా కొనుక్కెళ్లే వాళ్లం
అది నా తిరిగిరాని బాల్యం- తిరుగులేని జ్ఞాపకం-

నా యవ్వనం హైదరాబాద్ మహానగరం
అనుభవాలతో మొద్దుబారిన వట వృక్షం
కొంతపేరు, ప్రతిష్ఠ, గుర్తింపు, గౌరవాలతో పాటు
బతక నేర్చిన లౌక్యాన్నీ నేర్పునూ నేర్పింది

ఇప్పుడు మాదో చిన్న కుటుంబం
మేమిద్దరం.. మాకిద్దరే
ఇప్పుడా ఇద్దరూ రెక్కలొచ్చి విదేశాలకు వలసపోగా
మిగిలింది మళ్ళీ ఇద్దరమే
ఎవరిలోకం వారిది.. ఎవరి ద్వీపం వారిది-

ఇప్పుడు ఇంటినిండా బోలెడు వస్తు సామాగ్రి ఉంది
కంప్యూటర్, వాషింగ్‌మిషిన్, డిష్‌వాషర్, ఎల్‌సిడి
మైక్రోవేవ్, రైస్ కుక్కర్, సీడీప్లేయర్, ఐపాడ్...
ఇప్పుడెవరైనా బంధువులొస్తే
పేరు పేరునా ఈ వస్తు విశేషాల వివరాలు వర్ణిస్తుంటాం
ఇప్పుడు మా ఇల్లే ఒక మినీ నుమాయిష్-

ఇక మమతలూ, ఆప్యాయతలంటారా...?
అవి నిఘంటువుల్లో తలదాచుకుంటున్నాయ్-

మా చిన్నప్పుడూ ఇంటినిండా మనుషులుండేవారు
వస్తువులను చూడడానికి నుమాయిష్ కెళ్ళేవాళ్ళం
ఇప్పుడు ఇంటినిండా వస్తువులున్నాయ్
మనుషులను చూడడానికి నుమాయిష్ కొస్తున్నాం-





# ఎస్.రఘు

## ప్రత్యేక పంచాంగం

తిథులు నక్షత్రాలు
వారాలు వర్జ్యాలు
రాశీ ఫలాలు శుభ ముహూర్తాలు లేని
కొత్త పంచాంగ శ్రవణం వినబడుతుందా?
రాజ్యం బులెట్లకు కూలిపోయిన
ఆనాటి అమరవీరుల సాక్షిగా
మార్మోగుతున్న మలి ఉద్యమగానం వినబడుతుందా?
ప్రపంచమంతా తిరుగుబాట్లు
పురుడు పోసుకుంటున్న వేళ
నెలలు నిండిన ఉద్యమం
ఆశల మామిడి తోరణాలు అల్లుకుంటూ
కొత్త శిశువు కోసం నిరీక్షిస్తుంది
విజ్ఞాన పుటల్ని నెమరువేస్తూ
చారిత్రాత్మక పోరాట అధ్యాయాల్ని రచిస్తూ
ప్రత్యేక స్వప్నం కోసం
కునుకు లేని కాలంతో పోటిపడుతున్నాం
విద్యాలయాల్ని విశ్వమంతటికీ చేరువ చేస్తున్నాం!
విరిగిన లాఠీ పేలిన రబ్బర్ బులెట్ల మధ్య
వేపపూతలు మామిడిపిందేల్లా రాలిపోతున్న
బంగారు క్షణాలను లెక్కిస్తున్నారా?
మా ఉగాదుల నిండా

బాష్పవాయువు అలముకుంది
మా ఉషస్సుల మీద
కొత్త కేసులు మొలిచాయి
పండుగ గుండెల్నిండా చేదుజ్ఞాపకాలు
పగిలిన అద్దాలు, ముక్కలైన విగ్రహాలు
మా బలిదానాల ముందు మోకరిల్లుతున్నాయి!
ఉద్యమకారుల్లో ఎగసిపడుతున్న ఎర్రటి మంట
మా భూమికి వెలుగవుతుంది
కొత్త ఉగాది గొంతుల్లో
ప్రత్యేక పంచాంగం ప్రతిధ్వనిస్తుంది-





# ఎలనాగ

## ప్రాణ చిహ్నం

పచ్చని బీరపూల పసిమితో
మిసమిసలాడే నా పల్లె తెలంగాణా!
కుదురైన వానకారులో
చిగురు కమ్మిన చింత తోపుల సాక్షిగా
కరువు లేనప్పుడు కమ్మగా నవ్వే
చెరువు కట్ట సాక్షిగా
కట్టమీద విరగబూసిన
కట్టపూల సాక్షిగా
సర్వతోముఖ వైభవసిరితో
నువ్వు తులతూగే దాకా
శ్రమనూ స్వేదాన్నీ ధారపోసే
సుందర స్వప్నపు ఆత్మ మీద
యథార్థాన్ని శరీరంగా కప్పే
క్షణం కోసమే నా నిరీక్షణం

జాజిరి పాటలతొ జాలువారే సీమ
బతుకమ్మల, బోనాల, కోలాటాల సంబరాలతో
అతి కమ్మని కోలాహల సంరంభం
మొగ్గవిచ్చి నర్తించే పూదోట
సకినాల వర్తులాల నయరాగాల్లో
సుఖపారవశ్యాన్ని మమేకంగా చుట్టా

నాసికలకూ, నాలుకలకూ నైవేద్యం పెట్టే
ఒక రుచిరోద్యాన వాటిక
ఎన్ని విధాల వర్ణించినా తనివి తీరక
ఎదలోపల మాకింకా మిగిలేది వెలితే

కల్మషమంటని కలుపుగోలుతనాన్ని
వెన్నెల వంటి సున్నితాంతరంగంలో కలబోసి
నవనీత హృదయ మృదుత్వంతో
స్వాగతించే తెలంగాణ పల్లెలు
ప్రచండ తాపంతో వేగిపోయే
ఎడారి వక్షమ్మీద
మంచుకురిసే చలువ పందిళ్లలాగ వ్యాపిస్తయ్

సుతిమెత్తగా మీటిన
వీణాతంత్రుల్లాగ
అనుకంపతో అల్లల్లాడే
ఈ తెలంగాణ పల్లెలు
మా గుండె చప్పుళ్లు కొలువై ఉన్న
ఆత్మీయతా దేవళాలు
దిగులుకు ఎర అయిన హృదయాలకు
దిటవును చేకూర్చే ఈ పల్లె వాడలు
మా జీవన చైతన్య స్థావరాలకు జీవనాడులు

అందమైన కల అయిన ఈ తెలంగాణ
పచ్చబొట్టులా మా దేహాల్లోకి ఊహల్లోకి
ప్రగాఢంగా ఇంకిపోయిన ప్రాణ చిహ్నం





# ఎలికట్టె అయిలయ్య

## నకాషీ కళ

ధనాలకోట వారి వంశవృక్షం
ధరణిపై వర్ధిల్లుచుండు నిత్యం
ధనాల కోటవారి నకాషీ కళాఖండం
ధరణిపై నిలిపింది కీర్తి కిరీటం

కరీంనగర్ జిల్లా వేములవాడ తిప్పాపురం
వీరి పూర్వికులు పుట్టిన పుణ్యస్థలం
వరంగల్ జిల్లా చేర్యాల పురమందు
చేసుకున్నారిక్కడ స్థిర(ని)వాసం..

నకాషీ కళ వీళ్ళకు ప్రాణవాయువైంది
ఇంటిల్లి పాదికి జీవనోపాదైంది
చింత అంబలి చెక్క పొట్టులే వీళ్ళకు
ముడి సరుకులై కళకు కన్నులైనవి

కథలు జెప్పి కడుపు నింపుకొను వారికి
వినడానికింపుగా మాటలకు జోడుగా
పురాణాల బొమ్మలతో పూస గుచ్చినట్లు
చూచువారికి చూడముచ్చట గొల్పుచుండు

ఖాదీ బట్టలపైన నీళ్ళ రంగులతో
కుంచెతో చక్కని చిత్రాలు గీసి

కర్రబొమ్మలను కమనీయముగా జేసి
మాస్కులను మంచిగా మలచుచున్నారు

రామాయణ మహాభారత కృష్ణలీలలు
ఇతిహాస చిత్రాలెన్నెన్నో యింపుగా జేసి
ఇంటి గోడలపైన వేయుట కిష్టపడువారికి
కమనీయ దృశ్యాలుగా మలచి కరాలకందిస్తారు

మాదిగ(న్న)లకు ఆదిపురాణం జెప్పు డక్కలి వారికి
మాల్ల(న్న)లకు గుఱ్ఱపు మల్లయ్య పురాణం జెప్పు గుఱ్ఱపోళ్ళకు
ముదిరాజులకు పాండవ పురాణం జెప్పు కాకిపడగల వారికి
మంగలి వారికి అద్దపు పురాణం జెప్పు అద్దపు వారికి

పద్మశాలీలకు మార్కేండేయ పురాణం జెప్పు కూనపులివారికి
రజకులకు మడేలు పురాణం జెప్పు పటంవారికి
గౌండ్లవారికి గౌరపురాణం జెప్పు గౌడజెట్టీలకు
గొల్లవారికి కాటమ రాజుల కథలు జెప్పు మందెచ్చువారికి

కురుమలకు మల్లన్న కథలు జెప్పు త(ద)గుడజోగుడువారికి
మొదలాది పోషిత – ఆశ్రిత కులాల తరాలకు
పటంపై బొమ్మలు పెద్దమ్మ గుడులు చెక్కబొమ్మలు చేసి
సాంస్కృతిక పునర్జీవనం కల్పించుచున్నారు

ఎల్లలు దాటి యీ కళ యశస్సు(లు) తేవాలె
ఎందరికో నిరంతరం శిక్షణనిస్తూనే వుండాలె
ఆకాశమే హద్దుగా ఎదుగుతూనే ఉండాలె
ఇలపై యీ కళ చిరకాలం వుండాలె





# ఏనుగు నరసింహారెడ్డి

## బొమ్మల రాజు

'సారె' మీద
సుడితిరుగుతున్నప్పుడే
మట్టి సౌందర్యం చూసి తీరాలి
కళ్ళన్నీ అప్పగించి
సగం పేర్చిన బతుకమ్మను
అపురూపంగా తాకి
సద్దులనాడే పులకించాలి
సొక్కం బంగారాన్ని
కరగబోసే స్వర్ణకారుడు
జాగరూకతతో తెరిచిన
కళ్ళలోని కాంతిని
కుంపటి రాజేసినప్పుడే గమనించాలి
'తాళ్ళ' త్రిశంకు మీద
మోకుతో ఆడుతున్నప్పుడే
కల్లు గీతలోని కలవరపాటును
కళ్ళప్పగించి చూడాలి

మనం కుందను వాడకానికి చూస్తాం
బతుకమ్మ కూర్పునూ
స్వర్ణకారుడి నేర్పునూ
ఉపరితలం నుండి దర్శిస్తాం

కల్లు తాగి కండ్లు మాత్రం తేలేస్తాం
మనం తెలివి తక్కువగా చూస్తామనే
కాపు రాజయ్య
ప్రతి జీవితపు శకలాన్నీ
కళా ఖండంగా గీసి చూపిండు
కలాన్ని ఖండించి
శకలాలు చుట్టూరా
నకాషీ నగిషీలు దిద్దిండు
కాలం ఊదిన సుడిగాలి దెబ్బకు
కళలు వృత్తులై వెలవెలబోతాయని
వాటికి అందాల రంగులద్దిండు
నడిచే ప్రపంచమంతా
శతకోటి నిశ్చల దృశ్యాల
ఎడతెగని తోరణం కదా!
ఆయన జీవితాన్నే ద్వారబంధం చేసి
బొమ్మల తోరణమాలకు
ఎదురు నిలిపిండు
మట్టిలో పుట్టి
మట్టిలో కలవడానికి మధ్య
తీరికలేకుండా
మట్టి రంగులన్నిటినీ తూర్పారబట్టిండు





# కందుకూరి శ్రీరాములు

## తెలంగాణ దేశం

ఇక
అసెంబ్లీ తీర్మానాలు
పార్లమెంటు బిల్లులు అఖ్ఖర్లేదు
ఇకనుండి
రాష్ట్ర ప్రభుత్వమూ
కేంద్ర ప్రభుత్వంతో సంబంధమూ లేదు
ఒక దేశానికి మరో దేశానికున్న
అనుబంధమో బంధుత్వమో మొదలవుతుంది
ఒకడు ఇచ్చేదిలేదు ఒకడు చచ్చేది లేదు
సపరేట్ రాష్ట్రం కాదు కోరుకునేది
దేశం కావాలని కోరుకోవటమే..! కొట్లాడటమే...!

శ్రీకృష్ణ కమిటీలకు గోలిమారో
ఆజాద్ రవిల మధ్యవర్తిత్వం జానేదేవ్
ఆంధ్ర సామ్రాజ్యవాదుల్ని ఆపటానికి
తెలంగాణ బార్డర్‌మీద ఇకనుండి సైనికుల గస్తీ!

ప్రతీ దేశానికి ఒక నియమ నిబంధన ఉన్నట్టు
తెలంగాణ కిప్పుడు ఒక రాజ్యాంగం కావాలి!!
దేశానికి ఉండాల్సిన లక్షణాలూ

దేశానికి ఉండాల్సినన్నీ హంగులూ ఆర్భాటలన్నీ ఉన్నాయి
అప్పుడే ఐక్యరాజ్యసమితిలో ఒక మెంబర్ కాకపోవచ్చుగానీ
ఏసియన్ కంట్రీస్‌లో ఒక దేశంగా నిలబడుతుంది
పది రాష్ట్రాల విస్తీర్ణం నా తెలంగాణ
నాలుగున్నర కోట్ల జనసంఖ్య నా తెలంగాణ
జాతిజనుల కొక సందేశం
తెలంగాణ మన దేశం





# కందాళై రాఘవాచార్య

## జైలు గోడ - బొగ్గు ముక్క

కవిత అగ్ని శిఖ ఐంది
బొగ్గు ముక్క కలం ఐంది
జైలుగోడపై మెరుపుగ
బొగ్గుముక్క రాసె కవిత!

'నా తెలంగాణ కోటి రతనాల వీణ'
దాశరథి శతఘ్ని కవిత
జనం నాల్కపై ఆడెను
ప్రజా పారాయణ మాయెను!

బొగ్గు ముక్క ఐతేనేం
ఎర్రగా అగ్గిలాగ పారింది
జైలుగోడ చరిత ఐంది
కవితకు కట్టడమైంది!

ఇందూరు ఖిల్లాలో ఎత్తుగా
దాశరథి స్వేచ్ఛాగానము
ఈనాటికీ ప్రతిధ్వనించు
ప్రతి కవిని అదిలించును!

ఏ బొగ్గు ముక్కను చూసినా
దాశరథి నిప్పు కవితలే

జ్వలనమౌను నిలువెల్ల
'అగ్నివీణ' ఔను మేను!

ప్రతి కవికిది పుణ్యస్థలి
ఇందూరు కోట చూడ
జైలు కానే కాదిది
దాశరథి కవితా మేడ!

జైలుగోడ- బొగ్గు ముక్క
కవి స్పర్శతో చైతన్యమగును
తరతరాలకు తోవ అగును
ఇంకా నాలోనూ దాశరథి-
నీలోనూ దాశరథి!





# కందాల శోభారాణి

## ఎన్నముద్ద నా బాస

చీలికలు పడ్డనేల
విడివడ్డ ఖండాలం
చూపుకు మాత్రం
ఒకలాంటి మనుషులమే
అంతా తెలుగోల్లమే..

వేరు చరిత్రలు
భిన్న సంస్కృతులు
విభిన్న రాజకీయార్థిక
జీవన ప్రపంచాలు
వేరు భాషా వ్యక్తీకరణలు..

ఇప్పటిదాకా మనమొక
అసమ వ్యవస్థ ఇరు భాగాలం
అసమాంతర వంకర గీతలం
మనిషితనపు హోదాలను
భాషలో సమాధి చేసిన అభాగ్యులం

అధికారం కదా
అణిచివేతను ఆయుధం చేసుకునేది
దోపిడీ కేదైతే ఏందట
భాషైనా భావమైనా బతుకైనా
పెత్తనం చాలదా

ప్రజల మెదళ్ళను
పరుల సంపదల మొదళ్ళను
పక్కదారులంట కొల్లగొట్టడానికి

మోసీ మోసీ వంగిపోతిమి కదా
భరించీ భరించీ కుంగిపోతిమి కదా
భాషా పరంగా సంస్కృతి చెదరంగ
అంతటా అవమానాల విషప్పాతలు
ఎటకారాల చీదర బాకులు

హృదయం లేని
మీ కట్టుకథల పెట్టుబడుల
సినిమాల సీరియళ్ళలో
రౌడీలూ విలన్‌లూ చిన్న చితకా
పాత్రలోల్ల పెదలవులపై మా మాటకు
కత్తిగాట్లు అపహాస్యపు తూట్లు

ఇప్పటిదాకా తెలంగాణ ప్రజల
ప్రతి కన్నీటి బొట్టు వెనకా
ఏలినవారి వికృత వికట్ట హాసాలు
నిర్దాక్షిణ్యపు నిండా దర్పంతో
దురంహకారాలు ప్రతిధ్వనిస్తున్నాయి

దశాబ్దాలుగా మూసుకుపోయిన
మీ ? ఊసు కండ్లు తెరిచి
మీ హద్దుల్లోని 'ప్రామాణిక'
భాషావాద కవ్వంతోనే
చిలకరించి చూస్తే చూడండి
తెలంగాణ బాస తల్లి
మెత్తని ఎన్న ముద్దోలె
ఎట్లా పైకి లేచి సవాల్ చేస్తదో
తల ఎత్తి నీ కళ్ళలోకి చూస్తే
నీ తల నేలకే కదా వాలేది





# కరిమిళ్ళ లావణ్య

## కాకతీయ వైభవం

కాకతీయుల రాజ్యవంశం
ఒలికించిన రాచరికం
రగిలించిన పౌరుషాలు
రణగీతికలై మ్రోగెను

కాకతమ్మ దేవేరి
ఆరాధ్య దేవతాయె
కాకర్త్య గుండనేమో
కాకతీయ ఆద్యుడాయె

నల్లసరపు రాళ్ళలోన
నందీశ్వరుడు వెలిసె
నడుతనే నాందిగా జేసి
నాగరికతతో వెలిగె

ఏకశిలా నగరాన
ఓరుగల్లు కోట వెలిసె
రుద్రదేవుని రాజ్యపాలన
జాతిని జాగృత పరిచె

వేయి స్తంభాల గుడి వెలిసె నిచట
వీరశైవ మతము వ్యాపించే
గణపతిదేవుని సామ్రాజ్య దీప్తి
గగనమంతా వెలుగొందె

భద్రకాళీ రుద్రరూపం
ఓరుగల్లుకు అభయహస్తం
కాకతీయుల నాట్యపుంజం
కామసాని నృత్యరూపం

రామప్ప శిల్పకళ
రాజ్యఘనత పెంచె
రుద్రమదేవి భుజకీర్తులు
ప్రాంతానికే స్ఫూర్తినిచ్చె





# కాళోజి

## కాటేసి తీరాలె

మన కొంపలార్చిన మన స్త్రీల చెరచిన
మన పిల్లలను చంపి మనల బంధించిన
మానవాధములను మండలాధీశులను
మరిచిపోకుండగ గురుతుంచుకోవాలె
కసి ఆరిపోకుండ బుసకొట్టుచుండాలె
కాలంబు రాగానే కాటెసి తీరాలె

'సత్యమ్మహింస' యని సంకోచ పడరాదు
'దయయు ధర్మం' బనుచు తడుముకో పనిలేదు
'శాంతి'యని చాటినను శాంతింపగా రాదు
'క్షమ'యని వేడినను క్షమియింపగారాదు
'చాణక్యనీతి' నాచరణలో పెట్టాలె
కాలంబురాగానె కాటేసి తీరాలె

తిట్టిన నాల్కలను చేపట్టి కొయ్యాలె
కొంగులాగిన వ్రేళ్ల కొలిమిలో పెట్టాలె
కన్ను గీటిన కళ్ళ కారాలు చల్లాలె
'తన్నిన కాళ్లను' దాకలిగా వాడాలె
కండ కండగ కోసి కాకులకు వెయ్యాలె
కాలంబురాగానే కాటేసి తీరాలె

(1948లో రజాకార్లు జనగామ తాలూకా బైరాన్‌పల్లి గ్రామ ప్రజలపై జరిపిన అత్యాచారాలు చదివి)



# కాసుల లింగారెడ్డి

## నేను తెలంగాణను

నేను తెలంగాణం
చాతుర్వర్ణపు కోరలు తీసి
చాపకూడుకు పీట వేసి
బసవడిమీద ద్విపద పురాణాన్ని ఊరేగించి
పండితారాధ్య చరిత్రమై వెలిగిన వీరశైవుడిని
ఆదికవిని నేను పాల్కుర్కి సోమనాథున్ని

ఇమ్మనుజేశ్వరాధముల ధిక్కరించి
కవితా సరస్వతికి అచ్చమైన తావ్వ దీసిన
పరమ భాగవతోత్తముడిని పోతనామాత్యుడిని
నేను బమ్మెరను

నిజాం నవాబు బూజు దులప
జైలుగోడల మీద కురిసిన
అగ్నిధారను.
తిమిరంతో సమరానికి
కోటి రతనాల రుద్ర వీణ మీటిన
సాంస్కృతిక సైనికున్ని - నేను దాశరథిని

ఊరి చెలిమల మాటను
కవిత్వ జలపాత భాషచేసి

మోదుగుపూల వనంతో పదం కలిపిన
నా గొడవను
తెలంగాణ భాషాదినోత్సవ యాదిని
నేను కాళోజినీ

ప్రతాపరుద్రుని నాగేటి చాళ్ళల్లో
మొలకలకు పాలుకుడుపుతున్న తడిజాడని
నేను పాకాల చెరువును

ఏనెలను కలిపి కట్టుకున్న జల గోపురాన్ని
పంట చేల మనుషుల కోసం వేలాడే వంతెనను
నేను లక్నవరాన్ని

ఉలి పట్టిన చేతికి దక్కిన
అరుదైన పేరినీ నృత్య శిఖరాన్ని
ఇతిహాసపు పచ్చబొట్టుతో వికసించినదాన్ని
నీటి ఉయ్యాలలో ఇటుకలకు జోలపాడే
మహత్తర కాసారాన్ని నేను రామప్పను.

కాకతీయుల శిల్పకళాసందప మణిహారాన్ని
వేయి స్తంభాల గుడిని నేను ఓరుగల్లును

ఏకశిలనెక్కి పారజూసిన కాకతీయ పౌరుషాన్ని
శత్రువు పొలిమేరల్లో రగలిన అగ్ని కణాన్ని
నేను రాణి రుద్రమదేవిని

ఆధిపత్యాల మీద అలుపెరుగని పోరుసలిపిన
ఏడుగడియల జానపద కథానాయకున్ని
సర్వాయి పాపన్నను నేను ఖిలాషపురంను.
బరిబతాల ఆడించిన
ఆటనే కొంగుకారంగా మలుచుకొని

నిజాం గడీల కండ్లల్ల కొట్టిన
తీరొక్క పువ్వుల బంగారు బతుకమ్మను
గడ్డిపోచలకు యుద్ధతంత్రం నేర్పిన బురుజును
నేను వీర బైరాన్‌పల్లిని

పచ్చని చెట్లకు నిండు ప్రాణాలను నిలేసి
కాల్చబడ్డ బందూకును
చరిత్ర నుదిటిమీద చెరిగిపోని గాయాన్ని
అమరధామమై మండుతున్న అగ్నివీణను
మరో జలియన్‌వాలాబాగ్‌ని
నేను పరకాలను

బుడ్డగోచిగాళ్ళను సాయుధం చేసి
వీరవిప్లవ పోరుకు ఊపిరులూదిన
గుత్పల సంఘాన్ని
తొలి అమరుడను దొడ్డికొమురయ్యను
నేను కడివెండిని

ఇసప్పురుగు
విసునూరు దేశముఖ్ పడగమీద
కాళింది నృత్యం చేసిన బందగీని
నేను కామరెడ్డిగూడాన్ని

నేలమ్మ పంట కొంగులాగిన
జాగీర్దారుల మీద ఎత్తిన కొడవలిని
సాహస వనితను చాకలి ఐలమ్మను
నేను పాలకుర్తిని

కోటానుకోట్ల మూర్తులకు
పోతపోసిన బంగరు సంస్కృతిని
హస్తకళామతల్లిని నేను పెంబర్తిని
కలల దీపాన్ని కొండెక్కకుండా నిలుపుకొని

కాలుకు బలపం కట్టుకొని
రికాంలేకుండా కన్నీటి పాట పాడిన
ఆరు దశాబ్దాల పోరు డిమాండును
జన శంకరుడిని
నేను తెలంగాణ సర్వనామాన్ని

నమ్మిన ప్రజాకోటి కొంగు బంగారాన్ని
శాకంబరీ సంబరాన్ని
నిండు తటాకాన్ని
అపర భద్రకాళిని
నేను ఓరుగల్లును

స్వయంభూదేవలయాన్ని
పొదుముకున్న ఏకశిలను
గుట్టకింద మొలిచిన గుండు చెరువును
కాకతీయ పురావైభవ ప్రతీకను
కాకతీయ శిలా తోరణాన్ని
నేను ఓరుగల్లు ఖిల్లాను

సామ్రాజ్యవాదాన్ని నిలువరించిన
సైనిక కవాతును
చిలుకల గుట్టమీద వెలిసిన
కుంకుమ భరిణను
ఎత్తుకెత్తు బంగారాన్ని
సజీవ అధివాస్తవిక చిహ్నాన్ని
నేను సమ్మక్కను, సారలమ్మను
నేను ఓరుగల్లును, పోరుగడ్డను
నేను తెలంగాణను






# కాలువ మల్లయ్య

## తెలంగాణ 'అవ్వ'

గోచీ పెట్టి కట్టిన ఎనిమిది గజాల చీర
తలమీద శిఖరమోలె ముడిసిన శిగ
కాళ్ళ చేతులకు వెండి కడాలు
ముక్కుకు ముక్కెర చెవులకు గంటీలు
కారుణ్యం నిండిన కరుణామయమైన ముఖవర్చస్సు
ఇంటి కొచ్చినవారి కడుపుచూసే కరుణార్ద్రత
మాతృత్వం మూర్తీభవించిన ముఖ కవళికలు
అభయ హస్తమిచ్చే అర్ద్ర హృదయం
మాతృస్వామ్య వ్యవస్థలోని మమకారం
ఇవన్నీ రంగరిస్తే మా అవ్వ తెలంగాణ

తెలంగాణ అవ్వంటే దళిత బహుజనతల్లే
తెలంగాణ మట్టి మనుషుల మాతృమూర్తే
మట్టిభాషనిచ్చిన మానవతామూర్తే
శ్రమైక జీవన సౌందర్యాన్ని ఉన్నతీకరించే
పీడితుల పక్షం వహించే అనురాగమూర్తి
అస్తిత్వ పోరాటాలకు ఆలంబనగా నిలిచిన అమ్మ
సామాజిక న్యాయాన్ని సమర్థించే సత్యవంతురాలు
పనిమంతులను కడుపులో దాచుకునే కరుణామయి
సకలజనుల న్యాయపోరాటాలను సమర్థించే సౌజన్యమూర్తి
సర్వసంపదల సృష్టికర్తలను సమర్థించే సాత్వికురాలు

ఎవ్వరింటికి వచ్చినా ముంతతో నీళ్ళిచ్చేది
కాళ్ళు కడుక్కోబిడ్డా అని అర్థించేది
అరుగుమీద మంచమేసి కూర్చోబెట్టేది
అందరూ మంచిగున్నరా అని పలుకరించేది
చల్లటినీల్లో, చల్లో, అంబలో తాగటానికిచ్చేది

కడుపుదిక్కు చూసి తిన్నరోలేదో కనిపెట్టేది
గబగబా పొయ్యంటబెట్టి ఎసరుపెట్టేది
కుండలోగలది కడుపునిండా తినిపిచ్చేది
ప్రేమను రంగరించి దగ్గరుండి వడ్డించేది
బేవ్ తీసేదాకా తినందే ఊర్కునేదికాదు

రూపాయి ప్రవేశంతో గోసదుతుంది తల్లి
ప్రపంచీకరణతో పరేషానవుతుంది
వలసపాలనతో విసుగెత్తి విచారిస్తుంది
నల్లవ్యాపారం చూసి కళ్ళనీల్లు తీసుకుంటుంది
అంతా వ్యాపారమయం కావడం చూసి అలమటించిపోతుంది
తెలంగాణతనం మటుమాయమవడం సహించలేకపోతుంది
అందుకుగల కారణాలర్థం చేసుకుంది
తెలంగాణా బిడ్డల పోరాటాన్ని సమర్థిస్తుంది
తెలంగాణ విముక్తి కోసం ఆరాటపడుతుంది
తెలంగాణ ఆకాంక్షను ఆశీర్వదిస్తుంది

తెలంగాణ బంధనాలను తెంచడానికి
మన అవ్వకు పాత రూపమివ్వడానికి
వలసవాదుల దాస్యం నుండి విముక్తి చేయడానికి
తెలంగాణ సాధించడమొక్కటే తొవ్వ
ఆపై దళిత బహుజన తెలంగాణ వస్తుంది
అప్పుడే తెలంగాణతల్లి సగౌరవంగా తలెత్తుకుంటుంది.





# కాళిదాసు

## పోదాం పద కాళేశ్వరం

పోదాం రండి కాళేశ్వరం
చూద్దాం రండి గోదావరి ప్రాణహితల సంగమం

ఒకనాటి మహారణ్యాలు దాటి రండి
దయనీయంగా మారిన నేటి అడవి తల్లిని చూడండి
అక్క గోదారిని ఆలింగనం చేసుకోవడానికి
పరుగులు తీస్తూ వచ్చే ప్రాణహితను కనండి

వేల వేల ఏండ్లుగా పారుతున్న తల్లులూ
కన్నతల్లిని మించినదమ్మా మీ ప్రేమ
ఎంత చూసినా తనివి తీరనిదమ్మా
ఈ మనోహర, సమ్మోహన అందాల సీమ

కాశీలో ఊపిరాడని సదాశివుడు
మనసుపడీ ఇటకు వచ్చి ఉంటాడు
పరిమళించే ప్రశాంతతకు
మురిసి ముక్తేశ్వరుడై వెలసి ఉంటాడు

కోరిన కోర్కెలు తీరుస్తావని
బడా బడా బాబులు వస్తుంటారంటారు
నీ చుట్టూ ఉన్న ఈ నిరుపేదలు
ఎన్నేండ్లు ఇంకా ఇలాగే మిగిలి ఉంటారు
ప్రాణహితా! నీ పేరు చెప్పుకొని నేతలు

ఓట్లు దండుకొని సీట్ల కెక్కినారు
మళ్ళీ పుష్కరాల నాటికైనా
చేవెళ్ళకు చేరేనా నీరు

పోదాం రండి కాళేశ్వరం
చూద్దాం రండి గోదావరి ప్రాణహితల సంగమం!





# కిరణ్‌బాల

## అమ్మ కోసం..

అమ్మా! నువ్వెప్పుడొస్తావని
ఎదురు చూస్తున్నాను
అలసిన నీ పాదాలకు
అముదం రాస్తాను
చిందిన నీ స్వేదం తుడిచి
స్నానం చేయిస్తాను ॥అమ్మా॥

బూరెలు–బెల్లపు బువ్వ
పెసరవడలు– సకినాలు
కమ్మటి పప్పు– చారు
నెయ్యితో కలెగలిపి
గోరుముద్దలు చేసి
నీ ఆకలి తీర్చుతా ॥అమ్మా॥

ఇంత కాలం నీ కళ్ళు
కన్నీళ్ళే చిలికాయో
రక్తం చిందించాయో
ఇక నిన్నెప్పుడు మేము
ఏడవనీయమమ్మా ॥అమ్మా॥

నిదురకాచి రాత్రుళ్ళు
ఎంతగ చింతించావో

నీ బిడ్డలకోసం
నిరంతరం శ్రమించావు
ఏ కష్టం రాకుండ
నిన్ను చూసుకుంటాను
నా అంకసీమ నీ కోసం
పూలపాన్పు చేస్తాను
ఓ తల్లీ నిన్ను నేను
శాంతివనంలో విహరింపచేస్తా
అమ్మా నువ్వెప్పుడొస్తావని
ఎదురుచూస్తున్నాను!






# కురిమిండ్ల సృజన

## తల్లీ పాట తెలంగాణ!

పాటల పిట్టలను ఎగిరేసిన
తల్లి పాటరా బిడ్డా ఈ మట్టిగడ్డ
మన కళలను దున్ని పండించిన
సాంస్కృతిక ఖజానాల
ధూంధాం ఆటరా బిడ్డా
మన బతుకు అడ్డా....

ఉద్యమాల అలలు లేచి
వేరు పాటలు పాడుతున్నయి
తల్లి తెలంగాణ పోరులో
సముద్రాలై ఉప్పొంగుతున్నయి
పాట తల్లి తోడుండంగ
మన జమీన్‌కై జంగ్ హోరెత్తంగ...

మనకు నోరున్నది ఊరున్నది
ఊరినిండ ఉరిబడ్డ కతలున్నయి
కతలన్ని చెరబడ్డ వెతలున్నయి
ఒంటి నిండ ఉడుకు నెత్తుర్లు
రాలుస్తున్న పచ్చి గాయాలున్నయి
గాయాలమీద కారం చల్లిన నేరాలున్నయి

నోరెండిన చెరువుల కింద గెలికితె
చెలిమల నీటి కన్నీటి పాటలు
అడుగంటిన బాయిల పూడికలు
తోడితె ఊరిన ఊటల పాటలు
పాట తెలంగాణ మన చరిత్ర
తెలంగాణ పాటే మన ఆయుధం..

తెలంగాణ మాదంటూ
తియ్యని బాసల పాటకట్టు
తెలంగాణ తల్లి ప్రేమను నిలబెట్టు
తల్లిపాల రుణం తీర్చ మన
బ్రతుకునూ ప్రేమించాలె
ఎగదన్నే పౌరుషాల పోరు సాగించాలె..
బతుకంటే బతుకాల్నని బతుకమ్మ
సందేశం ఆలకించు!
తెలంగాణను సాధించుకోవాల్నని
తల్లిపాట ఆదేశం గౌరవించు!





# కేతిరెడ్డి యాకూబ్‌రెడ్డి

## సక్కని నా పల్లె

ఎంత సక్కని నేలరో నా పల్లె
ఎంత సెప్పిన తీరునో నా తనివి ॥ఎంత॥

కుమ్మరిండ్లకెళ్ళి కొత్తకుండలు దెచ్చి
పసుపు కుంకుమలతో అందంగ పూదిచ్చి
కోడిపిల్లను మొక్కి కల్లు కావడి పెట్టి
డప్పు సప్పుల నడుమ దరువులేసుకుంట
బోనాలు బైలెల్లనే నా పల్లె
కళ్ళ పండుగాయనే.. ॥ఎంత ।

పుట్టమన్ను దెచ్చి పీట మీన పెట్టి
గోరంట గన్నేరు రుద్రాక్ష పూలతో
కన్నెలందరు గూడి బొడ్డెమ్మ లాడంగ
ఎన్నెలే ఎగగాసెనే నా పల్లె
నెమలి పురివిప్పి ఆటాడెనే.. ॥ఎంత॥

తంగేడు కట్లాష గునుగు గోరింట
పూలనేరుకొచ్చి బతుకమ్మను పేర్చి
చెరువోరనా చేరి ఆటలే ఆడంగ
పది జిల్లలూ కదిలెనే నా పల్లె
రంగుల రాశయ్యేనే.. ॥ఎంత॥

దసర పండుగ నాడు పాలపిట్టను జూసి
జమ్మి సేతులపెట్టి వంగి దండం బెట్టి
అలాయి బలాయి అందరము తీసుకొని
మంత్రనగరమాయెనే నాపల్లె
మనసు సింగిడేసెనే.. ।ఎంత॥

సోమన్న పోతన్న గద్దరూ జయరాజు
గోరటీ వెంకన్న అందెశ్రీ రసమయీ
జాజిరి జాజిరి జాజిరి అనుకుంటు
అందమైన యాసరో నా పల్లె
పలుకుబడుల బాసరో.. ॥ఎంత।

పోషవ్వ ఎల్లమ్మ సమ్మక్క సారక్క
కొమురమూ భీమన్న బందగీ అయిలమ్మ
నడుముగట్టి లేచి ధైర్యమే నింపేసి
కాళ్ళ గజ్జెలు గట్టెరో నా పల్లె
జాజోలె ఎరుపెక్కెరో ।ఎంత॥





# కొమర్రాజు రామలక్ష్మి

## ధీర వనిత నాగమ్మ

సకల విద్యా పారంగతురాలై
ప్రజల మనిషిగా పేరు పొందిన
తొలి మహా మంత్రిణి
మన వీరనారి నాగమ్మ
పురుషాధిపత్య భావజాలాన్ని
ధిక్కరించి గణతికెక్కిన ధీర వనిత
ప్రజాస్వామ్యవాదంతో
ప్రజల గుండెల్లో కొలువై
నిత్య పూజలందుకుంటున్న
మన అరవెల్లి ఆడబిడ్డ!
ప్రతికూలతలెన్నున్నా
శాంతి కోసం పరితపిస్తూ
మానవతా మూర్తిగా
పరిపాలన సాగించిన
తెలంగాణా రైతు బిడ్డ!
అయిన వారందరినీ పోగొట్టుకొని
కష్ట నష్టాలను తట్టుకుంటూ
అనుభవం నేర్పిన పాఠాలతో
దక్షతతో వ్యవహరించిన రాజనీతిజ్ఞురాలు
వ్యూహ ప్రతివ్యూహాలతో
బ్రహ్మనాయుడి కుట్రలను

తెలివిగా తిప్పికొట్టిన కార్యశీలి
ఇరుగు పొరుగు  దేశాలతో
దౌత్య సంబంధాలను మెరుగుపరిచిన ప్రజ్ఞాశాలి
ధర్మచింతనకు ప్రాధాన్యతనిచ్చిన ధిక్కార స్వరం
యుద్ధంలోనే కాదు
రాజ్యయంత్రాంగాన్ని నడపడంలోనూ
శక్తి సామర్థ్యాలను నిరూపించిన విజ్ఞురాలు
మనో బలానికి మారుపేరై
కర్తవ్య దీక్షతో కదనాన నిలిచిన నాయకురాలు
పల్నాటి సీమలో
ప్రతి నాయకురాలుగా వక్రీకరించబడి
కరీంనగర్ గడ్డపై సైతం
వివక్ష నెదుర్కొన్న మన నాగమ్మ
మరుగున పడిన వెయ్యేళ్ళ చారిత్రక విశేషం
ఆమె ధీశక్తి ప్రజల అస్తిత్వం
నాయకత్వమంటే నాగమ్మ!
మన ఆత్మగౌరవం నాగమ్మ!
మన పౌరుషం నాగమ్మ!






# కొండి మల్లారెడ్డి

## గూడు చెదిరిపోతున్న దృశ్యం..

వానగొట్టి ఎల్సినంక
మట్టంతా కొట్టుకుపోయి
నేలమీద తేలిన నాగటిచారలోలె
నొసటి మీద గీతలు..
గొర్రు పట్టెలో తట్టుకొని
ఎండి పోయిన తెట్టోలె
కరువులనూ కష్టాలనూ మోసిమోసి
అట్టగట్టుకు పోయిన పెయ్యిమీది ఆనవాల్లు
తడిదప్పిన మడి నెర్రెలిచ్చినట్టు
గాడిదప్పిన బతుకుల, పగిలి
పచ్చెలు పచ్చెలైన పాదాలు..
తన బతుకు పొలంలో పొద్దుగూకుతే
పోరగాండ్ల బతుకు ఎడారిదేశంల
తెల్లారుడు మనాదిలకొచ్చి
గుడ్లల్ల నీల్లు చింతనిప్పలోలె రాలుతుంటె
మొలలోతు అప్పుల దిగబాటులోనూ
బిర్ర బిగుసుకుపోయిన నరాలు
పురివెట్టి, వార్నెగట్టి
ఊటలా ఊరుతున్న స్వేదజలంతో
సేద్యం ఆరంభిస్తాడు
అర్నెల తన రెక్కల కష్టంతో

పొలాన్ని మధించి గరళాన్ని గొంతులో వొంపుకొని
అమృతాన్ని అందరికీ పంచుతాడు
పంటకొచ్చే తెగుల్లన్నీ పసిగట్టినోడు
పాలకుల కుట్రల్ని కనిపెట్టలేక
విషవలయంలో చిక్కి విలవిల్లాడుతాడు.
కూడు పెట్టేవాన్ని మెడపట్టి గెంటించే ప్రభువులు
నోరుగొట్టేటోనికి మాత్రం
"సబ్సిడీ"ల చీరలుగట్టి" సెజ్"లుగా సింగారించి
కార్పోరేట్లకు కట్టబెడ్తరు.
గాలివానకు చెదిరిపోయిన గూట్లెపక్షులోలె
ప్రాణమసొంటి పొలం పరాయిదైవంగ
ఓలెగట్టి ఏరుకున్న శేన్లోనే
జోలెవట్టి అడుక్కునే దుస్థితి
చీలమండకుగుచ్చిన చీకుటంముల్లు బాధకంటె
అప్పులోని దెప్పిపొడుపులే ఎక్కువ సలుపుతుంటే
పరువొక్కటే మరణశాసనం రాస్తుంది
ప్రాణమొక్కటి పాడెమీద ప్రయాణిస్తుంది

ఈ మట్టిలో పాతిపెట్టింది
వొట్టి మనిషినేకాదు, నిలువెత్తు
నమ్మకాన్నీ, నిండైన విశ్వాసాన్నీ
అంత లోతులోనూ అతని కాయం
సలసలా మరుగుతూంటుంది
ఎప్పుడో అప్పుడు ల్యాండ్మైనై పేలి
లావాలా ప్రవహిస్తుంది.

పల్లెల ఆనవాల్లన్నీ శిలాజాలుగా మారకముందే
నేలమీది ఈ "మర్మదీవుల" వెనుక
మర్మమేమిటో గుట్టు విప్పుదాం రండి





# కొలిపాక శోభారాణి

## ధీ శక్తి!

దొరలు, పటేండ్లు, పట్వారీల వ్యవస్థ
దేశ్‌ముఖ్‌ల దోపిడీలు దౌర్జన్యాలు
రజాకర్ల దురాగతాలు
నిజాం... నిరంకుశపాలన
మొత్తానికి ...మొత్తంగా ...బైరూపుల...రాజిర్కాలు

పచ్చగా పంట కనబడితే...చాలు
ఏలికల... ఇంట్ల....చేరవల్సిందే
నిర్బంధ వెట్టిచాకిరీ..
ఏ...చెట్టునడిగినా...ఏ పుట్టనడిగినా
పీల్చి పిప్పి చేసిన చరిత్రలు

సమస్తం... దోపుకం చేసుకున్న...జులుం
చెప్పటాన్కి. మాటరాని ...బలం
అమ్ముకున్న...భూముల్లు జాగల్లు
ఆగం...చేసిన...సంసారాలు
తీసిన ప్రాణాలు
కొల్లగొట్టిన బతుకులు
ఆగం...ఆగం...అడ్వి..అడివి

యీసున్నూరు...దొర... దౌర్జాని.. చేసిన ఆగడాలు
ఎదుర్కున్న... సుధీర

ఎడ్లకట్లిడిసి బండ్లను కాలబెట్టినా
తిండిగింజలను ఎగజల్లి నాశినం పదారుపాళ్లు చేసినా
కొడుకును పెనిమిటిని పొగొట్టుకున్నా
తల్లిని పట్టక పిల్లను కొసాకరికి.. బాలింతనూ
వదలక బతుకులు మలినం చేసిన
ముష్కర మూకల్ని ఎదిరించిన.. ఆడపులి.

తన ఇంటిని పంటనూ కాపాడుకొనే క్రమం
తొడగొట్టి ఎదురొడ్డి... నిల్చింది... పాలకుర్తి అయిలమ్మ!
అణిచివేత ప్రజలను అనివార్యంగా ఉద్యమాల వైపు నడిచింది.
సంఘపోల్లను ఆదరించి అన్నం పెట్టిన అన్నపూర్ణ
జడువక, వెరువక, పట్టు పడక....కట్టుగా నిలిచింది గెలిచింది
కంగునా కంచుగంటోలె మోగింది
పాలకుర్తి కోడలమ్మ
చిట్యాల అయిలమ్మ!





# కొండపల్లి నీహారిణి

## ఆదర్శాల గడ్డ

సహజ పండితుడు మా పోతన్న వెలసిన పురిటిగడ్డ
భాగవత ఫలాల తీయందనాలు తేనెలూరిన గడ్డ
సాహిత్యములబాన తెలంగాణానేల
కావ్యసుమాలు గుబాళించిననేల
బసవపురాణమంటి బహు గ్రంథాల
భాండాగారంచే ఈ నేల
రాజరిక తంత్రాలు రణభేరీలు మ్రోగించిన
రుద్రమ్మ పుట్టిన వీరగడ్డ
ప్రజాతంత్ర పరిపాలన ప్రతాపరుద్రుని
పరగాణా మా నేల
తెలుగోడవరంటే తెలంగాణా వాడేనంట?
ఎల్లలులేని ఖ్యాతిగన్న గడ్డ
రామప్ప శిల్పాల రమణీయతలేమి
వేయి స్థంబాల అంబారీతీరేమి
పేరిణీ నాట్యమదే పెక్కుగా భాసిల్లె
కవులకును కావ్యాలకు దీటైన మా గడ్డ
కనువిందు - వీనుల విందు చేసిన కళలగడ్డ
పోరుబాటుకు సై అంటూ పోరుసల్పిన గడ్డ
రాజరికాన్ని తిప్పికొట్టిన సాయుధ పోరాటాల గడ్డ
ఉద్యమాలె ఊపిరిగా ఉక్రోషాలు నిలుపుకొన్నదీ గడ్డ
మానవత్వమె జాతి సంపదని చెప్పిన

పొరుగు రాష్ట్ర ప్రజల జీవనాధారాల గడ్డ
సోదర సంఘీభావాలు స్నేహహస్తాలిచ్చే
పొరపొచ్చాలు లేని పొదమిగడ్డ
పొసగ మేలు చేసే పుడమి ఈ గడ్డ
సభ్యతా సంస్కృతులు సరససల్లాపాలాడ
మంచి మర్యాదల పలకరింపుల తోడుతేలే
తెలుగు తెలుగుయన్న తెలుగే మన తెలంగాణ
తెలసుకో తెలుపుకో భరతజాతికంత!!
కాకతీయుల గడ్డ కదనగడ్డ!!!

('అగ్ర తలుపులు' లోంచి)





# గద్దర్

## ప్రాణహితకు వందనం

చలనంలో ఉన్న ప్రాణహితకు వందనం
సినుకు భూతల్లి వొడిలో రాలి
తల్లి గర్భంలో ఇంకిపోయి
సినుకు సినుకును, చుక్క చుక్కను
కలుపుకొని వరదయ్యింది
వరద, వరదను మెలేసుకొని, కలేసుకొని
పిల్ల ఏరులై పరుగిడుతుంది
పరుగిడుతున్న పిల్ల ఏరు, తల్లి ఏరు
వొడిలో చేరి
తల్లి ఏరై ఉరకలేస్తుంది
తల్లి ఏరులన్ని ప్రాణం పోసుకొని
ప్రాణహిత ఐనాయి

ప్రాణహితలో నా మనస్సు
ఈదులాడుతుంటే
నా కన్నతల్లి ఏరుదాటిన నాటి దృశ్యం కనబడుతుంది
పారుతున్న పసుపేరు దాటి, ఏరు అవలి గట్టుకు
కడ్పు కోసం కూలికి పోయినప్పటి కన్నీటి కథ గుర్తుకొచ్చింది
ఏరుకు మొక్కి మోకాళ్ల మట్టుకు చీరను గోసిబెట్టి
కొంగును నడుముకు చుట్టి, బొడ్లో కొడవలి దోపుకొని
సద్దిమూటను నెత్తిన బెట్టుకొని చేతికర్ర అంచె

(పంగకర్రను) తలకిందులు పట్టుకొని
ఏరుమొక్క పాట అందుకొంది
గంగమ్మ గంగమ్మా డోల్
ఘనమైనా గంగా....డోల్

ఏరుకు ఏటవాలుగా నడవాలి
దారి కనపడని ఏరులో
పాదాలు భూమిలో పాతుకొని నడవాలి
ఒక్కొక్క అడుగు భూమిలో పాతినంక మరో అడుగు కదపాలి
ఎట్టి కష్టకాలంలోనైనా పాదం పైకిలేపొద్దు
పాదం లేపితే ప్రాణం పోయినట్లే...
ఒకరినొకరు భుజాలు పట్టుకోవాలి నడుములు పట్టరాదు
వరద నడకను చూసి మన నడక సాగాలి
సుడిదిరిగే గుండం మన ప్రాణగండం
చేతికర్రను లోతు తెలుసుకోవడానికే వాడుకోవాలి
గుండె జారిపోకుండా ఒకరికొకరం....
కొట్టుకుపోయినా పట్టుకొస్తమని చెప్పాలి...
దసుకుతినెటోని చెవ్వులు పిండి ఈపుమీద దెబ్బకొట్టి
దాటోస్ దాటో.. అనాలి
ముందు ఒడ్డుకు చేరినోడు ఏదన్న ఓ చెట్టు ఆసర తీసుకొని
సేతులు అందించి గుంజుకోవాలే...

ప్రాణహిత పాదాల మొక్కి పనికిపోవాలి
పారే ఏరులా బతకాలి బిడ్డా
ఏరులో తుంగై బతకాలి బిడ్డా
ఏరును మురికి చేసి మర్సినోడే
మూతిపెట్టి తాగే రోజస్తది
ప్రాణహిత అంటే ఇదే...
ప్రాణహిత చదువుతుంటే అక్షరం పదమై,
పదాలు వాక్యమై, వ్యాసమై సజీవ నదిలా
కదిలిపోతూ ఉంటాయి

ప్రాణాక్షరాలను పట్టుకొని, ఏర్చి, పేర్చి
బాధల, కన్నీళ్ల, సెమట సుక్కల, నెత్తురు చుక్కల
వ్యాసమాల అల్లుతాడు అవి ఎంత మాత్రం...
అ,ఆ,ఇ,ఈ,లు కావు. జీవం పోసుకున్న జీవకణాలు

నది Universal
అందుకే ఈ అక్షరాలకు
Universality ఉంది, గాయపడ్డ తెలంగాణ
గాయం ప్రత్యేకత ఉంది గాయపడ్డ రచయిత
గాయపడిన తెలంగాణ అక్షరాలను ఏర్చి పేర్చి
ప్రాణహితగా ప్రాణం పోస్తాడు

చినుకు, వరద, ఏరు, పిల్లవేరు,
తల్లివేరు, ప్రాణహిత పయనం, సముద్ర గమ్యం
ఆవిరి, ధూళిదుమ్ముతో కలిసి మేఘమై
వర్షమై కాలంతో కదిలి తిరిగి తిరిగి ప్రాణహిత ఐతది

కాలంతో కలెబడుతూ కదిలిన ప్రాణహిత
పాదాలకు వందనం

('నమస్తే తెలంగాణ' నుండి)





# గజానన్ తామన్

## మృగశిర

Oh! to be in England Now That April s there - Robert Browning

మాటిమాటికి గుర్తుకొస్తున్నాయి నాకు
మైళ్ళ దూరంలో ఉన్న నా ఇల్లూ- ఇల్లాలు..

ఎల్ల వేళలూ, ఎల్లలపై నిఘా ఉంచుతూ,
రాళ్ళు రప్పలు పలుకరించే ఈ చలి ఎడారిలో,
సమరం శాంతిగాని సందిగ్ధ స్థితిలో,
కొట్టుమిట్టాడే సైనికుల్లో నే నొకణ్ణి..

చేరుకొని ఉంటాయి ఈపాటికి
ఎప్పటిలాగే నైరుతి ఋతుపవనాలు
కురిసి ఉంటాయి కుండపోతగా ప్రావృణ్ణీరదాలు
తృణాంకురనైగనిగ్యం అందుకొని ఉంటుంది
నా తెలంగాణం ముక్కోటి దేవతల ప్రాంగణం.

ఎఱ్రని పూలు మేనెల్ల కొల్లలుగా
విఱ్రవీగుతుంటుంది పెరటిలోని దాడిమ
క్రొంజిగురాకు సొగసైన తొడవులతో
వయసొచ్చిన లేమలా ముస్తాబై ఉంటుంది జామ
మార్పేమి ఉంటుంది మల్లియలో?

పంతగించి పొట్లలూ, బీరలూ
పందిరిని వ్యాపించి ఉంటాయి

బడులు ఇటీవలే తెరిచారు కాబోలు!
పదేళ్ళు నిండీ నిండని మా పార్వతి
ఐదవ తరగతిలో చేరి ఉంటుంది
పలక పై ఏవేవో గీట్లు గీస్తూ పసివాడు
ముప్పొద్దులూ పెద్దల్ని మురిపిస్తు ఉంటాడు....

గంటలు అవిరామంగా మోగుతాయి
దీపాలు చీకట్ల చీలుస్తూ వెలుగుతాయి
సందడి నానాటికీ పెరుగుతుంది
అందాల మా ఊరి కోవెలలో
నిత్య నవోన్మేషణం అనుగ్రహించే
స్వామికృతికి అనురూప స్పందనగా...





# గడ్డం పద్మాగౌడ్

## గన్‌పార్క్‌లో..

అమరుల ఆకాంక్షల వేడితో
అంతరంగం అనుక్షణం వెలుగుతుంది
అమరదీపమై...
బలిదానాల వారసత్వపు సంస్మరణల్లో
పూస్తాయక్కడ తొవ్వపువ్వులు...
వీరుల త్యాగాల స్మృతికి నివాళిగా
నిత్యం నినదిస్తాయక్కడ జోహార్లు...

శక్తిని కొలుస్తూ బోనమెత్తే
సంప్రదాయపు తొలి దీపం
గండె దీపం!...
గన్‌పార్క్‌లో అనునిత్యం ఆరిపోని
పోరాటాలు శ్వాసించే ఆశయ దీపం!...

ఇక్కడ మొలిచిన మొల్కలు
లోకానికి దారి చూపే వేగుచుక్కలు
అనంత పయనానికి ఎత్తిన తెరచాపలు
చరిత్ర నిర్మాణానికి పునాదిరాళ్ళు
సాహసాల సమరోన్ముఖపు చాల్లు
నీలికొండలపై పూచే ఎర్రపూలు

దమ్మున్న గుండెలు
తెలింగిణమ్మ జేగర్‌లు

చావు బతుకుల వెలుగు నీడల
కాలం కన్నుల్లో కదలాడే కాగడాలు
కళల పొద్దులై పొడిచే కాలపు వీరులు
అమరుల జ్ఞాపకాలకు దిద్దిన
రక్త తిలకాలు
గన్‌పార్క్‌లో గండె దీపాలు..





# గాజోజు నాగభూషణం

## బుద్ధిజీవి ముద్దసాని

అతడు విధిని శాసిస్తూ
జీవితాన్ని జయించాడు
కాలంపెట్టిన క్రూర పరీక్షలో కడదాకా
నిలిచి గొప్పగా గెలిచాడు
వైకల్యం వైరాగ్యం నింపలేకపోయింది
అచేతనత్వం చైతన్యాన్ని చంపలేకపోయింది
అందుకే విధిని ఓడించాడు
జీవితాన్ని గెలిచాడు

గతమెంతో ఘనమై
వర్తమానం శూన్యమై
బ్రతుకు అమవస నిశియై
భవష్యత్తు ప్రశార్థకమైనప్పుడు
మనోబలమే ఆయన దివ్యావుషధమైయ్యింది
సహధర్మచారిణి నిర్మల సకల సేవల శాశ్వత నేస్తమయ్యింది

సాహిత్యం జీవిత చుక్కానిగా మారి
సారస్వత కలలతీరాలకు చేర్చింది
నిత్యం పడుకుని ఉండే ఆ మంచమే
ఆయన లోకపరిధై నియంత్రించినా

ప్రాపంచిక దృక్పథం జ్ఞానసేద్యానికి పట్టం కట్టింది
నిరాశా నిస్పృహలు దరిచేరకుండా వైద్యం చేసింది

'సురవరం' 'బూర్గుల' జీవితాన్ని ఆవిష్కరించి
'దర్బారురాగాన్ని' దర్జాగా ఆలపించి
'ఆరడుగుల నేల'ను తాత్వీకరించి
'వక్రరేఖల' వంకరలను లోకానికి తెలిపి
'గాలిమేడల కొలంబస్'లో చెట్టాపట్టలేసుకొని
'లండన్‌లో ఒక రాత్రి' అనుభూతులు పంచి
స్వీయ రచనల సింగారాలతో
అనువాద కృతుల అలంకారాలతో
తెలంగాణ సాహితీ పతాకాన్ని
కళాత్మకంగా తీర్చిన నవ్యశిల్పి

పురస్కారాలు ఆయనకీర్తి వనంలో పుష్పాలై విరబూసాయి
సత్కారాలు జనం ప్రేమకు తార్కాణమై వెల్లివిరిసాయి
యువకలాలకు నిరంతర స్ఫూర్తిని పంచుతూ
డాక్యుమెంటరీ చలన చిత్రమై సజీవంగా నిలిచాడు
కరీంనగర్ సప్తగిరి కాలనీకి చిరునామాగా మారాడు
"ముద్దసాని రాంరెడ్డి మార్గ్"లో శిల్పమై పల్కరిస్తాడు





# గూడ అంజయ్య

## వీర తెలంగాణ

నా తెలంగాణా... నా తెలంగాణా
అనాదిగా అరుణ అరుణ వీరులకిది ఖజానా
నా తెలంగాణా నా వీర తెలంగాణ
నిలువెల్ల గాయాల వీణా ॥నా తెలం॥

దోపిడీతో రాజీపడక
తొడగొట్టిన తెలంగాణా
దొర కొడుకుల పెత్తనాల
మెడలంచిన తెలంగాణా ।నా తెలం।

తట్టిచూడు తెలంగాణా పల్లె పల్లెను
చూపుడు వేలుతో నేటికి
చూపుతుంది దోపిడీ దుర్గాలను
మా గానం మట్టి సాక్షి మందుతుంది తెలంగాణా । నా తెలం॥

కెలికి చూడు అమరజీవి తల్లి గుండెను
చెబుతుంది ఈ దోపిడీ ఆత్మకథలను
అడిగి చూడు అడవి తల్లి ఆవేదనను
తగిలిన తూటాలకు తల్లడిల్లిపోతుంది ॥నా తెలం।
కో...అంటే ఓ....అన్నవి

నల్లగొండ కొండలు
పద పదపద పమ్మన్నవి
ఓరుగల్లు పల్లెలు
ఉన్నాలే రమ్మన్నవి అమ్మవంటి
ఆదిలాబాదడవులు ॥నా తెలం॥

తొలి వీరుడు కొమురయ్యకు
మలి పలుకులు పలుకుతుంది
అమరవీరులాశయంతో
మనుముందుకు ఉరుకుతుంది ॥నా తెలం॥

తరతరాల ఈ దోపిడీ
సంకెళ్ళను తెంపుకొని
ఉరుకుతుంది ఉరుకుతుంది రైతాంగం
భల్లున తెల్లారనుంది తెలంగాణా తల్లి ।నా తెలం।





# గోరటి ఎంకన్న

## తెలంగాణ పాట

తడియారని కనులకు ఎన్నాళ్లీ వలపోత
తడియారని కనులకు ఎన్నాళ్లీ వలపోత

మడి తడువని నేలకు ఎందాకా ఈ ఎదకోత
తడియారని కనులకు ఎన్నాళ్లీ వలపోత

ఏ కుటిలము చేత చెదిరెను నీ నుదుటి రాత
కడకు బలిపీఠాన తల నిలిపితివా ఓ తెలంగాణ మాతా
కడకు బలిపీఠాన తల నిలిపితివా ఓ మాతా...
తడియారని కనులకు ఎన్నాళ్ళీ వలపోత

అలనింగి చనుబాల ఎదపొంగులా ధార
తనువారా సేవించి ఈ సెరువులే సిరులూర
తనువారా సేవించి సెరువులే సిరులూర
ప్రతి పల్లె పసిమి నెలవంకలా బాసిల్ల
ప్రతి పల్లె పసిమి నెలవంకలా బాసిల్ల

అలల తరుగల రాశి
అలల తరుగల రాశి
పాయె మమ్మోదబాసి
పాయె మమ్మోదబాసి

సిరులు చెరిగిన చోట
కరువు వేసెనె మేట
కరువు వేసెనె మేట
తడియారని కనులకు ఎన్నాళ్ళీ వలపోత

ఇల గర్భమున గనుల
వెలలేని ఖనిజాల
తరగని సిరిసంపదల
నిలయము ఈ నేల
నిలయము ఈ నేల
వాణిజ్య వర్తకపు రాశుల నజరానా
వాణిజ్య వర్తకపు రాశుల నజరానా
ఎవరి కలయిక వల్ల లేమి కలిగేనల్ల
తడియారని కనులకు ఎన్నాళ్ళీ వలపోత





# గోపి భాగ్యలక్ష్మి

## ఈ బాట నీది!

అరణ్యా!!
నీ 'రోదన' ఇప్పుడిదా??
'రవి' అస్తమించని రాజ్యపాలకుల
ఉక్కు పాదాల క్రింద నలిగినప్పుడిది

అడవి పుత్రుడా!!
నీ 'శోధన' ఇప్పుడిదా??
'నిరంకుశత్వ' నైజాం ప్రభువుల
'నైజం'లో నిదుర లేచినది

వీరుడా!!
'నిశి' నుండి వెలువడిన..
ఈ 'కేక' ఎక్కడిది.?
'నట్టడివి'లో నీ తల్లి
నిన్ను కన్నప్పుడిది..

చేతనమా!!
ఈ నేల పై ఎక్కడిది??
'కొమురం భీం' ఈ గడ్డపై..
నేల కొరుగు...తూ..
ఎత్తిన 'పిడికిలి' ది



# గోపగాని రవీందర్

## తరుముతే..తట్టుకోలేరు..!

జనం మధ్య పుట్టినందుకు
నాగరికంగా పెరిగినందుకు
మీరు సంతోషంగా ఉండొచ్చు

చుట్టు ఆవరించిన తరువుల మధ్య
దట్టమైన కొండల, కోనల మధ్య
మొక్కలా ఎదుగుతూ
ముద్దు ముద్దుగా వాటితో
ఆడుకున్న వాణ్ణి
చెట్టులా కనిపిస్తున్న వాణ్ణి
అడవితల్లే చిరునామగా
మనుగడ సాగిస్తున్న వాణ్ణి

కలల ఆలోచనల్ని
ఆకాంక్షల ఆవేదనల్ని
ఆర్తనాదల కలబోతల్ని
సహచర వృక్ష నేస్తాలతో
పంచుకున్న వాణ్ణి

ఆకలైతే అన్నం పెట్టిన తల్లిని
దుఃఖపడితే ఓదార్చిన తల్లిని

అలసిపోతే మెత్తని పరుపై
సేదతీర్చిన తల్లిని
విడిచిపొమ్మనుట తగునా?

పుట్టలోని తాచు పాములతో
పొదల్లోని కుందేళ్ళతో
లోయల్లోని మయూరాలతో
చెంగు చెంగున దూకే జింకలతో
నీటిమడుగుల కాడి పులులతో
ఎదురుపడకుండా
ఒడుపుగా తప్పించుకుంటు
సహజీవనం చేసే నేర్పున్నవాణ్ణి
నా మట్టి నుండి దూరంగా తరమకండి

వేలాది సంవత్సరాలుగా
నా ముత్తాతలు తిరిగిన దారులే
ఇంతకాలం రక్షణ కవచాలైనవి

తుడుముంటే చాలు
పులులను తరమటానికి
నైపుణ్య వ్యూహాలు తెలిసిన వాణ్ణి
జనారణ్యంలోని
మేకవన్నె పులుల నుండి
తప్పించుకోవటం తెలియని వాణ్ణి

ఇన్నేళ్ళ సంది లేంది
ఇప్పుడేం గుబులు కాదు
పునరావాస ప్రతిపాదనలు వద్దు
కొత్త చోటులో ఇమడలేను
రూపాయల కట్టలతో బతకలేను

నాతో పెరిగిన గొడ్డుగోదాలు
లతలు మొరపెట్టుకుంటున్నాయి
వదిలిపోవద్దని కుమిలిపోతున్నాయి

కవ్వాల అభయారణ్యంలో
పులులు, చిరుతలే కాదు
నిర్భయంగా నేను తిరుగగలను
తరుముతే.. తట్టుకోలేరు...!





# చెరబండరాజు

## ఎర్రగడ్డ

నిజంగానె నిజంగానె
తెలంగాణ మాగాణం
అనాదిగా అరుణారుణ
వీరులకే జయగానం

రజాకార్ల నాజీలను
దేశముఖుల గూండాలను
తరిమి కొట్టినట్టి వీర
గెరిల్లాల జన్మస్థలం

దోపిడితో రాజిపడక
తొడగొట్టిన జీవగడ్డ
దొర కొడుకుల పెత్తనాల
మెడ విరిచిన ఎర్రగడ్డ

శ్రమజీవుల దీర్ఘకాల
పోరాటమె మన మార్గం
విశ్రాంతి నిద్రలకూ
కాదండి ఇది తరుణం

ఢిల్లీ సర్కారు గుండె
నదురు తెలంగాణమంటె
కెరటాలుగ రైతులారా
లెండి ప్రభుత్వాన్ని గూల్చ





# జయరాజ్

## బతుకమ్మనూ..

బతుకమ్మను బత్కలేనమ్మను తెలంగాణవ్వ
బతికిచెడ్డ బాధ నాకున్నది బువ్వలేనవ్వను
రాష్ట్రమొస్తే చూడాలన్న ఆశున్నది ॥బతుకమ్మ॥

కండ్లల్లల్ల గోదారి పారుతున్నా
కాళ్ళల్ల కృష్ణమ్మ కదులుతున్నా
గుండెల్లో దాహాలు తీరవాయె
మా గుడిసెల్లో దీపాలు వెలుగవాయె

సాలల్ల రతనాలు పండేవిరా
నేలనేలంత ఖనిజాల మాగాణిరా
నాటి వజ్రవైడ్యూర్యాలు ఏమాయెరా
నేడు అణువణువు అంగట్లో సరుకాయెరా

పనికి అనవాల్లు పాలమూరువాళ్ళు
పస్తులతో వలసెల్లి పోతున్నరు
ఎండిపోయిన రొమ్ముకెగబడ్డ బిడ్డల్ని
ఓదార్చలేని తల్లినవుతున్నదా

పట్టువస్త్రం నేసి అగ్గిపెట్టెల పెట్టి
ప్రపంచానికి పంపిస్తిరా

నాటి చేనేత చేజారిపోతున్నదీ
నేడు సిరిసిల్ల ఉరిసిల్ల అవుతున్నదీ

నేలంత నెత్తుటీ ఊటాయెరా
పల్లెపల్లంత వల్లకాడైపాయెరా
ఊరంత స్థూపాలమయమాయెరా
ఊల్లె బతుకెటోడే నేడు కరువాయెరా

ఖద్దరేసుకున్న నేతల్ని చూస్తుంటే
కడుపులో దేవినట్లవుతున్నదీ
పాలుతాగే రొమ్ము గుద్దేటి కొడుకుల్ని
పాతరేయాలనిపిస్తున్నదీ





# జనజ్వాల

## మాకు ఒక ఆకాశం వుంది

మాకు ఒక అకాశం వుంది అన్నట్లు
ఒక అకాశం వుంది

రాత్రి ... పగలు.., అకలి మీద సంతకం చేస్తున్నట్లు
అవ్వ. కొడుకు కోడలు  కొడుకుని వెతుక్కుంటున్నట్లు
మాకు ఒక అకాశం వుంది

అడుగు అడుగుల కింద కములుతున్న
మట్టి... మంటౌతున్నట్లు
మనిషి కరువైన్నట్లు

అయ్య అమ్మల అప్పు కళ్ళు అడవికొండల పక్షులౌతున్నట్లు
మాకు ఒక అకాశం వుంది

పల్లె పల్లెకు ఎర్ర బస్సు ప్రగతికి ధర్మచక్రం అయినట్లు
గుడిసె గుడిసెకు తాళం కప్ప జాతి జెండా అవుతున్నట్లు
మనిషి తలమీద తట్టెడు ఆకాశం వుంది
మాకు ఒక ఆకాశం వుంది
మాది పాలమూరు తల
మాది పాలమూరు ఆకాశం
తలమీద తట్టెన ఆకాశం

తలక్రిందులుగా, తారుమారు తమాషల ఆట ఆడుతుంది
అవును అవునవును ఇప్పుడు వలస కన్నీటిచుక్కలతో
భూమి పొర సెగల మీద ఒక ఆకాశం
సినిమాల్లో సిత్రంగా వర్షం కురిసినట్లు, తడిసినట్లు
సిత్రంగా ఏకాలమైన, ఎండాకాలమే అయినట్లు
వర్షం కురవని ..కరవని
ఒక ఆకాశం
మాకు ఒక ఆకాశం వుంది
మాది పాలమూరు తల
మాది తెలంగాణ!





# జలజ

## బాపూజీ

విశ్రమించని వీరుడా- అస్తమించని సూర్యుడా
ఆగని పోరాట ప్రవాహమా- వాడని త్యాగాల వనమా
కొండ మాకండ బాపూజీ - కొండాలక్ష్మణ్ బాపూజీ

బ్రిటీషోని ఇంటిపైన జాతీయ జండావైనావు
నిజాము నవాబు గుండెలపై నిప్పై మండినావు
రెండు పదుల వయసు నాడే పేదల పక్షమయినావు
బడుగుల పోరాటమై బరిగీసి నిలిచావు

పౌరహక్కుల రక్షణకై న్యాయవాదివైనావు
తెలంగాణ ఉద్యమానికై పదవులెన్నో వొదిలినావు
ఐక్య ఉద్యమాలకై ఆరాటమై తపించినావు
పార్టీలను ఏకంజేసి ప్రజాపోరునే నడిపినావు

ఆస్తులను త్యాగం చేసి కీర్తినెంతో పొందినావు
వెనుకబడిన జాతులలో వెలుగులే నింపినావు
కలలుగన్న రాష్ట్రానికై కంకణబద్ధుడవైనావు
ఆశయాల సాధనలో అమర జ్యోతివైనావు





# జ్వలిత

## పది జిల్లల పసిడి ఖిల్లా

పది జిల్లల పసిడి ఖిల్లా
నా తల్లీ తెలంగాణా

నల్లబంగారపు గనులు
పసిడి పంటల చేలు
నా తల్లికి నగలు
సిరులు చిందే సింగరేణి
పాడి పంటల మాగాణి
నా తల్లికి పారాణి
గలగల నవ్వుల కెరటాల
గోదావరి కృష్ణమ్మలు
పసిపాపలకు పాలనిధులు
రైతులకు క్షీరధారలు
నా తల్లీ తెలంగాణాకు

సమ్మక్క సారక్కలు
పౌరుష పాఠాల గురువులు
నా తెలంగాణ తల్లి బిడ్డలకు
పోచంపల్లి, గద్వాల చేనేత చీరలు
ఇష్టమైన ఉడుపులు నా తల్లికి
కిన్నెరసాని వాలుజడ

పాపికొండల జడకుచ్చులు
తెలంగాణ తల్లికి
సౌందర్యపు సొరులు

శిల్పకళల రామప్ప
పదినూర్ల స్తంభాల హనుమకొండ
చేతి కళల నిలయం కళలకు కాణాచి
నా తల్లి తెలంగాణా

పోతన్న కలం, రుద్రమ్మ ఖడ్గం
చాకలి ఐలమ్మ గుండెబలం
తరతరాల ఘన చరిత
నా తల్లీ తెలంగాణా

బందగీ, మల్లోజుల సరసన నిలిచే
శ్రీకాంతాచారి భోజ్యా రేడ్యానాయక్‌లు
నా తల్లికై పోరే ముద్దు బిడ్డలు
పది జిల్లల పసిడి ఖిల్లా
నా తల్లీ తెలంగాణా

యోచనతో రచన చేసి
పది జిల్లల ప్రజలంతా
ఏకతాటిన నడిచి
సాధింతురు తెలంగాణ
సారమున్న తల్లి బిడ్డలు

పదిజిల్లల పసిడి ఖిల్లా
నా తెలంగాణా..





# జాకబ్

## అంజలిదే ముఖ్దూం

పల్లవి: నవకవితా గానమా కార్మిక గణ హృదయమా
జన రణనాదమా సమతాశయ శౌర్యమా
అంజలిదే మఖ్దూం గీతాంజలిదే మఖ్దూం

చ: బాల్యం బాధల వలయంలో గడిపి
రెక్కల కష్టంతో ఉన్నతి సాధించి
పండిత జన సన్నిధిలో పీఠం వేసావు
పామరులకు ప్రాణంగా జీవించావు అంజలిదే।

చ: సాయుధ సమరాంగనాన యోధం నీవే
సాహితీ మదినలరించిన షాయరీ నీవే
కష్టానివే నీవైనా కరుణవు నీవై
కర్మవీరులకు శోభను కలిగించినావు ॥అంజలిదే॥

చ: అతుకుల గతుకుల బానిస బతుకులే పల్లవిగా
శ్రామిక జనపోరాటపు కెరటాలే చరణంగా
గేయాల్లో వేదనైనా గజల్లో ఆరాధనైనా
సామ్యవాద గమ్యానికే నీవు పడిన తపన ॥అంజలిదే।





# జీడి రమేశ్

## చిన్నదానివి కాదె

ఎల్లవ్వా! చిన్నదానివి కాదె..
బతుకు చిత్రం తెలిసిన బహుచిత్రాలమారివి
నోటి మాటలతోని కట్టిపడేసె ఇసిత్రాలదానివి
బుర్రమీసం లేని డాబు దర్పంలేని
ధైర్యశాలివె ఎల్లవ్వా!
అదేంది ఇదేంది అయిసపైసా అన్నోడి నోట
'అవ్వా ఎల్లవ్వ తల్లీ' అనిపిస్తివె
అసుద్ధపోల్లని అంటరానోల్లని
గిరిగీసుకున్న చెరసాలనుండి
ఆర్తిబిడ్డవు అమ్మతల్లివి
ఆడితె మంచిది పాడితె మంచిది
తాకితె మంచిది
తడారిపోని పంటలే పంటలు
'అవ్వా ఎల్లవ్వ తల్లీ'
కరుణించు మమ్మని దొరనోట అనిపిస్తివే

రామాయణ భారతం భాగోతాలు
జాంబవుని జాతుకం భావప్రసరణజేసి
దళితుల నెత్తిన కిరీటమై మెరిసి
మేమే గొప్ప అనిపిస్తివె
గుడ్డోడు- గూనోడు - గుణమున్నోడు

కర్రు చెప్పులోడు జర్రతిక్కలోడు
ఎదురైనోడు ఎవ్వడైనగాని
గిరిదాటి రమ్మంటె బుద్ధిమాటలు జెప్పి
నడ్డిరిగ తంతివె
ఏట పందుల్ని ఏసినట్టు ఏస్తివె..
మొగోనోలె సావుదలదాక ఏషాలు గట్టి
మురిపించి మరిపించి అబ్బురమనిపించి
గుడెసెపై మెరిసిన అలసెంద్రవంకవు
అంటరానోల్ల పద్మశ్రీ
పంచముల పాలిటి జాతిరత్నమా
మాదిగల డప్పుపై ఏగేటి సిర్రవు
'మనువు' ముద్దాడే మనుషుల
అహంకార ముద్దల్ని కోసిన
కొంగవలి కత్తివి
మాదిగల వాడల్ల లందె కంపు (సువాసన)
అందరి మన్ననల అస్పృశ్యతకలవు
ఎద్దూ ఎవుసంలేని దళిత రైతువు
చదువూ సంధ్యల్లేని సైకాలజిస్టువు
బాంచనే ఆయుధం వొంచను మదగజాలను
అమరం నీ మాట
'నేను  చిందుల ఎల్లమ్మ'
పుస్తకం నోట నీ యవ్వ ఎల్లవ్వ
చిన్నదానివిగాదు!
చచ్చిపోయిగూడ సాగిచ్చుకుంటానవు
కవితలల్లంగ ఊపిరాడుతలేదు
యాడాదికొక ఊరు అర్సంగ ఇస్తము
మల్లొచ్చి ఆడాలె అదురాలె నేలంత
నటరాజు మెచ్చిన నాట్యాల దేవేరి
సిందులేయ చూడ అందాల రేరాణి
అందాక నువ్వు అందుకో జోహార్లు
ఆరతిస్తం నీకు వేవేల దీపాలు..



# జీవన్

## సమర సేనాని సోయం గంగులు

జమేదారు బంజరందు
జన్మించెను నూత్న శిశువు
వీరుడు జన్మించెనని ప్రకటించిరి ఒజ్జలంత

వీరుడు జన్మించినాడు- మన
గిరిజన మందున యంచు
సంబురపడి పోయినారు- సంబురాలె చేసినారు

అడవి జంతు మాంస విందు
జీలుగు కల్లు ఇప్పసార ఎడతెగని ఎన్నెలరాత్రి
ఆడిపాడి కోయజనులు- సంబురాలె చేసినారు

ఆడిపాడి జనులందరు – బిడ్డకు
గంగులంటు పేరిడిరి
సోయం గంగులువయి వర్ధిల్లమంచు దీవెనలందించిరి
పసితనమందున పశువులనే కాసినాడు
పొలం పనులు పోడు పనులు
ఒక్కడు పదుగురి పెట్టున కాయకష్టం చేసినాడు

నిగనిగల బుగ్గలపై నూనూగు మీసము మొలిచెను
కండలు తిరిగిన గండరగండడై భాసించెను
గూడెము గుండెలన్ని ఉప్పొంగెను గర్వమ్ముతో

గూడెము ముద్దుబిడ్డ- గూడేనికి గుండెకాయ
గంగులంటె ప్రాణప్రదం- గంగులుంటె గుండెధైర్యం
ఒక్క తాటిపై నిలిచెను కోయజాతి కొండజాతి

సాదరముగ గోదావరమ్మ చేతులనే సాచెను
చిగురులతో అడవి తల్లి ఆహ్వానము పలికెను
గోదావరి బాహువులంత విస్తరించె గంగులు
అడవి తల్లి కొప్పువరకు ఎదిగినాడు గంగులు

భూస్వాముల పీడన- షావుకార్ల దోపిడి
ఆబ్కారి జంగ్లాతు - పోలీసుల దౌర్జన్యం
ఎదిరించగ కదిలినాడు - గిరిజనులను కదిలించి నాడు

అన్యాయపు పుల్లరి- అక్రమాల లెవీ
చెల్లదిక చెల్లదంటు బందుపెట్టనుద్యమించె
నీరు భూమి అడవియంత గిరిపుత్రులదేనంచు
సంఘాలే పెట్టినాడు- సంఘటితం చేసినాడు

నిరంకుశ నైజాముకు ఎదురొడ్డి నిలిచినాడు
రంగులమారి నెవురయ్యను నిలువరించపోరు జేసె
ప్రజారాజ్య స్థాపనకై కలలు గన్న ధీరుడతడు

ఏకలవ్యుని వారసుడు- గురి తప్పని విలుకాడు
అపజయమ్మెరుగని ప్రజాయుద్ధ సేనాని
గంగులు పేరింటె చాలు- గజగజలాడును నిజాము ఫౌజు
గంగులు పొడగన్న చాలు - గంగవెర్రులెత్తు ఢిల్లీ సేనలు
గంగులు ఎదురు పడితె యమలోకమె అగుపించును
గంగులు బతికుంటే మనము గెలువలేము యుద్ధమున
కుట్రలెన్నో చేసినారు- గంగులును పట్టినారు
నిరాయుధుడు గంగులును యముల హింసలు పెట్టినారు
అడవి కన్నీరు పెట్టె-గూడేలన్ని తల్లడిల్లె

కన్నుగానని కసాయి మూకలు కనుగుడ్లను పెరికినాయి
గుండె జారిన పిరికి పందలు కండలు తెగ నరికినాయి
ప్రళయకాల రుద్రుడై గర్జించెను కోయ బెబ్బులి
ప్రజాపోరుదే తుది విజయమ్మని ఘోషించెను యోధుడు

రుద్రాక్షపల్లి నట్టనడుమన-రావి చెట్టుకు వీరునిగట్టి
కనికరమెరుగని కసాయి మూకలు- తుపాకిగుండ్లకు ఎరజేసినవి
కావురమెక్కిన ముష్కర మూకలు- శూరుని రక్తము కండ్ల జూసినవి
ధోకా లేదని గంతులేసినది-నిలుకడలేని ఢిల్లీ పీఠము

ప్రజాపోరుకు భాష్యం చెప్పిన
సమర సేనానిర సోయం గంగులు
నిరంకుశులపై విసిరిన అంకుశము
శూరుడు సోయం గంగులు
పోరు చరిత్రల చిరస్థాయిగా
వెలుగును అమరుడు సోయం గంగులు..

(1946 - 51 మధ్యకాలములో జరిగిన తెలంగాణ సాయుధ పోరాటంలో 'కోయ బెబ్బులి' గా పేరొంది రుద్రాక్షపల్లి అనే గ్రామంలో యూనియన్ సైనికులు కాల్చి చంపగా అమరుడైనాడు)





# జూపాక సుభద్ర

## నీళ్ళారగిద్దాం

కృష్ణా గోదారంచులతోని
చెరువద్దాలు ఎర్రనల్లటిరాగడి రంగుల్తోని
నాగేటి సాల్ల పోగుల్తోని నేసిన పంటల సీరెగట్టి
దండకారణ్యాల రైకె తొడిగి
గోల్కొండ ముత్యాల వజ్రాలనొడినింపుకొని
కార్ఖానాల గనుల కాశె బోసి
మోటబాయి గంటీల్‌తోని
జొన్నశేన్ల గుండ్లపేర్లేసుకొని
బత్కమ్మ సద్దుల పాటల ముక్కుపోగుతోని
కాల్వల వాగుల కడాలతోని
నల్లతుమ్మ వనాల వన్నెలతో
పంట పొలాల నవ్వులతో
తాటితోపుల నడికట్టుతో
పూసిన తంగేటి పసుపుతో
మోదుగుపూల బొట్టు బెట్టి
నల్లటి కుండల పచ్చటి బతుకులకోసం
ఎర్రటి బోనమండి
నల్ల బంగారం బావుల్ని దీపంతగ జేసి
ఎవ్వలపాల్లు వాళ్ళకు సమంగ పంచే
కొత్త ఎల్లులు ముట్టియనీకి
పాలకుర్తి అయిలమ్మోలె
వచ్చే తెలంగాణ తల్లికి
నీల్లారగిస్తూ
దొరతనాలను పొలిమేరలకు తరుముద్దాం..



# జూకంటి జగన్నాథం

## ఏ ఒక్కటీ ఒక్కటి కాదు

పైకి ప్రశాంతంగా ఉంటుంది
లోపల అశాంతి రగులుతుంది
ఎన్ని ఎత్తులు వేసి జిత్తులు చేసి
ఎంతెంత సమన్వయ పరిచి
ఇరు వేరు వేరులను
పొత్తుగా ఒక్కటి చేసిన
క్షణభంగురంనుంచే
రెండుగా విడివడుతుంటాయి
నదులు గదులు
ఒక్కింత సంయోగాలు కూడా
ఉపరితలం ఉదయంలా
మెలకువగా ఉంటుంది
పునాదిలో చలిరాత్రి మంటలా
రాజుకుంటుంది

ఎన్ని వ్యూహ ప్రతి వ్యూహాలు పన్ని
సుంత సంధితో సర్దుబాటు చేసినప్పటికీ
ఏ ఒక్కటీ
ఎప్పటికీ ఒక్కటి కాలేదు
మనుషులు మనసులు అంతా
ప్రాంతాలు కూడా...





# జూలూరు గౌరీశంకర్

## నడిగూడెం గిట్లయిందేంది?

దేశానికే ఎర్రజెండానందించిన చేయి
నా నల్గొండ
ధీర, వీర, త్యాగాల తోవ నా నల్గొండ
పట్టెడన్నం బెట్టిన నేల కోసం
పానాల్ని యిసిరికొట్టిన నల్లగొండలం
మనం మట్టి వాసననలం
పోద్దాడు కల్లులొట్లం చైతన్య పొదుగులం
వడిసెల రాళ్ళం కారపు రోకళ్ళం
తాటి ముంజులం ఈతపళ్ళం జొన్న బువ్వలం
గోసిగుడ్డల అవ్వలం అయ్యలం
సృజనకు పురుడుబోసిన గడ్డ నల్గొండ
చరిత్రకే చరిత్ర, త్యాగాల చరిత్ర
నెత్తుటి చరిత్ర, మానవీయ చరిత్ర
నల్గొండ ప్రపంచ చరిత్ర
ఎట్లాంటి మాఊరు ఎట్లయ్యింది
మా నడిగూడెం నవిసినట్లయ్యింది
ఊరే కళ తప్పింది, పాలిపోయింది
గడ్డిపోసలతో పచ్చరంగేసినట్లున్న
బడి వాకిలి ఎండింది
ఇంజన్‌బాయి, గిరకబాయిలెండినయ్
నీళ్ళులేక ఊరు ఎండిన నాలుకాయే

వడ్లబజార్ల మంచినీళ్లబాయి ఉప్పుకశమైంది
ఊర్నిప్పుడు ఫ్లోరోసిస్ పట్టింది
అది అమ్మోరై ఇంటింటికి ఎగబాకింది
ఈడ్చుకపోయిన డొక్క ఎముకలు తేలిన వొల్లు
ఒంగిన నడుము పడిదప్పిన సూపులు
కళతప్పిన మొకం ఇదేం గత్తరో?
ఇరుగుడెప్పుడో? ఊరు పీక్కబోయింది
రోగాల గూడైంది చీకిపారేసిన టెంకలాగుంది
కాలి గజ్జెల సప్పుడుతో
నడుస్తుంటే ఎగిసిపడ్తున్న యవ్వన అదరాలతో
నడుము ముడతల మడతల
సొగసులతో మురిపించి
కవ్వించి, కదిలించి, ఊగించి, ఉరికించి
మా మనసుల్ని ఎగరేసుకెళ్ళిన
అందాల సొగసుల నజరానా మా నడిగూడెం
ఇప్పుడు వొట్టి సవిటి నేలయింది
ఊటలేని బావైంది ఆకు రాలిన చెట్టైంది
పూత లేని మొక్కైంది రుసి లేని నాలుకైంది
బళ్ల పంతులు జెపుతుంటే
పిల్లలు పళ్ళు గొరుకుతండ్రు!
నా నీళ్ళు ఎవలు కాజేసింద్రు?
నీళ్లు నిప్పులు! పగులుతున్న కన్నీళ్ళు
పగిలిన గుండెలా సెరువు తరగతి గదినిండా
ప్రశ్నలే ప్రశ్నలు పిల్లలు ప్రశ్నలు

సెరువలుగు కాడా ఎగిరే
చందమామ చేపల తెల్లగుంపులేవి?
అలుగు పలిగి రాళ్ళ పంజరమైంది

ఎన్నెన్నో నీళ్ళ పిట్టలతో బుడి బుంగలతో
ముక్కెర పాముల్తో యిసుక దంతుల్తో

తీరొక్క సేపల్తో ఊరి కుతికల దాకా నీళ్ళు
సెరువు ఏమైందో! ఇది కరువు కనికట్టో
నా నేలకు ఎవడేసిన కాటో

జగ్గయ్యపేట డిపో ఎఱ్ఱ బెంజి బస్సు ఇక్కడ్నే
రౌండ్లు కొట్టాలే
సీటునిండా మా సైదులు కూకొని
స్టీరింగు తిప్పుతుంటే సూడాలే
ఆ దువ్వ లేసి  ఒంటిని కప్పేస్తుంటే
అదొక దువ్వానుభూతి
అదొక మట్టి పరిమళ భాష

గాంధీ పార్కుల రేడియో
సామూహిక వినోదం జానపదం
నా కళలే నా తల్లులు యాసే మా శ్వాస

శనివారం పావలా సైన్మా
సింగిల్ ప్రొజెక్టర్ సైన్మా
మచ్చయ్యే కట్టించిన సైన్మా హాలు
యిసుకల వెండి తెర ముందు
పిడి గుద్దులు, కత్తుల కొట్లాటలు
పక్కనోడి డొక్కలో గుద్దులు
ఈలలే ఈలలు పోరగాళ్ల గోలలు
ఇపుడు దాన్ని ప్లాట్లు జేసింద్రు

మా ఊరు ఎటుగాకుండైంది
బతుకులు ఎండినాకులైనై ఊరు చంపబడింది
వలస ఏడుపు కట్టలు తెగుతుంటే
పేగుబంధాలను మోస్కుంటు
సంచార జాతినై పట్నంకొచ్చిన
గిప్పుడు ఊళ్లో వంకర్లు పోయిన వొళ్లు

ముసలోళ్లే మిగిలింద్రు
ఊరి ముఖం ముడ్తపడ్డది
పళ్ళు గారబట్టినయ్ మోకాళ్ళు కూలబడ్డయ్
చిల్లుపడ్డ కంచమైంది సెలకల మీద ఒట్టిగాలి
అటక మీద జ్ఞాపకాల మూట
ఇక్కడ యవ్వనం అంగవైకల్యం
శైశవం వృద్ధాప్యం కళ్ళముందే ఊరు గూనిదైంది
నీళ్ళకోసం సొంత నేలకోసం
నెత్తుటి పాట మన బతుకుబాట బతకమ్మ పాట

సెగలుగక్కే నా పాటకు వలసకట్టలు తెగాలి
మన ఊళ్ళన్నీ నీళ్ళు కావాలి

పొక్కిలి నా పాట మత్తడి నా నేల
తెలంగాణ నా యాస కాళోజీదే అసలు భాష
ఇది ఆత్మగౌరవపు పాట ఆత్మ రక్షణ బాట





# జె. బాపురెడ్డి

## కారణజన్ముడు పి.వి.యాది పూలు

కరీంనగర మండలంలో పుట్టిన
కారణజన్ముడు పి.వి.
తెలంగాణ ఒడిలో పెరిగిన
తేజశ్శిఖరం అతడు

ఓరుగల్లు నుదిటి మీద వెలసిన
భారతజాతి అదృష్ట, జాతక రేఖ
ఎర్రకోట పూరించిన
ప్రజావిజయ శంఖం, అతడు-

విజ్ఞాన ప్రజ్ఞాన సింధువులో
వేయి పడగలెత్తిన
సత్య సాహిత్య చేతనం
బమ్మెర పోతన స్వాతంత్ర్య దీక్షను
భావించే భాషాంబర కేతనం
ఆయన వ్యక్తిత్వం-
"పాములపర్తి వేంకటనరసింహారావు "గా
పేరొందిన వేల్పుల కీర్తి మూర్తిత్వం
ఆయన 'నరసింహత్వం"
పెరంబుదూరులో అమానుషత్వం
ఫెళ్ళున ప్రేలినప్పుడు

రాగం పండే దేశం నిండా
రక్తం చిందినప్పుడు
జన జీవన రాజీవం
కటిక చీకటి వ్యూహానికి
బలియైనప్పుడు
మేలుకొన్న ఆశాస్వప్నం అతడు
హిరణ్యాక్షావరాలు పొదిన
హింసా రాక్షసత్వాన్ని
పెనుగోటితో కూల్చివేసిన
ఎనలేని నరసింహత్వం అతడు

ప్రమాదాలు దాడి చేసిన
ప్రజాస్వామ్య ప్రహ్లాదుణ్ణి
పరిరక్షించిన
ప్రజాశక్తి యుక్తి రూపం
సమత మమతల ధర్మదీపం అతడు
సమ్యక్ సమైక్య భారత సారధి అతడు
విభిన్న అభిమతాల మధ్య
సయోధ్యారామ సత్యవారధి అతడు
భక్తి, జ్ఞాన, కర్మ యోగిగా
అమ్లాన ప్రగతి రచనోద్యోగిగా
తెలుగు జాతి చరిత్రలో
వీడిపోని యాదిపూల
'వాడిపోని వసంతం' అతడు.





# టి. శ్రీరంగస్వామి

## కోటి సాహిత్యాల వెలుగు

నా తెలంగాణ కోటి సాహిత్యాల వెలుగు
శాలివాహన గాధా సప్తశతి
జినవల్లభుని 'కంద' మణిహారం
మల్లినాధసూరి వ్యాఖ్యాన వైభవం
రుద్రదేవుడి నీతిసారం
సోమనాధుడి (ద్విపద) వీరశైవం, బసవాష్టకం
గోనబుద్ధారెడ్డి రామాయణం
శాకల్యమల్లన్న ధారణ
చరికాండధర్మన్న భారతం, ఆశుకవితా వైశస్త్యం
తెలగన్న అచ్చతెలుగు కావ్యం
రుద్రకవి అష్టకం, యక్షగానం
తిరునామాలు, శతకాలు, నిర్యాష్ఠ కావ్యాలు
నా తెలంగాణ శారద జిలుగులు.
పోతన, వెలిగందల
మడికిసింగనల భాగవతం
ఈ నేలసుగంధ వసంతం
బద్దె భూపాలుడి సుమతి శతకము
శేషప్ప నరసింహశతకము
ఈ నేల జీవన వేదాలు
సురవరం, వట్టికోట, దాశరథి
దేవులపల్లి రామానుజుడు, బి.ఎస్.శాస్త్రి

నా సాహిత్య వారధులు, సాహిత్య వికాసాలు.
అగస్త్య నిర్యోరణ్యుల సాహిత్య భండాగారం
రామదాసు, తూము నరసింహదాసుల
కీర్తనాభాండాగారాలు
నిత్య అధ్యాత్మిక నైవేద్యం
గార్లపాటి, వరదన్న, కాళోజి, రామరాజు
సినారె., హీరాలాల్, పొట్లపల్లి రామారావు
సామల, కపిలవాయి పుల్లాభొట్ల, అంరె వెంకట్రాజం,
వరవరరావు, ముదిరాజు, రావికంటి వసునందన్‌లు
అధునిక సాహిత్య ప్రక్రియల మాగాణాలు
అచ్చమాంబ, నందగిరి, యశోదారెడ్డి
ముదిగంటి, మాదిరెడ్డి సులోచన, బొమ్మ హేమాదేవి
పోల్కంపల్లి, అమృతలత, అనిశెట్టి రజిత,
నారీ అంతశ్చేతనల చైతన్య దీపికలు.
కోవెల, మలయశ్రీ, ఎస్వీరామారావు
శ్రీరంగస్వామి, బాలశ్రీనివాసు, సుంకిరెడ్డిల
సాహిత్య కాలనాళికలు
నా తెలంగాణ జీవన మాళిగలు
భావితరానికి సాహిత్య సాకార నిధులు
నా తెలంగాణ నిత్య సాహిత్య చైతన్యాలగని
నా తెలంగాణ అచ్చ తెలుగునుడికారాల పోహళింపు
నా తెలంగాణ ఆత్మీయ భావుకతలకు చలివేంద్రం
నా ప్రాంత సాహిత్యం ప్రజల జీవనానికి ప్రతిబింబం
నా అక్షరాలు చమురుస్తున్న మృణ్మయ భాండం
బాసరతల్లి అమృతహస్తాక్షితలు నా అక్షరాలు
నిజామాంధ్ర సాహిత్య వారసులకు... అదాబ్...
అందుకే...
నా తెలంగాణ కోటి సాహిత్యాల వెలుగు





# టి. కృష్ణమూర్తి యాదవ్

## ఊరు పికాసో చిత్రం

తెలంగాణలో నా ఊరు
ఊళ్ళో దొరవారి గడి
గడిలో వెట్టిచాకిరి ఆనవాళ్ళు
ఇప్పటికీ దర్శనమిస్తాయి
ఊరు చుట్టూ గుట్టలు
నైజామును ఎదురొడ్డిన కమ్యూనిస్టు
పోరాటాల గుర్తులు దొరుకుతాయి
ఊళ్ళో ఇండ్ల ముందు బర్ల కొట్టాలు
ఇంటివెనుక ఎడ్ల కొట్టాలు
వాకిట్లో సాన్పుజల్లుకొని
సంక్రాంతి ముగ్గులే ముగ్గులు
అద్దకపు పూలచద్దర్‌లా కనిపిస్తాయి
ఊరు చుట్టూ పిల్లబాటలే
పికాసో చిత్రాల్లా
ఊరు పక్కనే
వాలిన నెలవంకలా చెరువు
అందులో పూసిన మల్లెమొగ్గలు కొంగలు
కొంచెము దూరాన జొన్నకర్రల చేన్లు
జనం జండాలు పట్టుకొని నిలబడినట్లు
మోటబావి నీళ్ళు
బొక్కెనలో ప్రాణం పోసుకొని

గలగల నవ్వేసి
పొలంతల్లి ఒడిలో నిద్రపోతాయి
దొరసాన్ల మెడల్లో
బంగారు నగల గొలుసులు నవ్వినట్లు
పొలాల్ల స్త్రీల మెడల్లో
వరి గొలుసుల తళతళలను చూస్తాము
బిడ్డను చంకనెత్తుకున్న తల్లుల్లా
కంకులేసిన మక్కజొన్న చేలు
పండిన మిరప తోటలు
దొరల భూముల్లో
నాటిన ఎర్రజండాల్లా కనిపిస్తాయి
పట చేండ్లలో గువ్వలూ గోరువంకలూ
తాటిచెట్ల కల్లుమండువాలో
తాగినోళ్ళ నడకల్లో నాట్యవిన్యాసాలే
చెడుగుడు, చిర్రగోనె, గోలీలాటలు
అమ్మ తినిపించే గోరు ముద్దలు
ఆకాశంలో చందమామ
అదో వెన్నెల పండుగ
మామిడి తోటలు ఈతకొట్టే బావులు
ఎండకాలం ఎంత హాయో
నేపుట్టిన కొత్తపల్లి ఊరు
ఇప్పటికీ నా బాల్యాన్ని గుర్తు చేస్తుంది

('శబ్నం' కవితా సంపుటి నుండి)





# డప్పోల్ల రమేష్

## మెతుకు బతుకులు

ఇయాల మెతుకుసీమల
యెవని మొఖం జూసినా
యెతల కుంపటయిందెందుకు?
యే కొంప జూసినా ఆరని కొరివైందెందుకు?

రాసుల్బోసిన వరికల్లం
సిన్గిన రైకతుప్పుడయింది
గోశెం బోర్లవద్ద బోకిపిచ్కలయింది
భూమినిండా పొక్కలే పొక్కలు!
డొక్కలునిండని దుక్కులు
శాతాదుకందని శ్యానతనం
పొక్కలువద్ద బొక్కెనయ్యింది

మెతుకు నేలంతా నెర్రెలే నెర్రెలు!
బొర్రెలే బొర్రెలు!!
గొర్రునడ్సేదెట్లా... నాగలి దున్నేదెట్లా...
కరిగెడ కవాతులెట్లా... ఎవుసం ఎదిగేదెట్లా
మెతుకులు రాలేదెట్లా?

నిట్టడిలేని కొట్టము సప్రమయినట్టు
యెన్నెల్లేని కొప్పుకు సవురమే ఆసరా
లేకుంటయపాయే...

యే టేకాలేని 'కంప్రమే' దిక్కాయె
గతిగావుమంటున్న మెతుకుసీమ
దిక్కులేనిదై అలతేరుతున్నది

మెదలు మెదల
పేళ్లితంతా దామెండ్ల తల్లుల పాలాయే
మోట బొక్కెన తిన్కిన తిప్పలు
మొల్సిన మొలుకకేమెరుక
దాన్ని మింగిన వల'సొచ్చి'న కుందేలుకేమెరుకా!

వాగుల హారాలు ధరించినా
తనువు తానమాడనితనం మెతుకుసీమదే!
మంజీర సెలిమెఊట కరిగెడమడి
నక్కెర పండ్లతీపి సెర్కుజూడీల తోట
పాలకంకుల సేను
తీరొక్క పువ్వుల పూత మెతుకు సీమదే!

ఇంతటి తీర్వాటమంతా చెదిరిపాయెగదా!

తుమ్మలు మొలిసి పల్లేర్లు నవ్వి
జిల్లేడు పూసెగదా!
సీసకమ్మర్లు గీరిన బతుకుసిత్రం
మెతుకుసీమది

పజ్జొన సాయిజొన్న
సజ్జరొట్టెల గుల్ల నేడు
సిల్కొయ్యకు యాలదేసిన కాటిగుల్లయ్యింది

సడక్ నిండా కంకరనాయే
కంతలు వలుగకుండెట్లుంటయి
భూమినిండా కాలుష్యపు బురుజులేనాయే

గడ్డిమొల్సేదెట్లా...
మొల్సినా మనెగల్గుడెట్లా?

యిత్తుకు యిత్తే
యివురం జెప్పుకున్నట్ల
యిగురుకు యిగురే
యిదేమిచ్చుకున్నట్ల
కానికి యెడ్ల జోడులా
మనెగల్వాలే మెతుకుసీమ





# తక్కెళ్ళ బాలరాజు

## కాళోజి తోడు

నేను మళ్ళీ మళ్లీ పుడుతాను
తెలంగాణ తల్లి ఒడిలోనే నిదురిస్తాను
మరణిస్తే తెలంగాణ మట్టిలో సమాధినౌతాను
సమాధిపై గరకపోసనై గడ్డిపువ్వునై పూస్తాను..

స్వేచ్ఛను పంచే తెలంగాణావు నువ్వు
దేశభక్తి పెంచే కాకతీయ కలేజావు నువ్వు
నా పటిమను పాలించే నీ నామం జై తెలంగాణ
నా జన్మజన్మలకు జీవశక్తివి మా అమ్మవి నువ్వు

నువ్వు తెలంగాణవై వస్తావని ఆశ
నువ్వు రాలేనంటే సమిధనై మాడిపోతా
క్షణక్షణంగావిస్తా రణరంగం
దినదినం తెలంగాణ నినాదమై...

కన్నులు నావైనా- కలలు నీవే
అధరాలు నావైనా - ఆలోచన పలుకులు నీవే
మది నాదైనా- మనోవేదన నీదే
శ్వాస నాదైనా - ధ్యాస నీదే

నా కోసం నువ్వు - నీ కోసం నేను
మన తల్లీతనయుల బంధం వీడిపోదేనాటికి
తెలంగాణ నువ్వు - తెలంగాణవాది నేను
కాళోజీ తోడు నిన్ను సాధిస్తా చూడు.





# తోకల రాజేశం

## వెండి కణాల ప్రవాహం

వెన్నెల జారిపోతున్నట్లు
హారం తెగి ముత్యాలు రాలుతున్నట్లు
తెల్లతెల్లని నవ్వులతో దూకుతూ జలపాతం
అప్పటిదాకా నాగరికం తెల్వని ఆదివాసీ పిల్ల
మంద్రంగా, వయ్యారంగా నడిచినట్లు సాగి
అంతలోనే తండ్రి నెత్తిమీదికెక్కిన చంటిపాపలా
కొండమీది నుంచి దూకే జలపాదరసం...

జలపాతం వల్ల అడవో
అడవి వల్ల జలపాతమో
రెండూ నిత్య వసంతంతో తులతూగుతూ...

ఆదిలాబాద్ సమస్తం అమ్మైనట్టు
ఆ అమ్మ ఒడిలో సేదతీరినట్టు
పంటచేను మట్టిలో పులకరించినట్టు
జలపాతం వొడిలో తేలుతూ వుంటే
కాశ్మీర్ దాల్ సరస్సులో షికారుకు పోయినట్టు
ఆపాదమస్తకమూ తన్మయత్వంతో తడిసిపోతూ
జారే బండలను చూస్తే
జలపాత ధిక్కార స్వరం
ప్రేమతో చెవియొగ్గి వింటే

అద్భుత నీటి సంగీతం
కుంటాల, పొచ్చెర పేరేదైనా
అదో వెండికణాల ప్రవాహం
వేడెక్కిన నాగరికాలను లాలించే నిర్మలత్వం..






# తైదల అంజయ్య

## నీకు వెయ్యేండ్లు

గూడెం మీద తుడుం మోగుతుంటది
నెత్తి మీద నెగడు మండుతుంటది
గోండు గోసను గొంతెత్తి అరుస్తుంటరు వాళ్ళు
నీ కనుల నీడలో అపుడు నెమళ్ళు మేల్కొని వుంటాయి
కోయిలలు గొంతులు సవరించుకొని వుంటాయి
కాసెగడ్డి పొదల్లల్ల గువ్వ గూడు జేసినట్టు
పలుగు రాళ్ళ బోరుమీద పావురాలు లేసినట్టు
జమ్మిసెట్టు కొమ్మమీద పాలపిట్ట నవ్వినట్టు
కంకవనపు డొంకలల్ల నెలవంకై పొడిసినట్టు
సింగిడి రుమాలుజుట్టి సిరిపాదం ముందుకేసి
కోరమీసం దువ్వుతుంటెనో కొమురం భీము
ఇప్పపూల కొండమీద నిప్పుపూల వానగురిసి
అలికి పూసిన అరుగుమీదనో కొమురం భీము
అలసిపోయి కూసుంటివో కొమురం భీము
వీరుడా! నీ సమాధి మీది గడ్డిపరకకు వెదురాకు పదను
నీ నిదురకు నూరేండ్లు నీకు వెయ్యేండ్లు

పోరితే విల్లయ్యే పాడితే వేణువయ్యే
వెదురువనాన్ని ఆత్మీయంగా అలైబలై దీసుకుంట
పీర్ల పండుగకు
తెలంగాణ వీరుల ముఖాలను ఊరేగించుత

చావళ్ల ముందు దుమ్ము రేపి ధూలా ఆడుత
దసర పండుగకు నా నేల నెత్తుటి మట్టి బంగారాన్ని
తలా పిడికెడు పంచుతా
నా తల్లి స్వేచ్ఛకై తెగిపడ్డ
ప్రాణ కుసుమాలను బతుకమ్మలుగా పేర్చి
ఉయ్యాల పాటలు పాడుతా!

('ఎర్రమట్టి బండి' లోంచి)





# దాశరథి

## తెలంగాణ

జగత్తులో నేడు సగం
దగాపడుట మానుకుంది
పేదజనం నేడు మొగం
తుడుచుకోని మేలుకొంది

ఇక నిద్దుర రాదు మనకు
ఇక చీకటి మాటలనకు
మండుతున్న సూర్యుడు మన
మండలాన విచ్చెన తన
కాంతి నేత్రమును నేడు
వెలుతురు నెవడడ్డలేడు

వెలుతురు లడ్డుటకొఱకై
పలుగోడలు పెట్టినారు
వెలుతురులను దాచుకొఱకు
పలు మేడలు కట్టినారు
ధనం దాచగలరు గాని
తేజస్సును దాచగలర?
తెరలు దించగలరు గాని
శిరస్సులను వంచగలర?
తమ మంత్రం పారదింక
ఉచ్చు త్రెంచుకొనెను జింక
ఇక స్వేచ్ఛా ప్రయాణము
ఇదే తెలంగాణము



('దాశరథి కవిత' లోంచి)



# దామెర రాములు

## స్వర్ణ భూమి నిర్మల్

ఏడు చెరువుల పంట పొలాల
నిర్మల వాతావరణం అహ్లాదభరితం...
ఏడు దర్వాజాలు
అదిలాబాదు జిల్లా
రాజకీయ సింహద్వారాలు..
నా దేశం వెన్నుపాములా
భాసిల్లుతున్న
ఏడో నంబర్ జాతీయ రహదారి
నిర్మల - తలలోని పాపట

అలనాటి రాచరికపు నీడలు
కూలీ కూలక నిలిచి ఉన్న కోటగోడలు

నాటి దౌష్ట్యానికి పరాకాష్ట
మౌనంగా తలొంచుకుని నేటికీ నిలుచున్న
వేయి ఉరుల మర్రి....

పులిని తరిమిన కుందేళ్ళ
ధీర భూమి నాది....
తెలుగు ఉర్దూ మరారిల
సమ్మిశ్రితం జన పదాలు...
బహు భంగిమల కొయ్య బొమ్మలు
తెలుగు తల్లి ముని వాకిట అలంకరణాలు

ప్రపంచ చిత్రపటంలో
అలరారే పేంటింగ్స్
చిరుహాసాల ఇంద్రధనస్సు
పారే పంట కాల్వలతో
విలసిల్లే స్వర్ణ భూమి నాది..

వడ్డాణంలా అమరిన
వాంకిడీ కనుమలు

ఆకసాన్నంటే
టేకుటాకుల గలగలలు
చిక్కని దట్టమైన రకరకాల
వన్య మృగాల నెలవైన కీకారణ్యాలు
ఉవ్వెత్తున ఎగసిపడే
కుంతల జలపాతాలు
నిర్మలకు కూతవేటు దూరం..

గుట్టలు చుట్టూ అదుముకుని అల్లుకుని
విస్తరిస్తోన్న పురోగామి నిర్మల
ఉత్తర తెలంగాణ తలలోని పువ్వు..

వాసర వాసిని
జ్ఞాన సరస్వతి ఒళ్ళో
ఓనమాలు దిద్దుకుని
దిన దిన ప్రవర్ధమానమౌతొన్న
అసమానవతి నిర్మల...

తల్లి గోదావరి తీరంలో
శ్రీరామసాగరం చేరువలో
మైలుపడని పేరున్న ఊరే- నిర్మల్-!!





# దాసరాజు రామారావు

## ఇరుగుడు

వలస కులాసా
పరాయోల్ల నదీ పడవలో హైలెస్సో

మాట పొత్తు కలిపి
చెట్లకాయలు గుంజుకొనుడు
దోపిడీ చెడుగుడు
దొరల్లా గదుముడు
పెద్దోళ్ళ బుద్ధిల కెక్కలె
ముల్కి సూత్రాలు
అయ్యవార్ల సగోత్రాలు
ఉద్యోగాలు ప్రమోషన్లు
నిత్య పెళ్ళి కొడుకుల తంతు
జగమెరిగిన అరొందల పది
రాజకీయ మదిలో ఖైదీ

యావ్వారం యాపారం
కువార్కం కుతర్కం
చరిత్ర ఎత్తుపల్లాలు
ఎత్తు పుటలన్నీ కబ్జా
తెలివంటే జిత్తులే
పాయిదార్ల జిగురు పూసిన కత్తులే

సోకులు జూపి సొమ్ములు చేసుకునుడే
కళల మీద కాలు రువ్వుడే

కుమ్మరి సారె తిప్పుండ్రి
కమ్మరి కొలిమి ఊదుండ్రి
దొడి కొమురయ్య జాగ పూదియిండ్రి

పండుగలు పబ్బాలు
ఈగడింపుల పాలు
సినిమోల్ల సరదాకు
దేవుడి పేరు బలి
ఆంధ్రా టిఫిను
ఆంధ్రా భోజనం
గల్లీలన్నీ సాంబారు వాసనే

గాలి నీళ్ళు అడ్డా
ఎవలది బిడ్డా
శాని భాష
శాని ఏషం
శాని జీవితం
శానా 'శాని' అని గొప్పలు
అర్థాలు తోడడానికి కూచుంటె
అంతా నాదానే

బాగోతం గద్దె కట్టుండ్రి
నెత్తిన రుమాలు చుట్టుండ్రి
నాగలినెత్తుకొని శిగమూగుండ్రి

జొన్న కర్రల జులూస్
జోరు చూప్తిదిగ



('పట్టుకుచ్చుల పువ్వు' నుండి)



# దిలావర్

## వేయి వెలుగులు

ఏ ఉలి కళ్ళలో విరిసిన స్వప్నమో
ఏ శిల గుండెలో వెలసిన స్వర్గమో
కాకలు తీరిన ఓ కాకతీయ రుద్రా
వాకలై వరదలై అర్థమై చరితార్థమై
నీ కల! శిలల బీళ్ళలో ప్రవహించి
శిల్ప శ్యామలమైన
ఏ సరసి హృదియో
నీ భావాల తేజస్సు వేయి రూపాలుగా
నీ కళా తపస్సు రగిలించిన శిల్ప దీపాలుగా
శిలల కిరణాలుగా శిల్పతోరణాలుగా
నీ ఎద వేయి రేకుల శిల్ప పారిజాతంగా
వేయి భావస్తంభాల హృదయాలయంగా
నీవు కన్న ప్రతి కల ఒక శిల్ప స్తంభమై
ప్రతి స్తంభమూ తెలంగాణ గుండెలో గుబాళించే
ఒక సురభిళ శిల్ప తరంగమై
ప్రతి తరంగమూ భావనా
సహస్రానేక భంగిమల నర్తించే
హృదయాంతర నాట్యరంగమై
నందీశ్వర గళశోభిత సురుచిర నూపుర రవళుల
అనుభూతుల సప్త స్వర సమ్మేళనముగా
అనూహ్యంగా- అనంతంగా- అమరంగా

ఓ కాకతీయ రుద్రా!
ఏ దివ్య లోకాలలో విహరిస్తున్నావో
ఏ అమరశిల్ప నాపాలను సవరిస్తున్నావో
స్పందించిన నా హృదయఘోషను
మ్రోగిస్తున్నాను ఉద్వేగంగా- ఉన్మాదంగా
ఎదద కడలి నుండి కనుల తీరాలకు
ఉవ్వెత్తున విరుచుకుపడుతున్న
భావోద్వేగ సంవేదనల కెరటాలను
ఈ వేయి వెలుగుల ప్రాంగణంలో
కోటి కోటి గుడి గుంటలుగా!!!





# దేశపతి శ్రీనివాస్

## జయశంకరు సారూ!

తెలంగాణ చెరువుతీరు జయశంకరు సారూ!
అలుగు దుంకి పారూ పదునైన మాట జోరూ
పాలు పోసుకున్న పజ్జొన్న కంకులల్ల
పైకి పైకి ఎగిరే ఆ పాలపిట్టలల్ల
నీ ఆశయాల వ్రాలు కనిపించె ఆనవాలు
జాతి కొరకు బతుకంతా ధారవోసినావు
నీతి కొరకు కడవరకూ నిలిచిపోరినావు
అంతరాలు మాసిపోయెబాట చూపినావు
ఆంధ్రవలస వాదాన్ని కూలదోసినావూ ।తెలంగాణ।।

చరితగల్ల తెలంగాణ తల్లి కడుపులోనా
సాయుధ రైతాంగపోరు పొద్దు పొడపులోనా
వీరభూమి ఓరుగల్లు ఒడలు పులకరించె
పొత్తిళ్ళలో పసిగుడ్డగ పిడికిలి బిగియించె
పల్లెనిండి కొత్త వెలుగు నిండి పరవశించె
భద్రకాళి చెరువులోన బతుకమ్మలు మురిసె ।తెలంగాణ।।

గండమోలె ఆంధ్రదండు దండిగ వచ్చింది
కొండ చిలువవోలె మన కొలువులు మింగింది
మర్కజి హైస్కూలులోన మంటలు మాట్లాడే
సిటీకాలేజిలో కొన్నెత్తురు కొట్లాడె

ముల్కి పోరులోన నువ్వు ముందుకురికి నావూ
గైరు ముల్కి గోబ్యాకని గొంతు విప్పినావు
నిదురపోని రాతిరివై నిప్పులు చెరిగావు ।తెలంగాణ॥

రక్తసిక్త చరిత్రలో అదో అగ్నికీలా!
అరవై తొమ్మిదివేళా ఎగిసెను జనజ్వాలా
కన్నులలో ఆవేశం కదలాడే రుద్రుడు
ఆధిపత్య శక్తులపై అతడు వీరభద్రుడు
ఆలోచన అవసరాన్ని తెలిసినా నిబద్ధుడు
తెలంగాణ కనుగొన్న అతడు మరో బుద్ధుడు ॥తెలంగాణ॥

తెలంగాణవాదాన్ని తీర్చిదిద్దినావు
మారుతున్న తరానికి మార్గం చూపావు
అరువదేండ్ల తెలంగాణ మనాదివే నీవు
మలిదశ పోరాటానికి పునాదివె నీవు
భావాలను వెదజల్లి వెల్లువవైనావు
తెలంగాణ పాటలకు పల్లవివైనావు
ఒడిదుడుకులలో చెదరని ధైర్యమిచ్చినావు ।తెలంగాణ।

ఉద్యమమంటే ఇప్పుడు ఉరుకుతున్న ప్రవాహం
స్వాభిమాన సమరంలో జాగృత జన సమూహం
సమానత్వ విలువ కొరకు సాగుతున్న పయనం
ఆ ఉదయంలో ధ్వనియించును జయశంకరు హృదయం
ఆచార్యా! నీ కీర్తికి లేదు కాలపరీక్ష ॥తెలంగాణ॥





# నందిని సిధారెడ్డి

## మాది మాకు

కొండోలొచ్చిన మబ్బు
కురువకుంట గుండెను పిండుతున్నదాయె
కంచె భూములు
ఇనుపముండ్ల వంచనకు గురయితంటే
గడ్డిదొర్కక గోజలు తొసుదీస్తున్నవాయె
చాటలో పసిగుడ్డు నుంచి
లంబడతండ లబలబ కొట్టుకుంటంది
వీక్షించేనా తల్లీ
మా తల్లీ దయగల్ల మా తెలుగుతల్లీ
నాలుగుకోట్ల తెలంగాణ బిడ్డల
ఉసురు పోసుకుంటూ వెలుగుతల్లీ! వెలుగు!
మేం సుత మొక్కుతం
మా బొక్కలెందుకు తేల్నయో చెప్పు!
తల్లీ, మల్లెపూల దండలేస్తం
మా నీళ్లెటు పోయినాయో చెప్పు
గోదావరి కృష్ణమ్మలను గొరగొర ఈడ్సుకపోతాంటే
గొంతు విప్పలేం తల్లీ
ప్రకాశం బ్యారేజి పక్కనేసుక పవళించేవు
రాజమండ్రి పడవపల్లకీలో రాత్రీపగలు రంజిల్లేవు
మేం ధర్నా చేసినా పూర్ణకుంభం తీసి వడ్డించవు

చెఱుకుగడ చేతబట్టటం
ఎవరి ఎత్తుగడో గని
మా మీద చిమ్మేదంతా చేదే!
మంగళారతులయితే మాయిస్తం గని
మా నల్ల బంగారం మాక్కాకుంట చేసిందెవరో చెప్పు
కోస్తా కాంత మెడలో రవ్వల వెలుగులు నవ్వుతున్న రహస్యం చెప్పు
యాభయ్యేండ్ల నుంచి నీ పాటలే పాడుతున్నంగదా
మా పాట్లు వినవా?
రెండు లక్షల ఉద్యోగాలు కాజేస్తే
రెండు మాటలన్నా అనవా?
తెలుగు తల్లీ, వెలుగమ్మా వెలుగు
తెలంగాణ వనరులు తరలించుకుంటూ వెలుగు తల్లీ
పలికితే పెదవుల మీది ముత్యాలు దొరలిపోయేను
నీ ప్రేమగల కాంట్రాక్టర్ల లాభాలు తరలిపోయేను
తీరైన తోటను విడతలు విడతలుగా
మిడతల దండు దండుకుంటున్నది
కండ్లు మూసుకో!
అక్రమాలకు కాపలాగా
సెక్రటేరియట్ ముందు వెలిసిన తల్లీ తెలుగు తల్లీ కండ్లు మూసుకో!
నమ్మినందుకు మా బతుకు ఫ్రీజోన్ అయింది
జైకొట్టినందుకు మా నేల జైలు పాలయింది
బంగారు పంటలు కోస్తాలోనే ఎందుకు పండుతాయో చెప్పు
ఏదమ్మా నీ కనుచూపులో కరుణ?
ఆత్మహత్యలు చేసుకున్నా మాపై ప్రసరించదు
వడ్డీ కాసుల వాడే నీవాడు
కాసుల్లేని మేం కానరాం
పలకని తల్లి
పాలివ్వని తల్లి
వొద్దువొద్దు ఎవల ఎంగిలి మాకొద్దు

పక్షపాతపు ప్రేమల కపట కరచాలనం వొద్దు
తెలుగుతల్లీ,
వెలిగిన వాళ్లనే వెలిగించుకుంటూ వెలుగు
మా బతుకుల నుంచి తొలుగు
పాలియ్య మనసురాని తల్లీ
మేం  పాలించుకుంటం
మా పాలు మేం పంచుకుంటం





# నలిమెల భాస్కర్

## తెలంగాణ భాష

తెలంగాణ భాష అంటే
ఎట్లుంటది?
అరటిపండు ఒలిచి మన నోట్లె పెట్టినట్టు
అల్కగ అర్థమైతది

తెలంగాణ మాట వింటే
ఏమైతది?
ఏక్‌దమ్ పెయ్యి పొంట రోమాలు నిక్కపొడిశినట్టు
గగుర్పాటు కల్గుతది

తెలంగాణ భాష అంటే
వాగు వారినట్లు, జావ జారినట్లు
పెరుగు పేరినట్లుంటది
పట్టుపాల శిక్కదనం, మంచినీల్ల సల్లదనం
కల్పి గిలకొడితే వచ్చేది తెలంగాణ భాషనే!
దర్వాజలకు కట్టిన బంతిపువ్వుల దండ తెలంగాణ భాషనే!!

తానమైనంక బిడ్డ చెంపకు
తల్లి ముద్దుగ దిద్దిన దిట్టిసుక్క
తీరొక్క పువ్వుల తోటి

పేర్చిన పెద్ద బతుకమ్మ తెలంగాణ భాషనే!!!
తెలంగాణ భాష-
మందార మకరంద మాధుర్యమున తేలి
మదనములకు పోని మా పోతన్న మధుపం
ఉరుతర గద్యపదోక్తుల కన్న
సరసమై పరగిన పాల్కురుకి జాను తెనుగు
అది పొన్నెగంటి తెలుగన్న అచ్చ తెలుగు
తరతరాల నిజాము పిశాచపు
దుమ్ము దులిపిన దాశరధి పద్యం
కాళన్న చెయ్యన్న కాదు
ఊపిరి తిత్తులు పోయినా ఫర్వలేదు
నేను మాట్లాడుకుంటనే చస్త అని చెప్పిన
ఆ కాళన్న గేయం
ఎవడబ్బ సొమ్మని కులుకుచూ
తిరిగేవు అనుకుంట తను సన్నమై
రాముని ప్రసన్నం చేసుకొని
పేరైనా కీర్తి అయినా ఆశించని రామదాసు కీర్తన
ఇంతకు తెలంగాణ భాష ఏం చేస్తది?
ప్రజలు పుట్టెడు కష్టాలల్ల ఉన్నప్పుడు
గుడ్డుకు కుంచెడు నీల్లు వద్పుతది
అది గండగరువుల కూడ
బండమీద పావుసేరు నూకలు,
చారెడు నీల్లు పుట్టించుకొని, బత్కుడు నేర్పిస్తది
తెలంగాణోల్లను ఏనాడు జైల్లల్ల వెడితె
అది వన్కది- జెన్కది
తాటిమట్టకు ఎదురు దేకుతది
కొద్దిగంత తిర్రమర్ర అయితె చాలు
అర్రల ఏసి కొడితె పిల్లి తీరుగ
దొరతనమ్మీద మర్ర వడుతది

ఉద్యమాలకు ఊపిరి పోస్తది
లొల్లికి మూలమైతది
ఇగ గంతెందుకు?
ఒకటి రెండు ముచ్చట్లల్ల చిన్నగ చెప్పుత
తెలంగాణ భాష
నెత్తురు సాక పోసిన చరిత్రలను నిర్మిస్తది
సెంటు వాసన కన్న చెమ్ట వాసన
మా దండిది అని నిరూపిస్తది





# నల్లెల్ల రాజయ్య

## పోరు బిడ్డల పురిటిగడ్డ

ఈ మట్టికి దండం
ఈ మట్టిల పుట్టిన ప్రతి బిడ్డకి దండం
ఇది తెలంగాణ మట్టిగడ్డ
పోరాట వారసత్వాల పురిటిగడ్డ

కాలం కాక కప్పం కట్టనందుకు
కాలుదువ్విన కాకతి రాజులతో
కదన రంగంల కడదాకా పోరాడినా
ఆదివాసీ ఆత్మగౌరవ ప్రతీకలు
సమ్మక్క, సారక్కల పురిటిగడ్డ కదా!
అందుకే ఈ మట్టికి దండం
ఈ మట్టిల పుట్టిన ప్రతి బిడ్డకి దండం

జల్, జంగల్, జమీన్ కోసం
నిజాం నిరంకుశ పాలన
నిరసిస్తూ కొదమ సింహాలై
కొన ఊపిరి ఉన్నంతదాకా
పోరు సల్పిన కొమురం భీం, రాంజీ గొండుల
రణగడ్డ కదా! అందుకే
ఈ మట్టికి దండం

ఈ మట్టిల పుట్టిన ప్రతి బిడ్డకి దండం
దొరగడీల జబర్దస్తీని
బడుగు జనుల్ని బర్బాద్ జేసిన
బాంచెన్‌గాళ్ళ బద్మాష్‌గిరీని
బరిగీసి తేల్చుకొమ్మనిన
షేక్ బందగీ, చాకలి ఐలమ్మల
కన్న సాహసగడ్డ కదా! అందుకే
ఈ మట్టికి దండం
ఈ మట్టిల పుట్టిన ప్రతి బిడ్డకి దండం

నైజాం తైనాతీ విసునూరి రక్కసి
వికృత కృత్యాలకు విసిగి
గుతుపలందుకొని గుడ్లెర్రజేసిన
కడివెండి కన్నబిడ్డడు
దొడ్డి కొమురయ్య జీవగడ్డ కదా!
అందుకే ఈ మట్టికి దండం
ఈ మట్టిల పుట్టిన ప్రతి బిడ్డకి దండం

నిజాం రాజ్యంలో కవితా సౌరభాలే పూజ్యమన్న
బ్రిటిషాంధ్రుల గూబలమీద గుద్ది
గోల్కొండ కవుల కవిత్వాన్ని
కావ్యీకరించిన సురవరం,
ప్రజల మాటల్నే పాటలై పండించి
దోపిడి గుండెల్లో మంటలై మండించిన
సుద్దాల హన్మంతుల సమరగడ్డ కదా!
అందుకే ఈ మట్టికి దండం

జనం గొడవే నా గొడవని
అన్యాయాన్నెదిరించి నోడే

నాకారాధ్యుడన్న ధిక్కార స్వరం,
నా తెలంగాణ కోటి రతనాల వీణ
యని రణ రణ వీణ మోగించిన
దార్శనికులు దాశరథి, కాళోజీల
పోరుగడ్డ కదా! అందుకే
ఈ మట్టికి దండం
ఈ మట్టిల పుట్టిన ప్రతి బిడ్డకి దండం





# నాంపల్లి సుజాత

## హుస్నాబాద అంగడి

సుక్కురారంగోలె ఏగిలివారంగ
సురువైతది హుస్నాబాద అంగడి
సుట్టుముట్టు ఇరువై ఊర్లపెట్టు
రాకడ పోకడకిరాంలేదు
పైసపుట్టేది మాయమయ్యేది
మందిగూడేది మర్మందెలిసేది గీన్నే

ఊరూరా చెక్కర్లుగొట్టే ఎర్రబస్సు
నెత్తిమీన మూటలతో కాన్పుకొచ్చే
ఆడిబిడ్డనాడు...
పెయ్యదుడ్డెనమ్మి పిండి బత్తలు
మ్యాకపిల్లలగొట్టి ఇత్తనపు సంచులు
మోటర్లల్ల మొలుకొచ్చిన గోదల మారుబ్యారం
పులుకు పులుకునజూసే ముసలిగొడ్ల
ఆల్‌కబీర్ పాల్జేసుడు ఇక్కడ్నే
కీస్‌పిట్ట పిల్లనగొయ్యలు
లబ్బరిగాజులు నితానురిబ్బెన్లు
ల్యాత కంకులు జామపండ్లు
కూరగాయ కుప్పలు కొర్రమట్ట చాపలు
ఎర్రెర్రటి మిరిపొరుగు బజాట్లనే ఊరిత్తయి
రంగురంగుల రైక గుడ్డలు రుమాల్లు

బాటంట యాల్లాడుతయి
వాటు నర్సయ్యపేనిన తల్లులూ తాల్లూ
అంగట్లనే దొరుకుతయి
రోల్లూ రోకండ్లూ చాట్లూ జల్లెన్లు
మర్తమాన్లు మారెసరు గుడ్లు ముద్దత్తయి
పసుపు కుంకుమ బుక్కగుల్లాలు
మల్లెచెట్టుకింది పొట్లం గట్టిచ్చే బుక్క సువ్వమ్మ
చినిగిన చెత్రిర్లు అనుంచెద్ద తాళాలు
మల్ల జీవునం పోసుకునేది ఎల్లంబజార్ల
కోతులాటలు చిలుక పంచాంగాలు
మల్లవారం దాక మొసదీసుకునుడే
తల్లిగారిండ్లకు మతులాబులు
తెలిసినోల్లతారని ఉప్పొసలు
సంటిపోరలనుంచి సచ్చేటోల్లదాక
సుక్కురారం అంగడి జూసే...
వామ్మో..రిలయన్స్ తోడేల్లు
హెరిటేజి గద్దలు గిట్ల
మా జాగల వాలదిక్క...!





# నాగపురి శ్రీనివాసులు

## అగ్గిరవ్వలు ఆరుట్ల దంపతులు

ఏళ్ళ తరబడి పేరు కొన్నది ఎన్నొ ప్రాణుల బలిని గొన్నది
అసంతృప్తి అసహనమ్ములు అసమ్మతిగా రగులు కొన్నది
ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యము బ్రతికి చచ్చిన రీతినుండె
బానిసత్వము వెట్టి చాకిరి ప్రబలమై ప్రజ రగిలి గుండె
కరుడు గట్టిన భూస్వామ్య దోపిడిని పెకిలించ బూని
కమ్యునిష్టులు ఏక సూత్రత కంచుకోటను గట్టుకోని
జాగీర్దారీ జమీందారుల జాతినంతము జేయనెంచి
సాగెనీ తెలంగాణా సాయుధ సమరమై సంకెళ్ళుతెంచి
భూమికోసం భుక్తికోసం తెలంగాణా విముక్తికోసం
గ్రామ జాగీర్దార్ నవాబుల గర్వమడచి ప్రజలకోసం
అణచివేతను అధిగమించగ ఆయుధాలు అవసరమ్మని
ఘనముగా చైతన్య పరిచి జనము సంఘము వెంట రమ్మని
భుక్తి, స్వేచ్ఛలేని జనులను ముందు నడుపగ బానిసలను
వ్యక్తి గాదు గుంపు గట్టిన శక్తిమయి సమరాన దూకెను
జాతి చరితకు నిలువుటద్దం సాయుధోద్యమ ప్రజాయుద్ధం
ఖ్యాతి గన్నది నల్లగొండ ఘన చరిత్రము సుప్రసిద్ధం
అలనిజాము నిరంకుశత్వము అగ్నిగోళము మండుచుండగ

అర్పగా అరుట్ల దంపతు లండదండై నిలిచి యుండగ
వీర పురుషుల త్యాగఫలము విప్లవాలకు స్మృతి పథమ్ము
పోరొనర్చిన అరుణ తేజము వీరనారీ మణులు సర్వము
ఆరుట్ల రామచంద్రారెడ్డి బిడ్డయి అవతరించె
చేరి సాయుధ విప్లవానికి జెండకర్రయి ముందు నిలిచె
ప్రజా ఉద్యమ స్ఫూర్తి దాత నిజాం రాజుకు గుండెకోత
ప్రజల క్షేమమె తన సుఖమ్మని నిజమెతింగిన మేటి నేత
బాన్చెన్ దొర ! కాల్మోక్తా అన్న ప్రజలకు ధైర్యమిచ్చి
బందూకులు చేతికిచ్చి ప్రజారాజ్యము మాకు దెచ్చి
తిరుగుబాటును జేయ నేర్పిన ధీరవరుడు త్యాగమూర్తి
చరమగీతం పాడి దొరలకు సాగిన చైతన్యస్ఫూర్తి
నాడు విస్నూర్ దొరకు ఎదురుగ నడిచి వెట్టిచాకిరీలను
వీడి పోవగ జేయకున్న నేడు ఈ సుఖ మెటులగలుగును
అందమౌ ఆలేరు ప్రాంతము అగ్ని పుష్పము ఉద్భవించెను
ఆమెయే అరుట్ల కమలాదేవియై కన్నీరు తుడిచెను
మగువయే ఆరుట్ల కమల ఎగిసిపడ్డ రుధిరజ్వాల
మగని అడుగు జాడలో పయనించి ఎదిగిన వీర మహిళ
వంటశాల పేరుతోటి వయోజన విద్యా కేంద్రం
కీర్తి శిఖరాలధిగమించె క్రియా శీలక ప్రస్థానం
కమల సైనిక శిక్షణంబున ఘనత చెందిన గెరిల్లాగా
మార్షల్‌లా విధించగనే మమత సమతలన్ని విడిచి
పురిటిబిడ్డను వదిలి పెట్టి అరిగనే రహస్య మరసి
కొలనుపాకలో పుట్టి పెరిగిన గొప్ప ఆశయమెదలో గలిగిన
రాష్ట్ర శాసన సభలో ఉభయుల రాణకెక్కిరి వెలుగు వెలిగి
వెట్టి నిర్మూలనముజేసి పెట్టిరి గ్రంథాలయమ్ములు

గట్టిగా బాలికల చదువుకు పట్టుబట్టిన సంస్కర్తలు
నిరుపమానం నిత్య సత్యం నింగి నేలకు సాక్షిభూతం
అరుణ కిరణం వారి సమరం అమరమది అజరామరమ్ము
విప్లవాలకు పుట్టినిల్లగు వీరభూమికి వందనం
విప్లవించిన అమరులకు నా విప్లవాభివందనం॥

(ఆరుట్ల దంపతుల స్మృతి కవిత 'అగ్ని పుష్పాలు' నుంచి)





# నిఖిలేశ్వర్

## జ్ఞాపకాల కొండ

జ్ఞాపకాల కొండను
కదిలిస్తే ఇపుడది
చెట్టులానే జలజలా
ఆకులు పూలు రాల్చి
రాయికి కూడా నెనరుందని
రహస్య స్థావరాలను
నిర్భయంగా చూపి
జలదరించే జీవితం!
ఆ గుట్ట గుండెలో దాగిన
ఎన్నెన్ని చిన్ననాటి తీపి గుర్తులు
ఇపుడు–
ఎండిపోతున్న చెరువు పక్క
మట్టిలో ఇంకిన
ఈత కల్లు మత్తు దిగిపోగానే
యాదికొస్తున్న
రాగీర్ రైల్వేస్టేషన్!
దూరంగా పిలిచే
తెలుపు జాజు వైష్ణవ
నామాలతో మెరిసే కొండ!
యాదగిరి లక్ష్మీ నర్సింహస్వామి
సాక్షిగా
ఉగ్రనర్సిహ్ముడు మా తాత,
గుట్టనెక్కినప్పుడల్లా

దూరంగా కనబడే
భోనగిరి ఖిల్లా చూపించేవాడు,
ఇదే భూమ్మీద చిందిన
రక్తంలో తరతరాల
బతుకు గోసను వినిపించి
ఎరుపెక్కిన నలగొండను
తడిమేవాడు...!
'యాదగిరి'కి మొక్కులు
చెల్లించి....చెల్లించి
తరతరాల రైతన్నల కష్టం
మోటబావుల్లో
మోటలతోసహా కూలిపోయింది
కరువు కాటకాల నడుస్తున్న చరిత్ర
కొత్త దొరలు-
నయా సంపన్నుల పంచన
కంకరదేలిన దారుల్లో
యాదికొస్తున్న పచ్చదనం
మా తాత భుజాల మీద
తడితనంలో మునిగితేలి
ఊరి దాకా ఊరేగిన నా బాల్యం
ఇపుడేమో-
ఈ పట్నం సిమెంట్ కంకర
యంత్రంలో నా మిగిలిన
బొక్కలను కాపాడుకుంటూ...
ఈ జ్ఞాపకాల చిత్తడి నేల
దేవాలయ ప్రాంగణంలో
పాకుడు బట్టిన గుండం,
అర్ధరాత్రి పూట రివ్వున
వీస్తున్న కొండగాలికి
జీవన ప్రవంతిలా పారుతున్న
మధురానుభూతుల జల!!



- 2001



# నూటెంకి రవీంద్ర

## కుంతల

వెండి మబ్బులు కుండపోతగ
కొండల మీంచి దూకుతోందా
నిండు జాబిలి మల్లెదండగ
అవని గుండెల ఆడుతోందా
ఏ దేవ కన్నియ జలతారు చెంగో
దివి నుండి భువికి జాలువారిందా
ఏ ఋషి పుంగవుని తపః ఫలమో
నింగిగంగై పొంగులెత్తిందా
ఏ పూరాకవి భావ వీచికో
జలగీతమై తీగ సాగిందా
ఏ గంధర్వుని అమర గానమో
మధుర వాహినై వసుధను మీటిందా
ఏ యక్ష కిన్నెర చరణ కింకణ మంజుల స్వనమో
పయోఝురులై చిందులేస్తోందా

కుంతలా!
జల శాకుంతలా!
ఏ దిగంతాల నుంచో
చెంగున నువ్వు దూకుతోంది
అగాధ లోయల్లో కా
నేరుగా నా గుండె లోతుల్లో కా

ద్రవీభవించిన పాలపుంతవో
నువు ప్రవహించినంత మేరా
ఒక ఆకుపచ్చని సంస్కృతి పరివ్యాప్తమవుతుంది

నీ మందగమనం నయన మనోహరం
నీ ఉగ్ర తాండవం భయద సౌందర్యం
ఔనూ
నీ చెంతనే పుట్టిందట కదా ఆ శకుంతల
నీ సమీపానే కొలువున్నాడెందుకో
సోమేశుడా చిన్ని గుహల
అరరె... భావుకత మైకంలో పడి
వాస్తవ లోకాన్ని మరుస్తున్నట్టున్నానే
కొంపదీసి నువుగాని
కష్ట జీవుల నుదుటి రాతల చెమటు చుక్కవు కాదుగా
కడుపు మండిన బడుగు జీవుల కన్నీటి ధారవు కాదుకదా!
నువు ఎవరివైతేనేం
నీ ఆకర్షణ ఒక ఉన్మత్త వల
ఆదమరిచామా అంతే- మృత్యు ఖేల

కుంతలా
నువ్విపుడు పర్యాటక ప్రాంతానివే కాదు
ఒక పోరాట కేంద్రానివి
జరుగుతున్న జీవన విధ్వంసంపై
తిరుగబడుతున్న ఉద్యమ కెరటానివి
నీ తరంగహేల విద్యున్మాల

(కుంతల - ఆదిలాబాద్ జిల్లాలో అద్భుత జలపాతం. అక్కడ జల విద్యుత్ కేంద్రం నెలకొల్పాలని ప్రభుత్వం ప్రతిపాదించింది. దీన్ని వ్యతిరేకిస్తూ ప్రజా ఉద్యమం పురుడు పోసుకుంది)






# నెల్లుట్ల రమాదేవి

## కొత్త కాంతి ఎప్పుడో..

మా అమ్మకు మేమిద్దరం కవల పిల్లలం
తొమ్మిదేళ్ళ కాపురంలో తొలకరి జల్లులం
ముమ్మూర్తులా మాది ఒకటే రూపు
అమ్మకెందుకో తమ్ముడిపై ప్రత్యేక చూపు

పాల కోసం గుక్క పట్టి ఏడ్చేది నేను
పరుగెత్తిన తల్లి వాడికే పాలు పట్టేను
ఆకలేసి అరిచి గోల పెట్టేది నేను
కడుపు నిండా తిండి వాడికి దొరికేను

మా ఇద్దరిదీ ఒకటే రూపం
అమ్మేమో పోల్చుకోలేదు పాపం
తమ్ముడు అవకాశవాది
నాది ఆవేశపు దారి

ఆకతాయి మాటలూ
అల్లరి చేష్టలూ వాడివి
వీపు దెబ్బలూ
వెక్కిళ్ళూ నావి
కుక్షి నిండిన ఆయాసం వాడిది
కడుపు ఎండిన ఆక్రోశం నాది

నాది బక్క చిక్కిన దేహం
వాడిది వళ్ళు బలసిన రూపం
వస్తారందరు బంధువులూ స్నేహితులూ
వాడికే అందుతాయి ముద్దులూ, మురిపాలూ
నా ఆందోళన అర్థం లేనిదట
వాడి ఆనందం అందరిదీనట

సహించి భరించి నా సర్వాంగాలూ
సహకరించడం మానేశాయి
అజ్ఞలు పాలించీ సేవించి అలసిన
నా దేహభాగాలు అదుపు తప్పనారంభించాయి.

మునుల తాపాగ్ని జ్వాలలు
ముల్లోకాలనూ దహించినట్లు
నా నిరసన నిప్పురవ్వలు
నలు దిక్కులకూ వ్యాపించాయి

అమ్మకు వినిపించాను నా హృదయఘోష
ఆమైనా అర్థం చేసుకుంటుందనే ఆశ
ఆమెదొక విచిత్రమైన భాష
అసలెప్పుడూ లేదు నాపై ధ్యాస

కాస్సేపు కవలలు కదా కలిసే ఎప్పుడూ ఉండాలంటుంది
మరో క్షణం మరే, ఆలోచిస్తానంటుంది
కాలక్షేపం కబుర్లు పంపుతుంది
చిగురుటాశలు తొడిగే వేళ వాటిని తెంచుతుంది

ఆ 'చిదంబర' రహస్యం
నాకెంతకూ అంతుబట్టని అగాధం
ఏ హానీ చేయొద్దనే కహానీలు నాకు చెప్పి
సోచ్‌నా– సోజానా అంటూ నిద్రపుచ్చే

నిరవధిక ప్రయత్నం చేస్తుంది
బంధువులూ స్నేహితులూ
భాయీ భాయీ ఒకటేనోయీ
అని అనునయింప జూస్తారు
వర్ధిల్లిన వంశదీప్తినీ
గతకాలపు ఘనకీర్తినీ
పదేపదే జ్ఞాపికి తెస్తుంటారు
ఎవరికీ పట్టని నా గుండెఘోష
అందరికీ చేరేలోగా ఆగుతుందేమో ఈ శ్వాస

ఈ సందిగ్ధ సమయం దాటేదెన్నడో?
ఈ గడ్డమీద పొద్దుపొడిచి
కొత్తకాంతి వచ్చేదెపుడో!!





# పత్తిపాక మోహన్

## తెగిన పోగు

రంగురంగుల ఇంద్రధనుస్సు
చినిగి పీలికలు పీలికలైంది
నేతపూర్తికాక ముందే
'జోటకూనుండి' 'కచ్చ' పడింది...
అగ్గిపెట్టెలో సుతారంగా
ఒదిగిన చీర
విషాద కఫనై
బూమిని కప్పేసింది....
కాలంతో పోటీపడుతూ
అరిగిపోతూ కరిగిపోతూ
ఎంత నేసినా
బతుక్కు రెండువైపులా
చీకటి కంచెలే తప్ప
తళుక్కుమని ఏ జరీపోగు  మెరవదు
ఏ వంకాయపూల రంగూ విరియదు
నేసి నేసి రాలిపోయేంతవరకు
ఆకలితో అలమటించాల్సిందే
నేస్తూ నేస్తూ కూలిపోయేవరకు
మలమల మాడిపోవాల్సిందే
అగాధాల అంచుల డిజైన్ల మధ్య
అలల నక్కీల చమ్కీల మధ్య

మెరుపుల్ని చూసుకుని మురవాల్సిందే...
ఒక్క చేతి కదలికతో
లక్షల చుక్కల్ని పూయించి
ఆకాశాన్ని నేసినవాడికి
అడుగడుగునా చిక్కుపడ్డ ఎదురు పోగులే...
జీవితాన్ని మూలధనంగా పెట్టి
ఊపిరిని కండెనగా మార్చి
సాలెగూళ్ళు ఎన్ని అల్లినా
ఏ ఒక్కటి సేదతీర్చకపోగా
ఉచ్చులై బిగుసుకుంటున్నాయి
గుడ్డికొంగేలె దీపంబెట్టుకుని
ఇంటిల్లిపాదీ ఆచ్చులతికి
పోగులతికి గంజిపెట్టి
'జోట లేసి 'పూటీలుగొట్టి'
నేసి నేసి కూలబడితే
జానెడు కడుపుకు
మూరెడు బతుక్కు గంజినీళ్ళు కరువైనా
పంచరంగుల 'పట్టుదారం'లా
సన్నని 'కేతిరి' తెగని పోగులా
సహసంతోనే ఉండాలి
కోతపెడుతున్న సబ్సిడీలు
మూతపడుతున్న కార్ఖానాలు
తూకానికి అమ్ముడైపోతున్న 'సాంచా'లు
రోజురోజుకు విస్తరిస్తున్న
కంప్యూటర్ వనాలు
పుస్తెలతాళ్ళను తెంపి
తమాషా చూస్తున్నాయి...
చేసే చేతులకు పనిలేదు
నడిచే పాదాలకు దారిలేదు
తాడు పామై కరిచింది
బతుకునేర్పిన మొగ్గమే

మరణమై భయపెడుతోంది
పూవుని దారంగా వడికి
దారాన్ని రంగుల రాగాన్నిచేసి
ఏ చీరకు ఏఏ పూవుల్ని పూయించాలో
బట్ట గురించి బట్ట భవితవ్యం గురించి తెలుసు
తెలియందల్లా
ఎన్నటికీ తీరని పస్తు గురించి..
గుంకని పొద్దుగురించి..
నల్లగొండ.. నకిరేకల్.. దుబ్బాక
భువనగిరి..వరంగల్.. కొత్తపల్లి.. సిరిసిల్ల
ఆకలిచావుల వాంగ్మూలాన్ని నమోదు చేస్తాయి
ఇందిరానగర్..ముష్టిపెల్లి
తారకరామానగర్.. సుందరయ్యనగర్..
కార్మిక జన నివాసాలన్నీ
కన్నీటి తీరాలైన సముద్రాలు..
బతుకును బతకనీయకుండా
కూల్చేసిన రాజ్యానిది నేరం కానప్పుడు
వృత్తుల్ని కూల్చేసి చేతుల్ని విరిచేసి
బతుకుల్ని పరాయీకరించిన
వ్యవస్థది తప్పుకాన్నప్పుడు
ఇప్పుడు ఇక్కడ
మరణం కూడా మానవ హక్కే
మరణం కూడా ఓటు బ్యాంకే..





# పల్లేరు వీరస్వామి

## అమర ధామము పరకాల!

తరతరాల పీడనపై తిరుగుబాటు జెండా యెత్తి
ఉద్యమాల బాటనడిచి ఉరకలెత్తి పిడికిలెత్తి
దగాకోరు రజాకారు దౌష్ట్యంపై దండు గట్టి
మార్పే తీర్పని చెప్పగ
పెను సర్పము దర్పమణచ చలిచీమలు కదలినట్లు
ఉప్పొంగిన చలివాగై మరో జలియన్‌వాలాబాగైనది-పరకాల!

తల్లుల అవమానాలను పిల్లల ఆకలి బాధకు
వెట్టి చాకిరీ విముక్తికై ఎత్తిన పిడికిలి శక్తిగ
తిండిలేని బీదచిక్కి దండిగానె కదంతొక్కి
వొడిసెల రాళ్లెత్తిపట్టి పలుగు పార చేతబట్టి
చిరకాలపు పెత్తనాల చరమాంకము లిఖియించగ
దోపిడీల దొరగడీల గడగడలాడించ కదలి
నరకాలను నరకాలని పరువెత్తిన పరకాల!

నీ బాంచెన్ కాల్మొక్తని నిద్రాహారాలు మాని
మేనాలకు భుజాలిచ్చి, సవారి బండ్ల ముందునురికి
సొమ్మసిల్లి సొయితప్పితె చెర్నాకోలతో కొట్టితె
అసహాయుల దౌర్భాగ్యుల ఆక్రందన అడవిలొ రొద
మానవత్వ మంటే... మచ్చుకైన లేకపోతే
పోరుసల్పిన తెలగాణకు నమూనయె పరకాల!

శాంతి క్రాంతి సహజీవన సందేశపుటావేశం
ఎర్రెర్రని జెండాలై ఎలుగెత్తిన కంఠాలై
ఊళ్ళకు ఊళ్ళన్ని వచ్చి ఊరేగింపులు జేస్తే
రజాకార్లు తాబేదార్లు రక్తపు కాల్వలు పారగ
చెట్టుకు కట్టేసి జనుల మట్టుబెట్టు దుష్టులున్న
చరితలా చిరకాలమున్న అమరధామము పరకాల!





# పసునూరి రవీందర్

## బియ్యం గాబుల బిగపట్టిన ఏడుపు

అడుగు సుట్టూ కుదిచ్చిన ఇసుక
కలలసౌధమైన పిట్టగూడు - బాల్యం
కట్టినంతసేపైన లేని వైనం
మనాదిని బహుమానంగా ఇచ్చింది
దువ్వెనెనుక లోకం మరిచిన నడక
మడికట్లబాట మీద ఇరుసిరిగిన ఎడ్లబండైంది

కాలం నిద్రపోనియ్యది
ఎన్ని ఎదురెండపొడలు
ఎనగర్ర కష్టం పొక్కిలైన మా గుడిసెకే ఎరుక
ఎండవానలకు ఎండితడిసినతనం
అంచులు పగిలిన పల్లెం ముఖం మీద
బుక్కెడు మెతుకుల ఆరాటం ఎన్నెలై నవ్వింది
కన్నీళ్ళతో తడిసిన మెత్తల జ్ఞాపకం

గాలి ఊదరబెడుతుంటె
చిల్లులు పడ్డ గుడెసెసందుల్లోంచి
రాలే చినుకు సరాసరి మా తలలమీదే
తనువు దాచుకోను గూడులేని కాకుల తండ్లాట
బియ్యంగాబుల బిగపట్టిన ఏడుపు
పొద్దుపొడిసేదాకా ఒంటిస్తంభం కొలుపు

ధారలు కట్టిన కన్నీళ్ళ మడుగు
గలుమ దాటిన వరదను
బొచ్చెలతో ఎదురొడ్డిన సోపతి
ఇసిరికొట్టిన గాలికి ఎగిసిపడ్డ తాటికమ్మల గలగల
వరిగడ్డి తడిసి ఊర్సిన ఇల్లు ఆ పూటకు మా ఊరిచెరువు

ముఖం నిండా కప్పుకున్న చిరుగుల దుప్పటే
పుట్టెడు దుఃఖానికి గవాయి
రాలిన మట్టిపెడ్డలల్ల కన్నీళ్ళ సెమటసుక్కల వాసన
కండ్లుతెరవని మొక్క మీద బాధలపూత్రవుతు

కొసదాకా కొట్లాటే!
ఒడువని తండ్లాటతో నిత్యయుద్ధమే
పొయ్యంటుకోదు.. పేగులమంట ఆరది
రోట్లేసి దంచినట్టు పూటకోసారి ఈనేల మీద మరణం మందలింపు
సూరు మీదినుంచి బొట్లుబొట్లుగా జీవితపాఠాలు
వెలుగు రావాలంటే గొరుకొయ్యలై పొడవాలె...





# పల్లె సీను

## కాకతీయ శిల్పం- తెలంగాణ పల్లెలు

ఖండ ఖండాంతరాల సిరులుకొన్ని
దొరలుకొన్నవి నా తెలంగాణ నేలయందు

కాడి కదలాడ కరావళి సేద్యమాడె
రైతు కోరిస పంటతో - కోర్కెలీడేరె
కోకిల కంఠాన జార్చు - రవముబోలు
నిరుపమానోక్తులను బాడు నీ పల్లె చెలులు

పాడి పశువులు- పచ్చని బీడులందు
పరిమళించెడి పసరికల- మేయుచుండు
భావిగురుతుల 'పుణ్యపు- పుట్ట" యనంగ
పావనమై యలరారు- నా తెలంగాణము

ఉరగ తతివోలే - పారు సెలయేళ్ళు కొన్ని
ఉదర పోషణార్థమై అడలు జీవకోటికి
ఉదకమందదనేమొ- పరుగు తీసి
పంట పొలముల దూరి- పరవశించు

ఏ కొండ జూసినా - ఏ కోనజేరినా
ఎలుగెత్తి పిలుచు - సవ్వడిన్ దోచు
విశ్వయనికపై - కదలాడు "వీరచిత్రాలు"
కొన్ని ఎదదూరు మరికొన్ని సరసమాడు

"కోట గుళ్ళ"ను పేర - కటాక్ష పురమునందు
మరుగుపడి యుండె- ప్రాచీన దేవళమ్ము
మేలుకొని పిలిచి దీనతన్ చేయిసాచి
యాత్రికా! రమ్ము- ఏకాంత వాసమంత
నాకేల? కొంత బంచు కోలేవయనుబిలుచు

కాకతి కల్పవక్షంబుగా - ప్రభవమంది
జనరంజకుడై గణపతి దేవ విభుడు
ఈ రాతి నిర్మాణ మాత్మీయతన్ నిల్పి
శిల్పకళ బెంచె- అతిప్రేమ ఓరుగల్లు
కాకతి క్షేత్రమై నగరి- ఖ్యాతి గాంచె





# పప్పుల రాజిరెడ్డి

## తెలంగాణ ఎవుసం

అంతవరదాకా మండుటెండ సెగలే
హఠాత్తుగా తగ్గిన గాలి వేగం
మెలమెల్లగా తగ్గిన గాలి వేగం
మొగులు మెత్తవడినట్టుంది
రైతు మదిలో ఆశల మొలక మండె

ఎండినా పండినా బతుక్కు
ఎవుసం తప్ప ఏం మిగిలింది
లాభమో నష్టమో నడిపించాలె బతుకుబండి
ఎడ్లు కొనేది లేదు నాగలి కట్టేది లేదు
మొండి ధైర్యం - తడిసి మోపెడయిన పెట్టుబడికి
జడిసి బెదిరేది లేదు
అంతా పెత్తందారి ట్రాక్టరే చూసుకుంటది

ఎరువేసుడు, దున్నుడు, రొప్పుడు నాట్లేసుడు
కోసుడు తొక్కుడు మోసుడు అమ్ముడు
అంతా ట్రాక్టరే చూసుకుంటది
ఆఖర్న లెక్క సూస్తే సుక్కలు కన్పిస్తయ్
ఎవుసం ఇంద్ర జాలమయింది
ఎవుసం జూదమయింది

మరోపసలు మరోయత్నం
కొత్త బోరుకోసం ఉబలాటం
పాతాళం అంతుచూసినా సుక్క నీళ్ళు రావు
కడగండ ఆసామికి కండ్లకు రక్తమొస్తది
ఇంటిల్లిపాది గొల్లుమంటది
యంత్రాల ఎవుసమొచ్చి మొదటికే మోసమొచ్చింది

సాంప్రదాయ వ్యవసాయం సద్దు మణిగింది
అలుకుడు బోనం సర్వ్వగంప అయింది
ఎండిన వూడుగ కర్రకు పూసిన బంతిపూలు కన్నీళ్ళ పర్యంతమైనయ్
నూనెలద్దిన పలుగురాళ్ళ కుంకుమల ముందు మొలక కుప్పల మౌనం





# పయిలం సంతోష్

## ఓ రాస గుమ్మడి

ఓరాస గుమ్మడి కామ్రేడ్ కోటి దండాలే - ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి కోట్లాది తారల్లో తారవైనావా ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి విద్యాబుద్ధులల్ల ఆరితేరిండే ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి పెద్దపల్లిని వదిలి పేదోళ్ళజేరే ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి మల్లోజుల మల్లి తిరిగిరాడాయే ఓరాస గుమ్మడి ।ఓ రాస।

ఓరాస గుమ్మడి జగిత్యాల యాత్రలో జబ్బజరిసిండే ఓ రాసగుమ్మడి
ఓరాస గుమ్మడి అడివిలో మాయన్న అగ్గిమండే ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి దండకారణ్యంలో దండుగట్టిండే ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి మిద్నాపూర్‌లోన మెరుపయ్యిమెరిసే ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి లాల్‌గడ్‌లోన లావారాజేసే ఓరాస గుమ్మడి ఓ రాస।

ఓరాస గుమ్మడి మల్లోజు పేరింటి మమత వణికిందో ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి చిదంబరం కేమొ చెమటలెబట్టె ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి బెంగాల్ సర్కారు గుండెలదిరినయి ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి జనతన సర్కారును అణిచివేయ ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి గ్రీన్‌హంట్ పేర మిలిటిరినే దింపె ఓరాస గుమ్మడి

ఓరాస గుమ్మడి గద్దెనేలేదాడ రాబందుగద ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి కిషన్‌జీనిబట్ట కుట్రపన్నిందో ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి ఎట్లబడ్డడో అన్న యమునోల్ల కంట ఓరాస గుమ్మడి

ఓరాస గుమ్మడి ఒక్కడై మాయన్న చుట్టు పోలీసు ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి దమ్ములేని దొంగ బెంగాలు పోలీసు ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి మాటుగాసి నిన్ను కాటువేసిర్నే ఓరాస గుమ్మడి
ఓరాస గుమ్మడి తూటాలనెదిరించి తూర్పునపొడిసె ఓరాస గుమ్మడి

('పాటల ఊట' నుండి)





# పాకాల యశోదారెడ్డి

## ఆర్.బి.వి.ఆర్. కళాశాల రజతోత్సవం

హాళా సఖీ సుమిత్రా!
ఏమి పండుగమ్మ ఇది
ఎక్కడి సంబర మమ్మ ఇది
'కో' అంటే కోటి కుత్తుక లొక్కటై
కలువకన్నుల చలువ వెన్నెలలు
కురుస్తున్నాయి
సొగసూ షోకూ వొడుపూ వొయ్యారం
జంటగా – జత జతగా
కన్నూ కన్నూ – చేయీ చేయి కల్పుతూ
పచ్చతోరణాలు కడ్తున్నాయి
పకపక నవ్వులు పసందుగా
మరువం మల్లె కల్పి – దండలల్లుతున్నాయి
కుర్చీలూ బల్లలు– కులాసాగా
కబుర్లు చెబుకుంటున్నాయి
ఏం పబ్బమమ్మా?
ఎడ్డి తల్లీ! యశోదమ్మా!
కన్నుదెరిచి చూడమ్మా!
ముగుదల ముచ్చట ఇది
మగువల మనోరథం ఇది
పగటి దివిటీలు వెలిగే పండుగ ఇది
పదుగురి నోట్లో మెలిగే పబ్బం ఇది

అమ్మా సుజాత!
ఏమి పండుగ ఇది? ఎక్కడి వేడుకలు ఇవి?
తాళాలు - తప్పెట్లు బాకాలూ - భజంత్రీలు
స్పీకర్లూ - లౌడు స్పీకర్లు
అలూ మగల్లా
ఒక్క గొంతుకై పల్కుతున్నాయి
అల్లరంతా- అణకువను
కన్నుగీటి కవ్విస్తూ ఉంటే
కిక్కుకోసం - ఉప్పేసిన కోకాకోలా కప్పును
యౌవనం పరువం ఒకేసారి జంటగా
అనుతూ ఉంటే అర్థంకాని పెద్దరైతు
దీని భావమేమంటూ?
అర్ధాంగిని వెతుక్కుంటున్నాడు
అక్కా! నీ వెరుగువా? ఈ పండుగను
చెలులు దున్నిన నేల ఇది
మహిళలు రాల్చిన పంట ఇది
తట్టా - పారకాపూ - కరణం
మిర్రూ- పల్లం - పేదా- సాదా అంతా
ఏకంగా ఎత్తిన నివాళి ఇది
జాతి దాల్చిన జేగంట ఇది
ఓ తల్లీ! సుమతీ! - ఓ చెల్లీ సుభద్ర
ఏమి పండుగ ఇది? ఎవరి పబ్బం ఇది?
ఎక్కడి చోటు ఇది?- ఏమి బాట ఇది
ఎరుగవటే? యశోదమ్మ
వేంకట రామారెడ్డి వేసిన బాట ఇది
మాటపాటి మలచిన త్రోవ ఇది
రంగారెడ్డి కట్టిన గూడు ఇది
పెద్దలు వెలిగించిన దీపం ఇది
కొమ్మా రెమ్మా కలిసి
పూచిన పూపందిరి ఇది

అక్కా! సావిత్రి– ఏం నెలవమ్మా! ఇది?
పేరేది? పెంపేది? చెల్లెలా! యశోద!
వినవమ్మా! చెవుల విందుగా
వెలుగుల పందిరి ఇది
వెన్నెల చాందినీ ఇది
చదువుల సత్రం ఇది
పరుగల పందెం ఇది
విందుల దొంతర ఇది
వినోదాల పల్లకి ఇది
ఎక్కుతావా? ఎక్కే కూర్చున్నావా?
ఏమే భారతి? ఎవరీ కొమ్మలూ?
సుతారాల బొమ్మలు!
తేరుల తీర్చిన కురాటి కుండలా?
బారులు పేర్చిన కాముని కడవలా.
తీపులొలికే తియ్యని పలుకులా?
పేరులు దాల్చిన పసుపు కుంకుమలా?
వదినా! వొయ్యారి బొమ్మా!
నెరజాణవే! సిరి బోణివే
చదువుల టెంకివే! సరసాల పెంకివే
తెలియవా నీవు – చెప్పవలెనా? నేను
ఎవరు? వీరు పసరు విప్పిన మొగ్గలో?
కసరు తప్పిన కాయలో? పూచిన తంగెళ్లో?
పురి విచ్చిన నెమిళ్లో పరచిన పుప్పళ్లో?
పలికే పుత్తళ్లో? చిలికే పుత్తళ్లో?
చిలికే తేనెల్లో?
ఇంకేమని చెప్పను? ఎవరిని పలుకను?
వినవమ్మా – ఇది
మా కళాశాల వెండి పండుగ
అల్లరి చిలుకా! అందాల గొలకా?
అయితే

మన తాతయ్య కన్న కలల పంట ఇది
మన ఇంట పాతిన మూల దొంతి ఇది
అతివలు ఎక్కిన నిచ్చెన ఇది
చదువులు తాపిన బచ్చెన ఇది
రమణులు రాణించే - రాజ్యం ఇది
వెలదికి మెలకువతెచ్చే వేగుచుక్క ఇది
తరాలు నిలిచే తూరాయి ఇది
పేరెన్నటికి చెరగని యశోదమ్మ వ్రాతలివి.

('భావిక' నుండి)





# పారిపెల్లి రవీందర్

## ఆజంజాహి మిల్లు

ఓరుగల్లు ప్రజల
బ్రతుకుదెరువై
బ్రతుకునిచ్చినది
ఆజంజాహి మిల్లు

లేబర్‌కాలనీ నుండి
కాజీపేట వరకే కాదు
కాజీపేట రైల్వేస్టేషన్‌కూ
కరెంటునిచ్చిందీ ఆజంజాహి మిల్లే

ఇండ్లల్లో గడియారం లేని రోజుల్లో
మిల్లు సైరనే నగరానికి గడియారం
దిన చర్యలకు దిక్సూచిలా
ప్రజలకు సమయపాలన నేర్పిందీ మిల్లు సైరనే

చలినుండీ ఎండ నుండీ
ప్రజలకు బట్టలనిచ్చి రక్షణ నివ్వడమేకాదు
బార్డరు సైనికులకు
బట్టలను సప్లై చేసిందీ ఆజంజాహి మిల్లే

పారిశ్రామికంగా...
తెలంగాణాకు గుండెకాయలా..
ప్రజల జీవితాల్లో
వెలుగులు నింపిందీ ఆజంతాహి మిల్లే

దస్‌తారీక్ వస్తే కార్మికులకు జీతాల్
ఏక్ నెంబర్...దొ నెంబర్.. రెండుగేట్లూ...
జాతరనూ సంతలనూ మరిపించేలా
సమస్త వినియోగ వస్తువుల వ్యాపారాలతో హోరెత్తేది

కార్మికులకు సకల సౌకర్యాలతో
విశాలమైన కాలనీ
ఎక్కడా కనిపించని అండర్ గ్రౌండ్ డ్రైనేజీతో
తెలంగాణాకే ఒక మెడల్ కాలనీ అజంజాహిమిల్స్ కాలనీ

ప్రజల ఆకలినీ
దప్పికనీ తీర్చి
భవిష్యత్తుకు భరొసానిచ్చి
నగర ప్రజలకు నాగరికత నేర్పిందీ ఆజంజాహి మిల్లే...

నదుల ఒడ్డున నగరాల్లా...
మిల్లు చుట్టూ నగరం
మిల్లూ నగరం విడదీయలేని నాణెం బొమ్మ బొరుసులా...
ప్రజలకు ప్రాణవాయువైంది ఆజంజాహిమిల్లు.

ప్రజలకు ప్రాణప్రదమైన మిల్లు
పాలకుల రాజకీయ క్రీడలో బలిపశువై..
గ్లోబలైజేషన్ జిమ్మిక్కుల్లో...
వృధశిలయై కనుమరుగైంది

రాజకీయ నాయకులంతా
మాయల ఫకీరులామంత్ర దండాలు తిప్పి
ఉత్తరుని ప్రగల్భాలు పలికి
కార్మికులను మోసగించిన ఘనాపాటిలే





# పి. లక్ష్మీనారాయణ

## ఫ్లోరైడ్ టెర్రర్

నాడు
పోరు నగారా మోగిందిక్కడ
గుండెల ఖిల్లా నల్లగొండ జిల్లా
ఛాతీపై నెత్తుటి చరిత్ర రాసుకొని
కత్తులకు కాల్పులకు ఎదురొడ్డి నిలిచింది
త్యాగాలను పురుడుపోసుకున్న పౌరుష సీమ
శిథిలమైన ఆకారాలు కదలిపోయె శకలాలు
ఊపిరాడే శవాలు
ఫ్లోరైడ్ గరళాన్ని తాగే సాహస జీవులు సామాన్యులు
వంకర్లు తిరిగి వికలమైన ఎముకల గూళ్ళు
ఇరువైలో అరవై ఏళ్ళు పండిన పసివాళ్ళు
మరుగుజ్జులు మనుషుల నీడలు
వీళ్ళంతా నీలగిరి వాసులు
నాలుకలేని మూగలు
దోసెడు మంచినీళ్ళకు
కడివెడు కన్నీళ్ళు
తల్లిదండ్రుల తీరని వ్యథ
కనికరించి కనువిప్పి చూడని కృష్ణమ్మ కదలిపోతుంది
హృదయం లేని గోదావరి దూరం నుంచే పరుగుతీస్తుంది
వలసలతో వాలిపోయి కరువు కాటకాలతో కూలిపోయి

కాలకూట విషం తాగి విలవిలలాడుతుంది
వివక్షకు నిర్లక్ష్యానికి నిలువెత్తు సాక్ష్యం నల్లగొండ
ఈ ఘోరం ఈ క్రౌర్యం మారిపోవాలి
ఈ మట్టిలో నవజీవన వికాసం జరగాలి
వెచ్చదనం పచ్చదనం ఒకటై విరబూసి వికసించాలి





# పి. యాదగిరి

## నల్లగొండ !

తెలంగాణ జిల్లాలల్ల నల్లగొండ జిల్లా
నిజామోడి గుండెల్లో నిదురించిన ఖిల్లా
వడిసెలతో బరిసెలతో గడగడలాడించిన జిల్లా
అమరుల నెత్తుటితో ఉద్యమ సేద్యం చేసిన జిల్లా

తడియారిన ఎడారై తల్లడిల్లుతున్నది
నీళ్లలేక బీళ్లన్ని నోళ్ళు తెరిచి యున్నవి
రాలిన కన్నీళ్ళతో గొంతు తడుపుకుంటున్నరు
పనులులేక జనమంతా వలసలు పోతున్నరు ॥తెలంగాణ॥

దూడోలిగె దుంకేపోరలు ఫ్లోరైడుకు బలియగుతుంద్రు
వంటిన ఆ నడుముల తోటి– వడిదిరిగిన కాల్రెక్కలతోటి
గడ్డాలొచ్చిన బిడ్డలు కూడా అడ్డపాపలై కన్నోల్లకే భారమవుతున్నరు
ఎవడిదో మోసం ఎవడి మోసమో (ఎవడి పాపమో) నల్లగొండకే శాపమైన్నది
॥తెలంగాణ॥

కడుపులపెరిగె పిండానిక్కూడా ఫ్లోరైడ్ ఒక గండమైనది
అమృతమసొంటి తల్లిపాలలో ఫ్లోరైడు విషమే దాగియున్నదట
నల్లగొండలో పుట్టిన బిడ్డలు నడమంత్రపురాతలు రాసుకొచ్చిరి
నల్లగొండలో ప్రజానీకము (ఏదేవుడు కూడా) దిక్కులేని పచ్చులయ్యిరి ॥తెలంగాణ॥
పోరు ఒక్కటే మార్గమైనది– వేరుపడుటనే జరూరైనది
మడమలు వెనుకకు తిరుగనన్నవి– పిడికిలి పట్టు విడువనన్నది
జనంగానము పాడుతున్నరు – తెలంగాణమే ఖాయమన్నరు ॥తెలంగాణ॥





# పొట్లపల్లి శ్రీనివాసరావు

## వేయి స్తంభాల ఒడి.. చరిత్రకు బడి

ఉలి మొనకు శిరసెత్తిన శిల్పం
శిల్పి స్పర్శకు పులకించిన నాట్యం
బండరాళ్లలోనూ నిండిన మెండైన జీవార్ణవం
ప్రాణమున్న పరికిణిలా సిగ్గుల మొగ్గైన శిలారావం

సకల దేవతలు కొలువు దీరిన
అద్భుత పనితనపు మట్టి పరిమళాల నజరానా
గండశిలను వంచి సాన పట్టి
నునుపుగా నలుగు పెట్టిన చెమట చుక్కల సృజనధార

దక్షిణా పథమంతా ఏలిన త్రిలింగాధీశుడి కాలంలో
వెలసిన శిలాతోరణ వేయిస్తంభాల మంటపమ్మిది
శివకేశవులొక్కటేయని ప్రజల ముంగిట
దివ్వెలు వెలిగించి హారతిచ్చిన త్రికూటాలయమ్మిది

సంగీత సాహిత్య నృత్య కళారీతులతో
ప్రతీకాత్మక కథనాలు చెక్కిన శిల్పకళావేదిక ఇది
వేయేండ్ల క్రిందటే వేయిముఖాల విస్తరించిన
కాకతీయుల పాలనకు సజీవ దృశ్యకావ్యమిది

ఎందరికో పసిడి పులిమిని వితరణశీలి
రుద్రదేవుడి జన బాహుళ్యపు కీర్తిహోరు ముందు
విష్ణువు కొక్కడికే లక్ష్మినిచ్చి ఘోషిస్తున్న
సముద్రుడికి ఇక్కడెప్పుడూ గర్వభంగమే

భాషకందని, ఊహకందని అపురూప వస్త్రాలంకరణ దృశ్యాలూ
చిత్రకళా విన్యాసాలూ
చూపరుల కింపై అబ్బురపరిచే
లతలూ పద్మాలూ ధ్వజస్తంభ మకరతోరణాలూ
సుల్తానుల దాడులను భయానక భీభత్సాలను ప్రకృతి వైపరీత్యాలను
ఎదురొడ్డి నిలచిన వేయిస్తంభాల గుడి- నాగరీకతకు నగిషీ

ఆకలి దప్పులు బాపిన పరిశుద్ధ పుష్కరిణి
దిగుడు బావిలో అభిషేకపు జలనిధి
గర్భాలయంలో ప్రవహించే గాలి వెలుతుర్ల సంగమం
మండు వేసవిలోను మంచు ముత్యాల కాంతిపుంజం

వెర్రితలల అధునికతకు అందని ఎత్తైన శిఖరం
పోరుగల్లుగా వినుతికెక్కిన ఓరుగల్లు కీర్తి మకుటం
చతుష్షష్ఠి కళల రాశుల కాణాచి రుద్రేశ్వరాలయం
లోతైన గాఢతతో అందర్నీ ఆదరించే విశాల హృదయం

రామాయణం కల్పితమే కావచ్చు
అక్కడి సహస్రస్తంభాలూ ఊహాజనితమే కావచ్చు
కంటి ముందర కన్పించే వేయిస్తంభాల మంటపం-
కరువుదీర ముచ్చటించే పురాస్మృతుల తేజోవైభవం
జీవం ఉట్టిపడే కాకతీయ నంది - కాకతీయుల శిల్పశైలికి పతాక
ఇది మనదైన వారసత్వ సంపద - ఇదీ మనదైన వైజ్ఞానిక ప్రతిభ

కాకతీయుల కళా వైభవం ఒక అక్షయ సుగంధం
శిలలు ద్రవించి పారి చిమ్మించిన సాంకేతిక నైపుణ్యం
తరతరాల ప్రపంచానికి బహుకరించిన కావ్య సౌందర్యం
వేయేండ్ల వేయిస్తంభాల ఒడి....ఒక అద్భుత చరిత్రకు బడి...





# ప్రతాప్ కౌటిళ్య

## రాలిపోతున్న తెలంగాణ గడ్డిపూలు

తెలంగాణ తల్లీ
తలమీదా
కాళ్ళ కిందా
విరబూసి
రాలిపోతున్నా
గడ్డి పూలకు
కీకారణ్యంలో
వేల సంవత్సరాలు – బ్రతికే
మహా వృక్షాలు సైతం
నమస్కరిస్తున్నావీ!?

శివుడిప్పుడు
తెలంగాణ – విభూతీనే
పూయిస్తున్నాడు–
స్మశానం విడిపోయింది!
తెలంగాణ మెడలోని
కాలసర్పం
వేల సర్పాల సైన్యమయ్యిందీ!!
యముడి – ఒడిలో
తెలంగాణ రాజు
ధర్మ రాజైనాడూ–

బ్రహ్మ బడిలో
తెలంగాణ– వీణ
స్వరస్వతి– చేతిలోకి చేరింది!!

ఆడ–మగా–లిప్పుడు
ఒక్క జీవసారమైనారు
తెలంగాణ పసి ప్రాణం కోసం

తెలంగాణ నది
ఈ గడ్డపై – కాకుంటే
సముద్రపు ఒడ్డుపై లేదా
నడగడ్డపై కూడా
ఆవిర్భవిస్తుంది

శాంతి– కపోతాలు
రక్తపాత రహిత రాజ్యాలు
భూతాలైతే
నః భూతో నః భవిష్యత్
భవిష్యత్తు
తెలంగాణాదే–!?





# బండ సరోజన

## నా ఊరు

మారుమూల నా ఊరు మనసైన నా ఊరు
చుట్టూరా చింతచెట్టు చూడముచ్చటైన ఊరు
ఎల్లంబావి నీళ్ళతోని ఎదనింపిన నా ఊరు
కళకళలాడుతు కనులకు విందుగూర్చు నా ఊరు

కాకతీయ రాజ్యానికి కదనరంగ వీరులకు
కాకలు తీరిన యోధన్యకవి పండిత గాయకులకు
వన్నెకెక్కివాసి పొందిన వరంగల్లు జిల్లాలో
ముద్దుగా ఖ్యాతినందిన 'లద్దునూరు' నా ఊరు

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపీ గరీయసీ'
అన్న ఆర్యోక్తి సూక్తి ఎన్న వరహాల మూట
చిన్ననాట నే పెరిగిన కన్న ఊరు నాకు మిన్న
ఉన్ననాట నే తిరిగిన 'హైదరాబాదు' కన్న

పెనవేసిన మమకారం ఆకారం నా ఊరు
కనువిచ్చిన విరిసిరుల కలబోత నా ఊరు
బొండుమల్లె వాసనలను నిండించిన నా ఊరు
'బండ'ల గుండెల్లో కవిత పండించిన నా ఊరు

నాటి జ్ఞాపకాలు మదిలో నాట్యం చేస్తున్నాయి
ఇసుకతెప్ప పిట్టగూళ్ళు కథలెన్నో చెపుతాయి
చిరుప్రాయపు నా అడుగుల చిత్రాలను వేస్తాయి
ప్రతి చెట్టు ప్రతి పుట్ట పరవశంతో పాడతాయి

చెరగని నా ఊరిముద్ర చిరకాలం 'రాజముద్ర'
తరగని నా ఊరి స్మృతులు కరిగిన కవిత
ఎరిగిన నా ఊరి తీరు కరుగని ఓ కమ్మని కల
ఒరిగిన నా ఊరి తరం తరతరాలకాదర్శం

('ఒక పూవు పూసింది' లోంచి)





# బత్తుల దేవన్న

## సింగరేణి రమాకాంత్

సింగరేణి శ్రామికుడా విప్లవాల వారసుడా
నల్ల బంగారం కోటపై పోరుజెండా ఎగిరేసి
యుద్ధభూమిలో వొరిగిపోయిన సైనికుడా
సమ్మన్నా! ఎర్రజెండా ఎరుపు నీవన్నా

కార్మికులకు కనుపాపగ సింగరేణి సిరుల గడ్డన
భూగర్భంలో వజ్రమయితివీ
ఉత్పత్తిలో చెమట చుక్కవయితివీ
బొగ్గుపూల తోటవయితివీ సమ్మన్న నీవు ॥సింగరేణి॥

దొంగ ట్రేడ్ యూనియన్ల బండమూతి మట్టుబెట్టి
రివిజనిస్టులకు బుద్ధి చెప్పితివీ
గుండాల మెడలు విరిచితివీ
గల్లి గల్లీ గస్తీ తిరిగితివీ సమ్మన్న నీవు ॥సింగరేణి॥

బాయి దొరల దోపిడీలను
అడుగడుగున ఎండగతివి
అక్క చెల్లెల్లను పీడించే దొరకొడుకుల
అంతుచూడక వొదలనంటివీ సమ్మన్న నీవు ॥సింగరేణి॥

'రమాకాంత్' పేరు వింటే బాయిదొరలు దడుసుకొనిరి
దుండగులు జంగంపెట్టయి ఉరికసాగిరి
గోదారమ్మను దాల్చుకుంటివీ నీవు
బందూకీ బెల్టు మువ్వవైతివి సమ్మన్న నీవు ॥సింగరేణి॥

కష్టజీవుల కూడగట్టి విప్లవాల ఎరుక జెప్పి
సమ్మెకే సమరాంగులను జేస్తివీ
ఉద్యమాలకు ఉరుకలెత్తిస్తివీ
తుపాకి తూటాలుగ నిగ్గుదేల్చితివీ సమ్మన్ననీవు ।సింగరేణి।





# భండారు విజయ

## సర్వాయి పాపన్న

బడుగు ప్రజల ఆరాధ్యుడా
ఓ సర్వాయి పాపన్న!
నీవు బహుజన చైతన్యానికి స్ఫూర్తివి
తెలంగాణ వీరోచిత పోరాటానివి
ఖిలాషాపూర్ ముద్దు బిడ్డవు
జమిందార్ల గుండెల్లో రైళ్ళు పరుగెత్తించిన వాడవు
గడీల్లో ఖైదీలను ఏకతాటిపై తెచ్చిన నాయకుడవు
ఏ రాజకీయ వారసత్వం లేకపోయినా
గోల్కొండ కోటను పాలించిన రారాజువు
సామాన్య గౌడ కుటుంబంలో పుట్టి
ఎవరి వృత్తి వారు స్వేచ్ఛగా చేసుకొనేందుకు
నిరంతరం పోరాడిన పాపన్నవు
తెలంగాణ ఛత్రపతివి!
అణగారిన జాతుల బానిసత్వాన్ని పారదోలినవాడివి
లండను మ్యూజియంలో చోటు సాధించినవాడివి
భూస్వాముల గుండెల్లో నిద్రించి
పీడిత జనుల రాజ్యాధికార జండాను పాతినవాడవు
క్రూర పాలకుల పన్నాగాలను త్రిప్పికొట్టి
సర్వాయి పాపన్నవై అధికారం చెలాయించిన వాడవు
తెలంగాణ ఎదలో చిరకాలం నిలిచిపోయిన పోరు బాటవు



# బి.నరసింగరావు

## రంగుల రాగాలు

తరముతూ వస్తున్న గాలికి
హొయలు పోయే పచ్చగడ్డి సమూహాలు
గాలిలో తేలివస్తున్నట్టున్న
రైతు కేక
పంచకేలనిండా పరుచుకున్న
జానపద గీతాల దొంతరలు

పైరా జవాన్లలా వెలిసిన
గుమ్మటాల గడ్డివాములు
కోకిల కూతను తలదన్నే
మోట గిరక చప్పుడు

చలికాలం ఉదయానికి ప్రాణం పోస్తున్న
లేలేత ఎండ

నల్లటి గొంగళ్ళ అలంకరణలతో
గొర్ల కాపర్లు

పసుల కాపర్లు తీసిన
పరుగుల అడుగుజాడలు
ఆకాశపు అందాలన్నింటినీ
వొంటి నిండా నింపుకొని

వొగురుస్తూ పరుగెత్తుతూ
ఆశాదీవుల వాకిట్లో బోర్లా పడిపోయాను

జీవితం కొసల గుండా
ఎటెటు కొట్టుకు పోలేదు
ఏ ఏ నగర వీధులలో
ఈల పాటలు పాడుతూ తిరగలేదు...

ఊర్లను, ఊరి పొలిమేరలను
మోచేతి బద్దతో కొలుస్తూ
కుప్పగా కూలిపోలేదు..

వాగులలో తేలుతూ
వరదలలో మునుగుతూ
సెలయేర్లలో పయనిస్తూ...

బాయిగడ్డలపై
వేపపుల్లలతో పళ్ళు తోముకుంటూ....

పశువుల కాపరి
అనుభవ గీతాన్నై
రైతువేసిన పోలికేక పిలుపునై
వేసవిపై
వెన్నెల వన్నెలు కురిసిన పువ్వునై

వడ్ల పిట్టపై
వర్షం బొట్టునై
వెలుగు చుక్కనై
చలినై
చాప బొంతనై
గొంగడి కొప్పెరనై
వేడినై
కాలి బేడినై

దండె కడియాన్నై
చెవి పోగునై
కరుకు చుట్టనై
ఆకునై
ఆకుసందు కాయనై
పండునై
పండుమొదలు కాడనై
చెట్టునై
చెట్టునీడ వేరునై
బండినై
బండిచక్రం చప్పుడునై
మొట గిరుకనై
గిరుక కాళి చప్పుడునై
తాడునై
తాడుని ఒరుస్తున్న చేతినై
పదం అందుకున్న నోటి
తమలపాకు వాసననై
గాలినై
పంట నోరుస్తూపోయే
చిరుగాలి చెలిమినై
అడివినై
అడివిలో కుందేటి ఉనికినై
బతుకు పెదబాలశిక్షలో
అక్షరాల ఆర్థినై
దగాపడ్డ గుండెలో
ఊసునై
బందీనై
భూమ్యాకాశాల నొక్కిటి చేసే
మెరుపునై
ఎన్నెన్ని వాకిళ్ళు తట్టాను!!!





# బిల్లా మహేందర్

## "పేగు బంధాలు"

ఎక్కడా వెతికినా
ఆనవాళ్ళు!
అంతా పరిచయాత్మక
సంభాషణలు!!

చెట్టు పుట్ట
చేను చెలక
ఏరు సెలయేరు
పక్షుల కిలకిలలు
కోయిల కుహకుహలు
ఆకుల గలగల సవ్వడులు
విడదీస్తే....
వీడిపోయే బంధాలా?

ఏళ్ళతరబడి
అడివితల్లి దేహంతో
అణువు అణువై
అల్లుకున్న పందిరై
పెనవేసుకుని చిగురించిన
జీవన సంబంధాలు!!

ఆకులో ఆకులై
పువ్వులో పువ్వులై
ప్రకృతిలో లీనమై
ప్రకృతే తామై
నేల తల్లిని అంటిపెట్టుకున్న
పేగుబంధాలు!!

పెనవేసుకున్న పేగు బంధాలను
తుంచేస్తూ
నేల తల్లి గర్భాన్ని చీల్చేస్తూ
ఆదివాసీ బిడ్డల్ని
అమ్మ ఒడినుండి
అమాంతంగా లాక్కుంటున్న
విష పన్నాగాల పులిజోన్ హెచ్చరికలు!!

చెదురుతున్న గూడేలు
మట్టివాసనకు దూరమై
ఛిద్రమైన బతుకులు!!

గాయంతో బరువెక్కిన
ఆదివాసి గుండెల ఆకలికేకలు
రేపటి పోరు గీతికలు!!





# బోయ జంగయ్య

## బాపురే

సాగర్ నిండా జలాలు
ఎండుతున్న ఎడమ కాలువ
పారుతున్న పల్నాడు సీమ
బాపురే కే.ఎల్.రావ్
బలే గీతలు గీశావు
రాజధానీ రచ్చబండా
డబ్బున్న వాళ్ళకే అండా
బూర్గుల, చెన్నా, పివీ.
పెదవి విప్పని పదవీ ధరులు
మౌనం పట్టిన మగధీరులు
హెచ్చుతగ్గులు పెరిగి
సోదర భావం తరిగి
పరాయితనంతో జనం
చీలిపోయిన వైనం
సమైక్యతంటే బెదురుతున్నం
కసిమీరినతనంకన్న
పోరు బాటే మేలన్నా
బాపురే బడా చోరులున్నరు
మేలుకోవాలన్న



('పంచనామా' లోంచి)



# మలయశ్రీ

## కోటి లింగాల...

మనది తెలుంగు గణం – తెలంగాణం
మన గత చరిత్ర ఘనం
పదహారు మహాజనపదాల అశ్మక రాజధాని బోధన్
పదవ శతాబ్ది పంపా మహాకవిది వేములవాడ
కాకతీయ చక్రవర్తులది ఓరుగల్లు
ఇక్ష్వాకు పాలకులది నాగార్జునకొండ
పద్మనాయక ప్రభువులది రాచకొండ – దేవరకొండ
కుతుబ్‌షాహీలది గోలకొండ... అయినా

కోటి కోటల విలువ మన కోటి లింగాలది
గోదావరి– మునేరుల నడిమి నేటి కోటి లింగాల గ్రామం
క్రీ.స్తు.పూర్వం మూడు నాలుగు శతాబ్దుల గొప్ప కోటనగరం
కరీంనగర్ జిల్లా కప్పారావుపేట రామపట్నంల మధ్య ఉందిది..

ఆంధ్రరాజులు నలుగురు పాలించిందీ నగరం నుంచే
ఆంధ్ర భృత్య శాతవాహనుల తొలి రాజధాని ఇదే
ఇటునుంచే కొండాపూర్, పైటాన్, పాట్నావారి బాట
ఇక క్రీ।శ। రెండవ శతాబ్దిది కదా ధరణి కోట మాట

ఈ కోటి లింగాల నాణాలు ఇండియాలోనే మొదటివి
ఈ నాణాల వెలుగాక్షరాలు అమరావతి నాగబు కంటే పాతవి

ఇక్కడ పురావస్తుశాఖ 1980, 2010ల్లో జరిపిన తవ్వకాల్లో
ఎన్నో ప్రాచీన వస్తువులు- నిర్మాణాల శిధిలాలు కనిపించినై

ఎంతో విలువైన ఈ చారిత్రక స్థలం
ఇప్పుడు ఎల్లంపల్లి ప్రాజెక్టులో మునిగిపోనుందట
అయ్యో! అని విచారిస్తే ఫలితం శూన్యం
అందరం కలిసి కాపాడుకుంటేనే ప్రయోజనం





# మఖ్దూం మొహియొద్దీన్

## తెలంగాణా

దయారే హింద్ కావ వొ రహ్‌బర్ తెలంగాణా
బనా రహోహై నయీ ఏక్ సెహర్ తెలంగాణా
బులా రహోహై బా సిమ్తే దగర్ తెలంగాణా
వొ ఇన్‌ఖలాబ్ కా పైగంబర్ తెలంగాణా

ఇమామే తిష్నా లబా ఖిజరే రాహే అబె హయాత్
అంధేరీ రాత్ కె సీనేమే మషలోంకి బారాత్
మేరా సబాత్ మేరీ కాయనాత్ మేరీ హయాత్
సలామే మెహ్‌రే బగావత్ సలామ్ మాహె నజాత్

సియాహె రాత్ జరాయమ్ పనాహ్ జుల్మ్ బదోష్
సియాహ్ రాత్ మే బద్‌కార్ మస్త్ ఔర్ మద్‌హోష్
సియాహ్ రాత్ మే మఖ్తూల్ అస్మతోం కా ఖరోష్
సియాహ్ రాత్ మే బాగీ అవామ్ బర్ఖ్ బదోష్

ఉఠే హై తేగ్ బకఫ్ యూ బసిద్ హజార్ జలాల్
వొ కోహ్ వొ దష్త్ కె ఫర్‌జంద్ ఖేతోం కె లాల్
చమక్ రహీహై దరాతీ ఉచల్ రహేహై కుదాల్
బనాయె ఖైసరే అమారాత్ షికిస్తా వో పామాల్

లరజ్ లరజ్ కె గిరే సఖాఫ్ వో బామే జర్దారీ
హై పాష్ పాష్ నిజామే హలాకూ వో జారీ

పడీహై ఫర్జే ముబారక్ పర్ జర్బాతేకారీ
హుజూర్ ఆసిపే సాబే పహె గషీతారీ

బదల్ రహీహై ఏ రంజ్ వొ అజాబ్ కి దునియా
ఉభర్ రహీహై నయే అఫ్‌తాబ్ కి దునియా
నయే అవామ్ నయీ ఆబో తాబ్ కి దునియా
వొ రంగ్ వొ నూర్ కి మహెఫిల్ షబాబ్ కి దునియా

సలామ్ సుర్ఖ్ షహీదొంకి సర్ జమీన్ సలామ్
సలామ అజ్మే బులంద్ అహ్నె యకీన్ సలామ్
ముజాహిదోంకి చమక్ తీ హుయీ జబీన్ సలామ్
దయారే హింద్ కీ మహెబూబ్ అర్జే చీన్ సలామ్





# మిత్ర

## జోహారు సదాశివకు

గరళ కంఠమైన స్వరలయలు పలుకాలి
సరళ భాషతో సదాశివను కొలువాలి
ఉత్తర దక్షిణ భారతి
చప్పట్టై కలువగా
ఆ కరతాళమే నవరసాల
రాగమొలికి పారగా
జోహారు సదాశివకు పదరాశుల మధురముకు
రుబాయి తెలుగు సేత పద్యాది గద్యములకు          గరళ

సంగీత సాహిత్య
సమ్మిళిత చరిత ఇంపు
తెలుగు ఉర్దు కవితా
తనివితీర వినసొంపు
రచన దృష్టి పలుకు వృష్టి
జీవిత గమనాల గోష్ఠి
జోహారు సదాశివకు సాహిత్య కళామేళకు
శిఖరాలనందుకున్న మరాఠి జానపదాలకు          గరళ॥

మనసునది 'యాది'లో
ఈదుకుంటు పోయినా
విమలనేత్ర సామలయే

సరిగమలై అందినా
తొలి సంతక నిరీక్షణం
కలెగల్సి చిత్ర లేఖనం
జోహారు సదాశివకు సాదాసీదా బతుకుకు
అల్విదాని చెప్పగలమా దక్కను దిక్సూచికి ।గరళ॥

తెలుగు కవుల ఆర్తి
తెలంగాణ ఘనకీర్తి
విశ్వమంత వెదజల్లె
భాషాంతర విల్లెత్తి
ధిక్కారమే స్వీకారము
దార్శనికత సారము
జోహారు సదాశివకు గగనాన వెలుగు తారకు
పయనిస్తు పయనించె అక్షరాల స్వరముకు





# ముదిగంటి సుజాతారెడ్డి

## చరిత్ర పుట్టింది ఇక్కడే!

ఇదే తెలంగాణం
సిరులెన్నిటికో మాగాణం!
శాతవాహనుల మూలస్థానం ఇదే!
ముప్పైరెండు కోటలు నిల్పిన
త్రిసముద్రాధీశ్వరులు వీరే!
ఆంధ్రనగరం ఓరుగల్లును
నిల్పి పాలించిన
కాకతీయులు ఇక్కడి వారే!
తెలుగులందర్నీ
ఒక్క చిత్రం కిందికి చేర్చిన
ఘన చరిత్ర వీరిదే!
తిక్కన సోమయాజి
రాజకీయ రాయబారిగా వచ్చి
మంత్రాంగం నడిపింది
ఈ ఆంధ్రుల రాజధానిలోనే!
వేయిస్తంభాల గుడి
ఇక్కడిదే!
త్రికూటాలయాలు సూర్యాలయాలు
వెలిసింది ఇక్కడనే!
ఆంధ్రుల శిల్పకళ
రూపం ధరించింది ఇక్కడనే!

విదర్భ రాజధాని కుండినపురం
విష్ణుకుండినుల కీసర
రాచకొండ దేవరకొండ
భువనగిరి గోలకొండ
ధర్మపురి వేములవాడలు
నగరాలు దుర్గాలు వెలిసిందిక్కడనే!
ఉర్దూ భాష రూపుదిద్దుకుంది
గజళ్ళు గానమైందిక్కడనే!
కుతుబ్‌షాహీ రాజుల దర్బారులోనే!
తెలుగును పోషించిన
రాజులు ఈ తురక వారే!
అచ్చ తెనుగు కావ్యాలు
అవతరించిందిక్కడనే!
మనుజేశ్వరాధములని
రాజుల దోపిడిని నిరసించిన
కావ్యాల సిరులు పండించిన
కవి సార్వభౌముని
ఐశ్వర్య దర్పాన్ని అణగదొక్కిన
రైతురాజు పోతన్న
ఇక్కడి వాడే! మావాడే!
బౌద్ధజైనాలు శైవ వైష్ణవాలు
కత్తులు దూసింది
శాంతిని నిలిపిందీ
ఈ భూమి మీదనే!
విజయనగర సామ్రాజ్యానికి
పునాదులు వేసిన
హరిహర బుక్కన్నలు
తను అస్త్రాలకు పదనుపెట్టింది
ఓరుగల్లు ఏకశిల మీదనే
జాతుప సేనాని నృత్యశాస్త్రం
రామదాసు కీర్తనలు

జానపదుల పాటలు
ఆటలు నేర్పింది పాటలు నేర్పింది
ఆంధ్రుల సకల కళలు పుట్టింది
ఇక్కడనే!
ఆలయాలు తటాకాలు శిల్పాలు
తీరు తీరు నగలు అపురూప వస్త్రాలు
నిర్మించిన చెక్కిన చేసిన నేసిన
కర్మవీరులకు పుట్టినిల్లు ఇదే!
కదనాలకు కదను తొక్కిన
విప్లవాలకు గళాలు విప్పిన
వీరభూమి ఇదే!
ఇదే ఇదే తెలంగాణం
సిరులెన్నిటికో మాగాణం!





# మునాస వెంకట్

## దేవండ్లు

కమ్మ కమ్మకు రగత మారబోసిన
తెలంగాణ వొయ్యి
గుండె అమ్మోరు బండై
పేగులారం ఏసుకుంది

కన్నీళ్లు బూనికెతలై ఊగిన ఊళ్లు
దీపాలు ఇంకి కొండ వొంగె
పొద్దు దిగులై పొలిమర కాడ తచ్చాడె

ఏడీ సిన్నోడు ఏడీ
నా భోజ్యా ఏడీ
ఉలుకు లేదు పలుకు లేదు
నిలబడ్డ మొగురాళ్లు
కూలబడ్డ సీకటి
అడుగు సప్పుడు లేని నేల ఆకాశం

అంతరానికి నల్లదారం కట్టి నానిస్తే
ఎక్కిళ్ల లోతు ఎవనికి ఎట్టా తేలుద్ది

మరిసెట్టు నోటికి
తాటిమట్ట నాలిక

మొక్క మొలిచేది లేదు
మాట నిలబడేది లేదు

అరసేతిలో కంప ఎట్టాలు
నేలలో పాతేసిన పాదాలు
ఎవరేసిన సిలువ ఇది
యూదులెవరో తెల్వదు కాని
ఇది సేదు నిజం

సెలగేసి సెలగేసి
తనువు గుంజను తాకితే
తలలో పూలకుందేలు తగలబడె

నేలను ఎదను చూసి
రెక్కల గింజలై ఎగిరె
లోలోపలికి

తాడుకేలాడేసిన కుతికల కింద
తెలంగాణ నిండందని
అమ్మలకు సెప్పని మూటలెన్నో
పెద్దలకు పెట్టే తల్లి
పిల్లల మీద పడి
గుండె బోర్లిచ్చి గొల్లుమనె

నీ కండ్లు దేవండ్లై
మా ఇండ్లు చేరె భోజ్యా
శిగం కడుపున ప్రళయం
హర హరా ఊపిరి గజ్జెల సప్పుడైంది





# యం. రత్నమాల

## లలిత పాట

తెలంగాణ పోరాటపు పాటవైనవమ్మా
మా తల్లి బెల్లి లలిత
తెలంగాణ ఆరాటపు ఆటవైతివమ్మా
మా చెల్లి బెల్లి లలిత
తెలంగాణ ప్రజల బతుకు బాటవైతివమ్మా
మా అక్క బెల్లి లలిత
గజ్జెకట్టి గొంతు విప్పి గ్రామాలన్నిట తిరిగావు
మా చెల్లి బెల్లి లలిత
తెలంగాణ రాష్ట్రానికి నెత్తుటి ముగ్గుబోసినావే
మా అమ్మో బెల్లి లలిత
తెలంగాణ రాష్ట్ర పోరు జెండావైతివమ్మా
మా చెల్లి బెల్లి లలిత

★

స్పిన్నింగు మిల్లులోన కూలిగ పనిచేసావే
మా అక్క బెల్లి లలిత
కార్మికుల సంఘటిత శక్తివయ్యినావే
మా అమ్మా బెల్లిలలిత
పడుపు వృత్తి ఆపాలని పోరు చేసినావే
మా తల్లి బెల్లిలలిత
గుట్కాలను నిషేధించాలని ఉద్యమమయ్యినావే
మా తల్లి బెల్లి లలిత

అడుగడుగున ప్రజాయుద్ధ ఆటలాడినావే
మా చెల్లి బెల్లి లలిత
ఊరూరా విప్లవాల పాట పల్లవయ్యినావే
మా అక్క బెల్లి లలిత
తెలంగాణ జన సభల పాట పతాకమయ్యినావే
మా అమ్మ బెల్లి లలిత
ప్రజాద్రోహులంత కలిసి కుట్ర చేసినారే
మా అక్క బెల్లి లలిత
రాజ్యహింస రాక్షసానికి బలి చేసినారే
మా చెల్లి బెల్లి లలిత
నీ పాటల ప్రేరణతో నీ ఆశయ సాధనలో
మా చెల్లి బెల్లి లలిత
సీమాంధ్ర పాలనను సమాధి చేస్తామే
మా అక్క బెల్లి లలిత





# రాపోలు సత్యనారాయణ

## షేక్ బందగీ - షహీద్ బందగీ

నిజాం మీర్ ఉస్మాన్ అలీ ఖాన్
దేశ్‌ముఖ్ రాపాక రాంచంద్రారెడ్డి
ఒక నిజాం- ఒక దేశ్‌ముఖ్
ప్రజలంతా ఫకీర్లు...

ఒక పాలకుడు- ఒక పాలెగాడు
పాలితులంతా పిపీలికాలు..
జీ హుజూర్ - ఆప్‌కా గులామ్ హుం
అయ్య బాంచెను - నీ గులాబును...

తమ మాట శాసనమని
తమ దోపిడి శాశ్వతమని
సాగిస్తున్న దమననీతి
చేయిస్తున్న దౌర్జన్యాలు...

అన్యాయాన్ని ఆక్షేపించి
అణచివేతను ఎదిరించి నిలిచి
జిద్దు చేసిన జిందగీ బందగీ!
గెలుపు బాటలో బందగీ
ఓటమి ఒల్లని దొర - తొత్తులు
'షేక్' గొంతులో బాకు దూసినా

జనుల చేతిలో ఓడిపోయిరి– మాడిపోయిరి
షేక్ బందగీ – షహీద్ బందగీ
ప్రజల మదిలో ప్రమిద అయ్యేను
గుండె గుడిలో ప్రతిమ అయ్యేను
బందగీ జిందగి ఒక తలవంచని పోరాటం
బందగీ మరణం వీరతెలంగాణలో అమరం





# రేలా విజయ్

## ముత్యాల వెలుగురా..

మోదుగు పూల మొకమురా
అల్లిపూల తల్లీరా
తన కడుపు నిండ బిడ్డల గన్న
ఉద్యమ కలి జల్లెరా ॥మోదుగుపూల॥

'ములుగు'రా 'ములుగు'రా
ముత్యాల వెలుగురా
రేల పూలా గుర్తురా
మొలకలెత్తు పొలంరా ।మోదుగుపూల॥

పాలపిట్టా కులుకురా
పసిపాపల పలుకురా
తెనెలొలికె నవ్వురా
నాపల్లె తల్లీ పిలుపురా ॥మోదుగుపూల॥

నంగారే మోతరా
నబోరే ఆటరా
ఉద్యమాలకు ఉపిరై
ఉరకలేసే ములుగురా ।మోదుగుపూల॥

పచ్చని అడివమ్మరా
ఆదివాసీల అడ్డరా

తుడ్రుమామ కోయతాత
తుడుం కిన్నెర దరువురా ।మోదుగుపూల॥

చెలిమి చేసిన అడివి తల్లీ
ముగ్గులేసినది చూడరా
నెత్తుటి మరకలతో ఈ నేల
త్యాగాల చిరునామరా ॥మోదుగుపూల॥

బొంతపూలా వనమురా
లక్నవరపు సరస్సురా
పారుతున్న వాగురా
పాడిపంటల శిరస్సురా ॥మోదుగుపూల॥

ప్రజాకళలు విరిసెరా
పరిమళించుచుండెరా
పత్తిపల్లి అమ్మపాట
ప్రతినోట ఆడెరా ।మోదుగుపూల।

ఈ ప్రాంతానికి సలాం సలాం
ఈ మట్టికి ఈ పుట్టకు
ఈడ పుట్టిన ప్రతి బిడ్డకు
సలాం సలాం సలాం సలాం





# వనపట్ల సుబ్బయ్య

## తప్పెట్లు మోగుతూనే ఉంటాయి

విత్తనాలు నాటుదామంటే
చాళ్ళనిండా రక్తమే
పారాలు చెబుదామంటే బోర్డంత రక్తమే
రాలిపడిందేమన్న తిందామంటే
నేరడు పండంతా రక్తమే
తెగించి నడుద్దామంటే రోడ్డంతా రక్తమే
నాలుగు పదాల కవితన్న రాద్దమంటే
కలం నిండా రక్తమే
నేల నేలంతా త్యాగమే
మీ వెండి వాగ్దానాలకు
ఎన్ని వేగుచుక్కలు నేలరాలాలి
తేనె పూసిన మీ తీర్మానాలకు
ఎన్ని తీగలు తెగిపోవాలి
మొదనష్టపు మెనిఫెస్టోలకు
ఎన్ని మోదుగుపూలు వాడిపోవాలి
కుట్రల కమిటీలకు
ఎన్ని కడుపులు కాలిపోవాలి
మీ ఒప్పందాలన్ని
ఊరుచుట్టూ స్థూపాలై
దుఃఖం అలుగెల్లినా
"అమ్మ" ముక్కెర మెరుస్తూనే ఉన్నది

గండెదీపం మోసే బిడ్డలకు
గండు చీమలు పట్టినా
గడీలు కులుకుతూనే ఉన్నాయి
రాజకీయ రమ్మి ఆటలో
ఎవని కిలావరు, ఇస్పేట్ వానిదే
ఎవని బాదం, చౌకం వానిదే
ప్రజల దృష్టిలో మీరంతా గుడ్డి జోకర్లే
నయవంచకుల రాజనీతికి నిలువెత్తు నిజమే
పార్లమెంటు ముందు "యాదిరెడ్డి హత్య"
ఇక్కడ బతుకు యుద్ధమే
చావు యుద్ధమే
అంత్యక్రియలు యుద్ధమే
ఒక వసంతాన్ని స్వప్నించి
బతుకమ్మ విముక్తిని కోరుకున్న బోనాలు
కత్తుల వంతెనను దాటి
మగ్గం మీద తెలంగాణ జెండానేసి, ఎగురేసి
పచ్చబొట్లను పొడిపించుకోవాలనుకున్న
తొలిపొద్దులు ఉరిని ముద్దాడే ముందు
ఊరుకొక్క సారన్న వచ్చిపోండి
మీరు రాసిన ఆకలి అక్షరాలు
కడుపులో పిస్కుతున్నై
తల్లెలోని బువ్వంతా కన్నీరైంది
అమరజ్యోతులారా!
ఆగిపోయిన మీ పిడికిళ్ళను
మశాల్తీలుగా మండిస్తాం
మీ ఉత్తరాలనే బిల్లుగా మార్చేవరకు
వీపుల మీద
తప్పెట్లుగా మోగుతూనే ఉంటాయి
ఈడిమాకు దాటే వరకు
వడిసెల రాళ్ళు విసురుతూనే ఉంటాం



# వరవరరావు

## చిన్ని చిన్ని చెల్లెలో చిన్నారి నా చెల్లెలా

చిన్ని చిన్ని చెల్లెలో చిన్నారి నా చెల్లెలా
తెలంగాణ తెస్తనని తేటతెల్లం చేయవే          చిన్నారి నా చెల్లెలా
చిన్ని చిన్ని చెల్లెలో చిన్నారి నా చెల్లెలా

తెలంగాణ వస్తదని తెగించి గొంతెత్తవే          చిన్నారి నా చెల్లెలా
ఆకురాలు పాలనలో ఆమనివై రాగదే          ॥
వేపచేదు బతుకునుంచి తీపి పాట పాడవే          ।
చిన్ని చిన్ని చెల్లెలో చిన్నారి నా చెల్లెలా

ఆదిలాబాదు ప్రాణహితం – గోదావరినడగవే          చిన్నారి నా చెల్లెలా
కరీంనగర్ కలలబాట కదనబాట సాగవే          ॥
అజంజాహి మిల్లు తెరువ సైరన్‌వై మోగవే          ॥
పోలవరంనడ్డగించి దేవాదుల తేగదే          ॥
నిజాం షుగర్ ప్రజల బతుకు పంచదార పంచవే।
చిన్ని చిన్ని చెల్లెలో చిన్నారి నా చెల్లెలా

మంజీర బతుకులోన మెతుకుదారులేయవే          చిన్నారి నా చెల్లెలా
పాలమూరు కరువుదీర కృష్ణానదినాపవే          ।
నీలగిరి పులిచింతలు తొలుగు తోవ చూపవే          ।

రంగారెడ్డి రింగురోడ్డు ఖంగుదినగ కదలవే ।
కులీకుతుబ్షా బాగమతి ప్రేమనగర్ నిలుపవే ॥
చిన్ని చిన్ని చెల్లెలో చిన్నారి నా చెల్లెలా

ఆరొందలపది జీవో ఆరాటం ఉండదే ॥
చదువులు ఉద్యోగాలు తెలంగాణకె దక్కునే ॥
వెలుగులిచ్చు బొగ్గులోయ కడుపుకోతలుండవే ॥
పుర్రెగుర్తు బీడీలిక పూవుగుర్తులవుతయే ॥
చేనేత ఉరితాడగు చేదుబతుకులుండవే చిన్ని చిన్ని చెల్లెలో చిన్నారి నా చెల్లెలా

చాపచుట్టుగా భూములు చిన్నారి నా చెల్లెలా
సెజ్జులు కబళించవే ॥
ప్రపంచబ్యాంకు జోక్యమింక సాగదని చెప్పవే ।
వలసవాదమంతరించి వలసలింక ఆగునే ॥
దళారిపాలనకింక చరమగీతి పాడవే ।
ఉద్యమాల ఊపిరివై కదనశంఖమూదవే
ఉద్యమాల ఊపిరివై కదనశంఖమూదవే చిన్ని చిన్ని చెల్లెలో చిన్నారి నా చెల్లెలా





# వర్ఝుల శివకుమార్

## తెలంగాణా రామానుజం

గుండెల్లో పలుకుబడుల గంటలు కొడ్తూ
ఇంటి భాషకు పట్టం కట్టిన
ఆయన ఓ అక్షరధామం
ప్రాణం ప్రణవం ఒకటై బతుకును
ఆచరణాత్మక గీతాచరణం చేసిన
అయన ఓ సాక్షర కర్మయోగి రామం

దీప్తికీ దృశ్యానికీ మధ్య యానకమై
వినూత్న సృజనలకు
ప్రశ్నను మార్గదర్శకసూత్రం చేసిన
దార్శనికుడాయన
వృత్తినీ ప్రవృత్తినీ సుసంపన్నం చేసే
వ్యక్తిత్వం అయన నిలువెత్తు సంతకం
పుటల్లోకి దిగబడి
పునాదుల్లో వికసిస్తూ
అయన వినిపిస్తున్న పాఠాలు
బతుకును సార్థక పరిచే మార్గాలు
లెక్కలేనన్ని చిక్కుల్ని
ఒక్క ఆత్మవిశ్వాసంతో
జయించే భరోసానిచ్చిన
జీవన నైపుణ్యాల వేదం రామయ్య

కాలాన్ని ఎదిరించే వాదం రామయ్య
గణితాన్ని మథించి
అగణిత గణిత సమస్యలకు
పరిష్కార సూత్రాల్ని అందిస్తున్న
తెలంగాణా రామానుజన్
చుక్కారామయ్య
తార్కిక దృష్టికి గణితం టానిక్ అని
మనసులకూ లెక్కలకూ మధ్య
దూరాన్ని చెరిపేసిన
లెక్కల మాస్టారు రామయ్య!
అలుపెరుగని కలమై బోధనలో
సొలుపెరుగని గళమై
తెలుగు ఐఐటియన్ల యశోభవితలను
దేశదేశాలకు చాటిన దిశానిర్దేశకుడు రామయ్య!

బాసర వాగ్దేవి వీణానిక్వణంలో
విశిష్ట వినూత్న రాగం రామయ్య!
తెలుగుతనం మూర్తీభవించిన కట్టుతో
చెరగని చిరునవ్వులు ధరించి
చెదరని సంకల్పం ఆవహించిన
మేధోశక్తి ఆ ఘనాపాఠి!





# వల్లంపట్ల నాగేశ్వరరావు

## ఇదే కాకతీయ రాజేంద్రుల ఓరుగల్లు నగరం

ఇదే కాకతీయ రాజేంద్రుల ఓరుగల్లు నగరం
అదే అందాల శిల్పకళా కీర్తితోరణం
కళా సాహితీ సకల సంపదలకు నిలయం
కాకలుతీరిన వీరుల కదన రంగస్థలం ।ఇదే।

తటాకాల జలాలతో పులకించిన నేల
ధన ధాన్యాదుల తోడ విలసిల్లిన మాలా
వేయి వత్సరాల క్రితమె వెలుగొందిన హేలా
అపూర్వ వైభవాన్ని పునః ప్రతిష్ఠించవేలా ।ఇదే।

విద్యా వైజ్ఞానికి వికాసాల కేంద్రం
ఉద్యమాలకు కోట సంస్కృతి పూదోట
తెలంగాణ యాసపట్టు తెలుగు భాష తేనెపట్టు
ఓరుగల్లు ఘనకీర్తిని దశదిశల చాటిచెప్పు ।ఇదే।





# వరిగొండ కాంతారావు

## తరగని ఖజానా

ఇక్కడ
ఉలి తగిలిన శిల
మైనంలా కరిగి
శిల్పి ఊహల్లో పురుడు పోసుకొని
జీవ చైతన్యంతో కళకళలాడే
మానవాకృతులను పొంది
గట్టిపడి పోయింది

అందుకే
మొలకు చుట్టుకున్న వస్త్రాన్ని
కోతి లాగేస్తుంటే
విభ్రాంతితో
మాన సంరక్షణ చేసికొంటున్న
సౌందర్యవతి శిల్పాన్ని చూచే
ఆడవాళ్ళ చేతులు అసంకల్పితంగా
తమ చీర కుచ్చిళ్ళను సవరించుకొంటాయి

కాల్లో గుచ్చుకున్న ముల్లును
తీయించుకుంటున్న
అతివను చూడగానే
చూచేవాళ్ళ అరికాలులో
సన్నని నొప్పి మొదలవుతుంది

నాట్య మంటపంలో
తలెత్తి చూస్తే
శివ కళ్యాణంలో
పాలుపంచుకొంటున్న
అనుభూతి

రెండు నిమిషాలపాటు
తదేకంగా చూస్తే చాలు
లేచొచ్చి పోజిస్తుందేమో
ఈ నంది
అని జాగ్రత్త పడాల్సి వస్తుంది

అద్భుత రసాన్నొలికించే
మహాద్వార శిల్ప సముచ్చయాన్నిదాటి
గర్భగుడిలో కదుగిడగానే
ఆత్మ విస్మృతికి లోనయ్యే భక్తులకు
'శివ సంకల్పమస్తు'
అన్న నాదం
చెవుల్లో మార్మోగుతుంటే
హృదయ కమలం
విచ్చుకొంటుంది మనోహరంగా!

శివసుందం సత్యాన్వేషణకు
తోడ్పడే
దేహాత్మల ఐక్యతా సిద్ధికి
కావలసిన
రసానుభవాన్ని
పొందాలనుకుంటున్నారా!

ఐతే
వెంటనే బయలుదేరి రండీ!

ఓరేచర్ల రుద్రుని కాలానికి వెళ్ళి
'రామప్ప' ను చూచివద్దాం!

అప్పుడు కదా
మనకు తెలిసేది!
ఈ ఆస్తి
కలకాలం నిలచేట్టుగా చూచే
బాధ్యత మనదని
మనమొక
తరగని ఖజానాకు
వారసులమని





# వి. ఆర్. విద్యార్థి

## తెలంగాణ శక్తిపీఠం

పచ్చపచ్చని అడవి బతుకులు
నీలి కురిసే కొండ కోనలు
కాయ, కందలు తేనెపట్టులు
వేట ఖాదము ఆరగింపులు
వేడుకగా గడుచు రోజులు
'నిర్రంది'గా సాగె బతుకులు
నీతి నిత్యం పరిమళించే గిరిజాతులు
బతుకులో కానికి చక్రవర్తులు

ఓర్వగలదా దళారిలోకం
మతం మాయ మేరుపుల బేహోర్లుగానో
పురంధురుల దండమయ్యో
దండెత్తి వొస్తుంది
వాళ్ళ ఒనరులన్నీ కబళించి వేస్తుంది
అదే కథ ఇది, శతాబ్దాల నాటిది
కాకతీయుల దండయాత్రతో
తెలుగు భూమిలో ఉత్తరాటవి
అనలమయ్యింది
మూలవాసుల బతుకులన్నీ
దగ్ధమయ్యాయి
అదొగొ అప్పుడు

కొండ బిడ్డల రక్షణార్థం అవతరించారు
ధీరవనితలు పోరు తల్లులు
సమ్మక్క సారలక్కలు
మెరుపుదాడులు నిర్వహిస్తూ
రాజ్యసైన్యాన్నెదుర్కొంటూ
అమరులయ్యారు
తరతరాలకు పోరుబాటలయ్యారు
స్వేచ్ఛ నిలిపే శక్తి పీఠమయ్యారు





# వి. త్రివేణి

## ఇందూరు వైభవం

శతాబ్ది వీణా ప్రభాత కిరణం
ఉజ్జ్వలించే ఇందూరు ముఖద్వారం
అందాల చిందు ఎల్లవ్వ చందం
ధ్వనించే గజ్జెల కంకణ ద్వయం
యక్షగాన సంప్రదాయ ప్రతిభా పాటవం
వ్యాపించే దేశ రాజధాని నగరం
సశ్యశ్యామల భూదేవి పయః హృదయం
సిరులందించే, దక్షిణ భారత ధాన్యాగారం
పురాతన భవన నిర్మాణ నైపుణ్య కౌశలం
దర్శనమిచ్చే చారిత్రక శిల్ప సంస్కృ తీ వైభవం
సకల విద్యాశ్రిత సరస్వతి ప్రాచ్య గోపురం
అర్జించే భావి విద్యార్థుల జ్ఞాన సాధక నిలయం
పండితేశ్వరుల రసమయ క్రీడా వినోదం
ఆస్వాదించే సాహిత్య పిపాసకుల అష్టావధానం
త్రిభాషా సమ్మేళన త్రివేణీ సంగమం
పల్లవించే నవ విధ భక్తిమార్గ సుగమం
కోటి దేవతల కోనేరు దేవ మందిరం
కామించే మోక్షకుల ముక్తి వేద సోపానం
మా తెలంగాణం మల్లెల మాగాణం
ఇందూరు వైభవం పరమళసుందర నందనం



# వి. వీరాచారి

## ఆత్మీయమీ తెలంగాణ

ఇది వీర తెలంగాణ! విప్లవాల మాగాణ
ప్రేమకు నజరానా! త్యాగాల ఖజానా ॥ఇదివీర।

గోదావరి హొయలతో! కృష్ణమ్మ పరుగులతో
తుంగభద్ర నడకలతో! సింగరేణి సిరులతో
సింగిడైన తెలంగాణ! శివసత్తుల తెలంగాణ
గిరిపుత్రుల తెలంగాణ! గిరులు విరుల తెలంగాణ ॥ఇది వీర॥

తెలుగు భాష సంస్కృతుల జీవధార తెలంగాణ
దేశికవిత పరిమళాలు ప్రభవించిన తెలంగాణ
మాతృస్వామ్య భావజాల మణిపూస తెలంగాణ
బతుకమ్మ కొలువులకు నెలవైన తెలంగాణ ।ఇది వీర॥

మహోజ్వల సామ్రాజ్యపు రూపశిల్పులు
బౌద్ధ జైనమతాల పరిపోషకులు
చాతుర్వర్ణ్య వ్యవస్థను ధిక్కరించిన ప్రజాహితులు
శాతవాహనుల కాకతీయులు పాలించిన ఏలినదీ తెలంగాణ
॥ఇది వీర॥

నాయకురాలు నాగమ్మ! రాణీరుద్రమ్మ
అడవికాసిన అగ్నిపూలు సమ్మక్క సారమ్మలు

చాకలి అయిలమ్మ మల్లు స్వరాజ్యాలు
పౌరుషానికి ప్రతీకలై! ఉద్యమానికి దివిటీలై
ప్రజాస్వామ్యపు సత్తా చాటిన తెలంగాణ ముద్దు బిడ్డలు ।ఇది వీర॥

నల్లగొండ, పాలమూరు, ఓరుగల్లు జగిత్యాల
సిరిసిల్ల ఇంద్రవెల్లి ఇనతేజం విప్లవాల మూట గట్టి
భూమి, భుక్తి, విముక్తి కోసం
అడవి బాటను పట్టిన త్యాగధనుల కన్నతల్లి తెలంగాణ । ఇది వీర।

కళలకు కాణాచిరా! ప్రజలపాటల ఊటరా (దిక్సూచిరా)
మట్టి మనుషుల ప్రేమరా! ఉద్యమాల ప్రయోగశాలరా
యశోధనుల కోటరా! మోదుగపూల జనంరా
తంగేడుపూల వనంరా నా తెలంగాణ ఘనంరా ॥ఇది వీర।





# విప్లవ్ దత్ శుక్లా

## మత్తడి

మళ్ళ, 'చింత' చెట్టు కాడనే
సూర్యుడు మొలకెత్తిండు
గొర్ల మంద లేదు
బర్ల మంద లేదు
కచ్చరం కంటికి కానరాదు
మాపల్లె... ప్రపంచ మార్కెటైంది..
అన్నెం పున్నెం ఎరగని
అమాయకుల ఊరు
"గొరైంకల గుంపు" లెక్కుండేది
పచ్చటి రైతు సుట్టూ
అన్ని కుల వృత్తులకు అన్నందొరికేది
పండుగ ఏదైనా ప్రకృతిని జీవనం జేసేది
ఊరుమ్మడి బతుకులు
తెలంగాణ ముచ్చటయ్యేది-
కష్టాలు మనుషుల్ని ఒక్కటే చేసి
మట్టే "తిరుగుబాటు" పాటంగా..
గతం పోరాటాల పురుటి గడ్డయింది
ఇప్పుడు... అన్నీ మింగేసింది "మార్కెట్"
తంగేడు- గనుగు కొనుక్కొనుడే
క్లోరాల్ హైడ్రేడ్ కల్లు విషం తాగుడే..
మనిషి తన కాళ్ళు సేతులు

తానే నరుక్కుంటున్న దృశ్యం..
సుఖం- సావుకు దగ్గరజేస్తే
స్వార్థం- జీవనాన్ని ఒంటరిని జేస్తుంది
కరువులగూడా
గంజీ- గట్కా పంచుకొన్న పల్లెల్ల
"అయ్యో!" అంట లేరు
"అన్యాయాన్ని" ఎదిరిస్త లేరు
నడిమంతరపు 'సదువులు' చెడగొడతాన్నయి
పుక్యానికి వచ్చిన "సిరులు" బతుకు అంగడి చేస్తాన్నయి
దేవుల్లు ఎన్ని అవతారాలెత్తినా
ఎంత మంది రాక్షసుల్ని సంపినా
"దోపిడి" రూపంల మళ్ళ మళ్ళ పుడతనే ఉన్నరు...
నీళ్ళు..
నిధులు..
కొలువులు..
సమక్యత పేర తింటనే ఉన్నరు
నిలువనీడ దోసుకోక ముందే
బతుకును ఖతం చేయకముందే...
రగులుతున్న గుండెలు
మంటల జండా కావాలే
రంగుల్ని వీడి
తెలంగాణ లక్ష్యం కావాలే
వేగు సుక్కలు
వేకువ జాడ చెప్తాన్నయి...
ఆకుపచ్చ తెలంగాణ కావాలంటే
మళ్ళ
"కొత్త చింత" చెట్టుకాడ
మండే సూర్యుల్ల పంట రావాలే!!





# వెలపాటి రామరెడ్డి

## ఏడుపాయల జాతర!

'ఏడుపాయలు' కోర్కె లీడేర్చు రారండి
శివరాత్రి స్నానాలు చేసివద్దాం రండి!
మంజిరమ్మా జలం సంజీవనీ సమం
అది –సప్తనదుల జీవ చైతన్య జనితం!

గంగమ్మ గోదమ్మ కలెగల్సి పారాడు–
యమునమ్మ కృష్ణమ్మ లేక్యమై దొర్లాడు
బ్రహ్మ పుత్రా సింధు నర్మదమ్మలు అదు
ఏడు నదులేక ధారై పాడు, పొర్లాడు!

మన 'నలుపు'లను తనలొ చేర్చుకొన్నందునో
నీలకంఠునిలోన లీనమైనందునో
నల్లరాతీ విగ్రహంబయ్యె దుర్గమ్మ!
ఒల్లంత జలదరింపజేయు మా యమ్మ!!

తెలగాణ జానపద కులదేవతల పెద్ద
కొలువు కూటమ్మిద్ది! ఎల్లమ్మ గుడి అద్ది!
అమె కొమరుడు పరశురామాలయమ్మిద్ది!
పాముపుట్టను అనుకొని మునీశ్వరు గద్దీ

అదిగొ మోహిన్ సాబు దర్గ గల దచ్చట!
గంగ యమునల తహజిబీ బంధమిచ్చట!
హిందు ముస్లిం లూదు వెలిగించు రీ చోట!
సత్ సభ్యతలకెల్ల అభయమిచ్చెదు కోట!!

గంగమ్మ గజ్జె గరుడుని వీడి రాలేను
ధరణి స్తన్యమ్ముబికి గంగయై పారేను!
'గరుడ గం' గనుపేర గల గలా దొర్లేను'
మంజీర నాదంతొ 'మంజీర' అయ్యేను

ఏడు పాయులుగాను ఎదిగేను ఎగ సేను
శివ కేశవుల మహిమక్షేత్రాలన వెలిసేను!
కోర్కెలన్ని తీర్చుకొని వచ్చెదము రండి!
శివరాత్రి జాగరణ విరమించెదము రండి!!

'ఏడుపాయలు' వేర్లు పెంచమ
వేదమందున పాడుకొన్నవి
పాముకాటుకు భయపడి రేడు
సర్పయాగము జేసెను నాడు!

నాగు లగ్నికి ఆహుతి అయె
కద్రు వాశలు హతమై పోయె!
వినుత సాయముతోడ గరుడుని
సుతుల మోక్ష ప్రాప్తి కొరకని
కద్రువకోరె! గంగకరుణకై
గరుడుడు వేడె తమ్ముల కొరకై
పరోపకార బుద్ధికి మెచ్చి
గంగ అందెను గరుడున కిచ్చె!

గంగమ్మ యిచ్చిన కాలిగజ్జెను కళ్ళ
కద్దుకొని గరుడుండు గగనానికెగిరె!
మెతుకుప్రాంతానికి మేలొనర్చుట కేమొ
జారి గజ్జియ అచట జరజర రాలె!

బిరబిర జారి గజ్జియ ఒక్క మారుగా
జలజల రా,లదే మంజీర' గామారె!
యాగస్థలమ్మున నాగులకు మోక్షమిడ
ఏడు పాయలుగాను చీలె మంజీర



# వేణు సంకోజు

## పాటల పటిమ!

అనుక్షణ రణానుభవమంటే తెలంగాణే!
పోరును నెమరేసుకునే జనని-
త్యాగాల జాడైన- అవని!
అమరత్వాల తావూ- ఉద్యమాల రహదారీ
సూర్య సింధూరమై మెరిసే-
ధరణి మాణిక్యం తెలంగాణ!

ఏనాడూ - ఎవరి నుండీ-
ఎటువంటి జాలినీ కోరక
బరిమీద నిలుస్తున్న జనావేశం-
యోద్ధల రంగభూమి తెలంగాణ!

బతుకెంత యాతనైనా కత్తులబోనునుంచి బెదరక
గాయాలకు ససేమిరా వెరువక- విక్రమించే బతుకు
మెతుకు లేదనకుండా జనులకు వడ్డించిన
నిత్యాన్నపూర్ణ తెలంగాణ!

నయాబాని సత్వవలల్ని విసిరే- జొదరులు
కూస్తే నేం కారుకూతలు హీనులు?
మట్టుబెట్టిజెగజెట్టిగ- ఎత్తులకెగరనున్న
విజయకేతనం తెలంగాణ!

రొండర్థాల జోళ్ళను- కపటోపాయాల తాళ్ళను
వాళ్ళకే ఉరిపెడుతూ
కొత్త రజాకార్ల కుత్తుకలో తెగిపడే ఘడిమల్లెక్కిస్తూ
బతుకమ్మై స్వచ్ఛమైన
బతుకును కీర్తించే పల్లవి కదా తెలంగాణ!

కూనోని నిలువు నిస్తారం దోసెటోళ్ళ-
నిరంతరం మేసెటోళ్ళ పాడెను సిద్ధం జేస్తూ
అదనుకనే నిలువగల్ల పాటల పటిమ
పరమాత్మీయ మన తెలంగాణ!





# వేముగంటి మురళీకృష్ణ

## కొన్ని స్మృతులూ -
## ఆత్మవిశ్వాసపు ప్రకటనలూ

ఆ చివరి నుంచీ
పాత గాయాన్ని మళ్లీ తడుముతూ
కనురెప్పల మీద రెపరెపలాడుతున్న
దృశ్యాల్ని
గడియారం కుంజీలాగా వెనకకు తిప్పుతూ
గత కాలపు స్మృతుల్ని పలువరించే అవసరమొచ్చింది

నలభై రెండేళ్లనాటి పాట చివరి చరణాన్ని
కొత్తగా మరింత పదునుగా
గొంతులోకి వంపుకోవాల్సే ఉంది
తడబడిన అడుగుల్లో ఇప్పటి తరం
అప్పటి అమరుల ముఖాల్ని వెతుక్కోవాల్సే ఉంది

అడిగిందే అడుగుడు
పాత మాటే
పదిలంగా దూలానికి చెక్కిన కారట్‌లోని
చెదలు పట్టని వాక్యాలే
హైదరాబాదంతా బుర్క పిట్టయ్ తిరిగిన నినాదమే
అప్పటి వృద్ధులు

ఇప్పటి యువకులై నిలదీస్తున్నదే
వంగిన విల్లంత పౌరుషంతోని ఒర్రుతున్నదే

పదే పదే మాట తప్పడానికి
నాలుక అంచుకు రాసుకున్న ఉప్పుని
ఉమ్మేసిన నేల కాదిది

పచ్చదనాన్ని త్యాగం చేసి
వేళ్లలో ముఖాన్ని దాచుకున్న నేల
పాలోళ్ల చేతుల్ల ఇంత విశ్వాన్ని ధారపోసి
తనకు తాను దహించుకున్నదే

మలినమైన కాళ్లను కడిగి
ప్రేమని చద్దర్‌లా పరచిన నేలనే

బతుకు పేలికలై
ఈ తొవ్వల నడిచొచ్చిన ఆయాసగాళ్లకు
ఆలంబనగ నిల్చిన అనురాగ వనం

కోకిల గొంతుల్ని విరిచేసి
పాలపిట్టల కండ్లను పొడిచేసి
జంబి చెట్టుమీదే సజీవదహనం చేసి
మోగని ఒక్క చేతి చప్పట్లని
లయాత్మకంగా వినమంటున్నరు

పరుషంగా మాట్లాడని చోట
పల్లేరుగాయలు నింపితే
అస్సోయ్ దూలా ఎట్ల ఆడుతం?

భూమిని పొక్కిలి చేసి
భాషతోని బతుకెల్లదీయమంటె నడుస్తదా?

బీరిపోయిన మనసు సాక్షిగా
అదే పాత చూపు
ఇంకా చెప్పాలంటే యాభై అయిదేళ్లకు పూర్వం
జరగబోయే ద్రోహాన్ని పసిగట్టిన నేల చూపు
మళ్లీ రాగిచెట్టుకింద జమైతున్న
గోరికంల చూపు....





# షాజహానా

## నువ్విప్పుడు నా భూమివి!

నీ శ్వాసను అత్తరులా పూసుకుని జీవిస్తున్నాను
నా భూమి మీది ప్రేమలా నీ మీది ప్రేమను మర్చిపోలేకపోతున్నాను
నా నేలమీది మట్టిగంధాన్ని రాసుకున్న
క్షణాన్నే ఉద్యమం ఊపిరి పోసుకుంటుంది
నా దేహం నిండా ప్రవహిస్తున్నది రక్తం కాదు
నా ప్రాంతపు ఊపిరులే
ఎవరో నా ప్రేమను నా నుంచి లాక్కుంటున్నారు
ఎంత క్రూరులై ఉంటారు
దక్షిణాఫ్రికా గూడెం ప్రజలను ఎత్తుకుపోయినట్లు
నా ప్రేమను హైజాక్ చేస్తున్నారు...
నిన్ను అమితంగా నా ప్రాణం కన్నా మిన్నగా ప్రేమిస్తున్నందుకు గాను
హిట్లర్లయ్యి నా ప్రేమికను నా నుంచి లాగేసుకుందామని చూస్తున్నారు
చూడు వేల ప్రేమికులు యూనివర్సిటీల నిండా
లాఠీల కింద విరిగింది దేహమా... ఈ నేల కాదూ...
ప్రవహిస్తున్నది రక్తమా...
ఇన్నాళ్లు లోపల్లోపల తెర్లుతున్న నా ప్రాంతపు నీళ్లు కాదూ...
వీళ్లంతా నా ప్రాంతపు చంఘీజ్‌ఖాన్‌లు, స్పార్టకస్‌లు, చేగువేరాలే
తల్లులంతా తమ కొడుకులను
బంగారు గాజులు తీసి జోలెలో వేసినంత ఉద్యమం వడికి ఇచ్చేస్తున్నారు
మీ కొంగులను కళ్లకు గంతలు కట్టుకోకండి
మీ కలాలను శాలువాల కింద దాచేసుకోకండి

అవికూడా మిమ్మల్ని ఏకాంతంలో ప్రశ్నిస్తాయి
కవన్నోదు స్వేచ్ఛకు చేయందించాలి కదా అని
ఎంతో దుఃఖంగా ఉంది... కానీ తీయగా ఉంది
ఎంతో బాధగా ఉంది... కానీ భరించాలని ఉంది
ఎంతో ఉక్రోషంగా ఉంది... కానీ పోరాటం నరాలు తెంచుతోంది
నా నిరాహార దీక్ష నాప్రేమను గెలిపించేంత శక్తివంతంగాఉంది
ఎపుడయినా నా ప్రాంతపు మట్టిని రుచి చూశారా
నా ప్రేమికుడు నాకిచ్చిన తొలిముద్దులా ఉంటుంది
నేను వేరు నా నేల వేరు కాదిపుడు
నా తల్లిదండ్రి నీరు నిప్పు ఆఖరుకి
నేను కూడా వేరు కాదు- నా ప్రాంతమే
నువ్వు నాదేహంలో భాగమయితే  కని పక్కన పెట్టేదాన్ని
కానీ ప్రేమికా! నువ్విప్పుడు నా ఆత్మలో భాగానివి
నా భూమివి....





# సన్నాయిల కృష్ణవేణి

## నా పల్లె

నా పల్లె సౌరభించిన సిరిమల్లె
ఓరుగల్లు సిగలో విరిసిన ఎర్రమల్లె
తన బిడ్డల్ని ఊతంగా ఇచ్చి
విప్లవానికి ఊపిరూదిన పెద్దతల్లి నా 'భట్టుపల్లి'
నా ఊరి మొగదలలో నిల్చిన స్థూపం
నా అన్నల ఆశయాల ప్రతిరూపం
మా గొంతును తడిపే ప్రతీ నీటి చుక్కా
మా 'దొరసానమ్మ' వరదానం
ఆషాడ మేఘాలు ఆకాశంలో దోబూచులాడుతుంటే
మా ఊరి కనకమ్మ గుండ్లల్ల నేలమీదనే సింగిడి పూస్తది
శ్రావణమాస వేళలో, బోనాల పండుగలో
పోశమ్మ గుడికాడ వెయ్యిగండ్ల బోనమైతది నా పల్లె
సమ్మక్క, సారక్కలను గుండెల్లో దాచుకున్న
మా దామెరగట్లు, చిలకల గట్టుకు ప్రతి బింబమై
మా ఊరు మరో మేడారమైతది రెండేండ్ల కోసారి
తన కనురెప్ప నీడన మమ్ము కాపాడే
మా రామలింగేశ్వరుడు మాకు కొండంత అండ
పండుగైనా, పబ్బమైనా, కష్టమైనా, సుఖమైనా
కులమత భేదం మరచి అందరొక్కటయ్యే వేళ
తీరొక్క పూల బతుకమ్మయితది నా పల్లె
ఓరుగల్లు పోరు ఆకాశమయితే
అందులో మెరిసే ఎర్ర జాబిల్లి నా భట్టుపల్లి



# సంకేపల్లి నాగేంద్ర శర్మ

## ఇరానీ చాయ్!

అదేం, మంత్రమోకాని యమకిక్కిచ్చే ఘన ద్రావరాజకం
పండుటాకైనా, ఎండినాకైనా దీని రుచికి చిగుర్చి హుషారవుతాడు
ఆగిన కంప్యూటర్ రైటవుతుంది
రోబో కూడా ప్రాణం వచ్చి హుషారై కదులుతుంది
దీన్ని తాగితే బిగ్‌బి పులకరిస్తాడు
మధుపులొలికించే సుందరి సైతం
దీని గుమగుమలకు దాసోహమవుతుంది
అల్లావుద్దీన్ అద్భుతాలు చేశాడంటే ఇరానీ చుక్కల రుచి చూశాడేమో
భాగ్యనగర్‌లో హైలెటయింది!
మహానగర వాసులకు ప్రియమైపోయింది
ఆటోల్లో విహరించడానికి, సిటీ బస్సులో బొరబడడానికి
ఉరుకు పరుగుల ఉద్యోగస్తుడికి, అపసోపల నిరుద్యోగికి,
బండెడు ఆశల చిరుద్యోగికి
చివరకి కాయకష్టంతో రిక్షాతొక్కే కూలీకి, తాపీ పట్టే మేస్త్రీకి,
అనువైన ఖుషీ, ఖుషీ 'కీ' వి నీవు!
మత్తుబాబులను సైతం మజామజా చేసేది!
నీలి రంగు మంటల్లో, ఇత్తడి గిన్నె సొగసుల్లో
పుత్తడి రూపంలో గంటలకొద్దీ మరుగుతూ
శంఖులో పడితేనే తీర్థమైనట్లు
కప్పులో పడి గొంతులోకి జారితే వాహువా!
కారాబిస్కట్‌తో జతకడితే అదేదో దిమ్మ తిరిగి పోతుంది!

బోనాల పండుగలో చిందులేసినట్లుంటుంది!
చార్మినార్ నుండి బంజారాహిల్స్ వరకు
మెహదిపట్నం నుండి ఎల్‌బి నగర్ వరకు
విద్యార్థి నుండి భిక్షగాడి వరకు సర్వ జనసమ్మోహితం
కవి కలం హుషార్‌కు లింకులు కలిపే అనువైన ఇంకు ఇది!
కాలిబాటల్లో సేదదీరే రకరకాల పక్షులకి
నిరంతరం అందుబాటులో వుండే అసమాన్యుడివి
అమృతాంజనానికి పోటీయై నిలిచినాది!
పౌనాలోనైనా, మలాయ్‌తోనైనా కలిసి
నవరసాల పల్లవాలను పూయిస్తుంది

('జీవనవేదం' లోంచి)





# సంగవేని రవీంద్ర

## మట్టి పొగరు

ఒక చేత్తో పొట్టని
మరో చేత్తో కష్టాన్ని
ముల్లె కట్టుకొని వచ్చిన వాడ్ని...
తలదించుకొని ఈ నగరానికి
నగిషీలు చెక్కిన వాడ్ని....
చరిత్రలో తలవంచని అక్షరమయ్యాను...
అక్రమాలకు, అన్యాయాలకు
వ్యతిరేక శక్తినయ్యాను...
ఈ నగరానికి నేను
అమ్మకొంగు నీడయ్యాను..
వీధులెన్నింటికో నేను
నామ ఫలకానయ్యాను...
ప్రగతి పునాదుల్లో
నేను మొదటి రాయయ్యాను..
నేను పుట్టిన నేలలో
త్యాగ కణాల పుట్టలున్నాయి...
నా దేహంలో మట్టితల్లి
చెమట విత్తులున్నాయి..
అందుకే నేనిక్కడ
అరటాకులో అన్నమయ్యాను...
అందరి నోళ్ళలో నాలుకయ్యాను...

సప్త దీవుల్ని స్వర్గసీమగా మార్చిన
చేతులు నావి...
రాళ్ళబాటని రహదారులుగా తీర్చిన
ఘనత నాది...
అరేబియా అలలతో బతుకమ్మ ఆడిన
సంస్కృతి నాది...
నగరానికే కాదు విశ్వానికే
పతాకమయ్యే విశ్వాసం నాది...
అవుమల్ల...!
నేనిప్పుడు తెగేసి చెబుతున్నా...
నేను తెలంగాణ బిడ్డని...
నాకు
నా మట్టికున్నంత పొగరుంది!





# సి. నారాయణరెడ్డి

## బొంబాయికి

పొట్ట సేతబట్టుకొనీ
బొంబాయికి యెల్లిపాయె
ఎట్ల వున్నడో  కొడుకు
ఏమి తిన్నడో।                                 ।పొట్ట।

కాళ్లేతులు సల్లగుంటె
కదురూమొగ్గం వుంటే
బతుకవచ్చు బిడ్డ అని
బతిమాలిన యినకపాయె।                           ।।పొట్ట।।

ఊరుగాని ఊరటా
దారిగాని దారటా
బాస తెలియనోల్లకు ఆ
పట్నం  ఒక అడివట                                పొట్ట।

మూడొద్దుల కొక్కసారి
కోడికూర లేకుంటే
కంచమిసిరి కొట్టే నా
కన్నతండ్రి  ఏమితినెనా?                         ।।పొట్ట।

ఇంతపెద్ద యిల్లున్నా
ఇసుగుకునే యెత్రినాన్న

కోల్లగూడసొంటి మురికి
కొంపలోన ఎట్లుండెనో? ।పొట్ట।

ఏమి కొడుకు ఏమి కొడుకు
ఇగురమున్న చేతివాడుపు
వాని నేతముందు గిర్ని
బట్టలైన దిగదుడుపు పొట్ట॥

కొత్తలు పంపిస్తననీ
కొడుకు కారటేసెగాని
పానానికి సుకంలేంది
పైసలల్ల ఏముంది? ॥పొట్ట

('మా వూరుమాట్లాడింది' లోంచి)





# సి.బి. లక్ష్మి

## నేనెరిగిన మానుకోట

మానుకోట
వెట్టి మనుషుల మట్టికోట
ఫ్యూడల్ భూస్వామ్య సంస్కృతుల నెదరించిన
సామాజిక సమాలోచనల సమరాంగనం

మానుకోట
కలం యోధుల కంచుకోట
భావ సంఘర్షణల సముజ్వలనేల
తల ఎత్తున నడిపించిన అక్షరమాల

మానుకోట
ఉద్యమాల ఉసిళ్ళతల్లి పుట్టకోట
విషనాగులు, జెర్ల, జెర్రుగొడ్డుల పాతరేసిన
వీరమాతల పురిటిగడ్డ, విప్లవోద్యమాల రహదారి

మానుకోట!
ప్రతిఘటన పోరాటాల రాతికోట
ఈట్‌గా జవాబు పత్తర్‌సే దేవ్‌గా అని నినదించి
తుపాకులకు ఎదరొడ్డిన యోధాగ్రేసరుల యుద్ధ భూమి

ఇనుగుర్తి వద్దిరాజు సోదరుల
అక్షర సామాజిక అభ్యుదయం

కదన రంగాన్ని కార్యక్షేత్రంగా ఎంచుకొన్న
చిన్న గూడూరు దాశరథీ సోదర ద్వయం

తులారం ప్రాజెక్టు ప్రదాత బి.యన్ గుప్త
నైజాం పై సాగించిన అక్షర యుద్ధం

ఆసుకవితోన్నతుడు ఆర్యసామాజికుడు
శిష్టాలక్ష్మి నర్సయ్య పంతులు

సినీ ఆధ్యాత్మిక రంగాన మంజునాధ సృష్టికర్త
కోమటిపల్లి "భారవి" కోటి అక్షరాల సృష్టి

తట్టుపల్లి ఫకీర్ల పోరాట పటిమ
దాట్ల సన్యాసుల తిరుగుబాటు తత్వం
దొరతనాన్ని తొడగొట్టి నిలువరించిన
మల్యాల చేవూరి యాదవుల తుపాకుల మ్రోతలు

మాటలను తూటాలు పేల్చి అంబేద్కర్ ఆశల చేరిన
జయరాజు బొజ్జన్నపేట ఉప్పలయ్యల కంఠాలు
ఉద్యమాల బాటనెక్కించిన మహోన్నత స్వరధ్వనులు
మానుకోట అంతటా ప్రతిధ్వనిస్తూనే వుంటాయి

నిజాలన్నింటిని తమ యిజంగా చేసుకున్న
54 గ్రామపంచాయితీల ఉజ్వల ఉద్దీపనం
దొర బురుజులపై లభించిన చరిత్ర మానుకోట

గురిమిళ్ళ అడవుల్లో తోటరామునికి కాటా తగిలెనని
మైనాతో కబురందుకున్న శివసాగరుడి సాహితి ప్రస్థానం మానుకోట
తూర్పు పొద్దుకు ఎదురేగే పోరుబిడ్డలకు జన్మనిచ్చి
త్యాగాలను శిరస్సున మోసి
మానుకోట మట్టికి మరిచిపోని చరిత్రనిచ్చిన
వీరుల కోట మానుకోట!





# సి. కాశీం

## నా తెలంగాణ

నేను
మోదుగు పువ్వు కడుపులో
కళ్లు పెట్టి చూస్తాను
వెలుతురును తాగిన సూర్యునిలా
తెలంగాణ పుష్పిస్తుంది

నేను
తూర్పు వాకిటిలో నిలబడి
గోధూళితో సంభాషిస్తుంటాను
చీకటిని మింగిన సందెపొద్దులా
తెలంగాణ నెలవంకను వాగ్దానం చేస్తుంది

నేను చీకటి కురిసిన మంచులో
గువ్వపిట్టలా ముడుచుకొని వుంటాను
వెలుతురు పిట్టలా
తెలంగాణ అగ్నిశిరస్సును రాజేస్తుంది

నేను కూలిపోయిన రాతిస్తంభాల నీడలో
శిథిల శకలాలను తవ్వుతుంటాను
కృష్ణ అలలపై పద్యాన్ని అల్లిన కవిలా
తెలంగాణ గోదావరి కెరటాలకు గొంతునిస్తుంది

నా తెలంగాణ
పల్లేరుగాయలపై నడిచొచ్చిన పాటలతోట

సీతాకోక చిలుక రెక్కలపై
శత్రువుకు ఉత్తరం రాసి
వసంతం నిండా కోకిలను
పూయించి కొమరంభీం పేరును
ఆకాశానికి చెక్కిన నాగలి తెలంగాణ

వికసించిన పద్మం
ద్రవించిన నేత్రం
పేలిన దొరల గడీలు
ఎరుపెక్కిన నక్షత్ర గోళం
నవజాత శిశువు నిదురలో
భగ్నమైన స్వప్నంలా
జగిత్యాల పల్లె నా తెలంగాణ

గాయపడిన పాపికొండలలో
దగ్ధమైన 'కిన్నెరసాని పాట'
గర్భగుడిలో తలకిందులుగా
వేలాడుతున్న రాముడు
వెన్నెలను సాయుధం చేస్తున్న
మనిషి నా తెలంగాణ

తుపాకి నిప్పులను
కన్నీళ్లతో చల్లార్చి
లేతసూర్యున్ని
పెదాలతో తాకుతున్న
'నల్ల' శిఖరం నా తెలంగాణ

రెప్పలను
మేఘాలకు వేలాడదీసినా
నిండని 'పోచంపాడు'
ఎండిన స్తన్యం ఎడమకాల్వ నా తెలంగాణ

రేలపూతపై వాలిన పావురం
కనుకొలుకుల్లో
లేతబిందువొకటి పుట్టింది
ఇసుక తిన్నెల మీద
మొలిచిన దుందుభి నా తెలంగాణ

కాలం శిరస్సు తెగి
మంజీర నదిపై
వేలాడుతున్న హృదయాలు
ముళ్లపై చిల్లిన రక్తం
కవిత్వమై పారుతున్న
'చనుబాలధార' నా తెలంగాణ

గడ్డిమైదానాల మీద
తల్లి కొంగులో నేత్రాలు విచ్చి
శత్రువు శిరస్సును వుత్తరించి
వేయిస్తంభాల వెలుగులో
ఒక కవితా తోటను చిలుకరించిన
కడివెండి జ్ఞాపకాలు నా తెలంగాణ

గ్రీష్మంలో తగలబడుతున్న నగరంపై
'మూసి' హృదయాన్ని తెరిచి
ప్రేమకావ్యం చల్లిన
వసంతకోకిల నా తెలంగాణ

బొండుమల్లెల తోటలో
పండువెన్నెల తెలంగాణ





# సుద్దాల హనుమంతు

## సంఘం వచ్చిందిరో

సంఘం వచ్చిందిరో రైతన్నా మనకు బలం
చాలా తెచ్చిందిరో కూలన్నా మనకు బలం
సంఘం వచ్చింది మనకు
చాల బలం తెచ్చింది
దొంగల దోపిడి దొరల
దుమ్ము దులిపి వేసింది

నంగనాచి నైజాము
నడుంవిరుగ దన్నింది
మొట్టమొదట వెట్టిపనుల
మొదటి కూడబెరికింది
పట్టుబట్టి భూస్వామ్యం
పద్దతెగుర గొట్టింది
పది లక్షల ఎకరాలను
ప్రజలకు పంచిచ్చింది

ఊర ఊర పంచాయతి
కూటమి నేర్పరిచింది
రాత్రిపాఠశాల లెన్నో
రాణింప జేసింది
కూలి, రైతు, మహిళా సంఘాలను

నెల కొల్పింది
కులమతాల కుళ్ళులేని
సమతే మన మతమన్నది
రైతు కూలి రాజ్యానికి
రహదారులు వేసింది
తెల్ల, నల్ల దొరతనాల
తోక నరికి వేసింది
దేశముకై తలలొడ్డి
తెగవతొ పోరాడింది
ఎర్రజెండ నీడ కింద
ఎల్ల జనుల కదలమంది
ప్రపంచానికే ఆశా
ప్రమిదై వెలుగిస్తున్నది

('పల్లెటూరి పిల్లగాడా'...నుండి)





# సుద్దాల అశోక్‌తేజ

## బతుకు పాట

కన్నతల్లి మమ్ముల
కన్నప్పటి నుండి
కడుపు నిండ తినలేదు మెతుకు
కంటి నిండ కనలేదు కునుకు

అమ్మ కడుపుల వున్న ఆ తొమ్మిదినెల్లు
అస్సలు దెలువయి మాకు అకలి దప్పులు
తల్లి పేగుల దాగి తల్లి నెత్తురు దాగి
చల్లంగ వుంటిమి వున్నన్ని రోజులు
పడగానే భూమ్మీద
మొదలాయె ఏడుపు

పుట్టుకూసము జిట్టిపూసలు దెలువయి
తెలువయి సూదీ మందులు టానిక్కులు
లేదయ్యె తొట్టెల లేదు జోగలపాట
లేదు మా అయ్యతో ముద్దుల ముచ్చట
తల్లి కొంగే జోల
తల్లి గులుగుడె జోల

చిల్లుల గుడిసెల మట్టి పరుపుల మీద
తల్లి చాతీ చేతి దుప్పట్ల కింద

పాలురాక అవ్వ పాలిండ్లు గొరికితే
పండ్లకింద బాధ బిగపట్టి అన్నది
రావు బిడ్డా పాలు
రక్తాలె నీ పాలు

అయ్య తాగివచ్చి అమ్మను తన్నేది
అమ్మ ఏడ్చుకుంటు మమ్ముల కొట్టేది
అయ్య వొంటిల పుట్టినది కాదు కోపము
అదియంత బయటి లోకంలోని శాపము
తనుగొట్టుకోలేక
నను గొట్టెననె యమ్మ

మా అయ్యకూ వున్న ఒక్క చింపుల అంగి
మా అమ్మ నాకు తొడిగి ముద్దాడి
పసరు పూసిన చెక్క పలకిచ్చి పంపితే
బాలసంతుల బిచ్చగాడని బడిపిల్లలు
పంతుళ్ళు కొట్టితే
పశుల పోరన్నైతి

యజమాని ముప్పయి పశుల మందను నేను
అజుమాయించకపోతి ఆరేండ్ల పోరణ్ణి
ఒక పెయ్య దప్పించకపొయ్యి ఆముదపు చేన్ల
ఆకులు రెండు మేసి నామొచ్చి పడిపోతే
ఇనుప చువ్వలు కాల్చి
నా వీపుల గుంజిరి

ఉరిపోసుకొని పాయె అయ్య పదేండ్లల్ల
జరిగిపోయిందమ్మ బాయి పెల్లగూలి
పెద్దపాలేర్నయితి ఇరువయి ఏండ్లల్ల
ముద్దు మరదలు శీతికినే పెనిమిటినైతి
కాళ్ళ గోర్లు తీసిరి
కమ్మల గుడిసెలో

ఎన్నేళ్ల పాన్పుల్ల ఏటిపాయెల్ల
మున్నాళ్లు గడిచింది అడివి మల్లెల్ల
చిన్న పాటేలోడు శీతీని చెడగొడితే
చిన్నారి నా శీతి బాయిల పడబోతె
కన్నతండ్రి లెక్క
కాపాడుకుంటిని

పొట్ట గడువక మేము పట్టణానికి పోతె
పాము పుట్ట నిడిచి పులి గుహల కొచ్చినట్టె
కష్టాలు నష్టాలు ఎప్పటాటేనాయె
పట్నపు సేట్లతో జల్లెడబతుకాయె
పర్వతమ్ములతోని
పండ్లిరిగి నట్లాయె

నాజీల పాలన నైజాము పాలన
తెల్లోని పాలన  తెలుగోని పాలన
ఎన్నెన్నో సరుకారి పాలనలు గడిచె
ఏమి ఒరుగాలేదు ఏది జరుగాలేదు
పొడువలేదు సరుకారు
పొద్దు మా గుడిసెలో

('నేలమ్మా నేలమ్మా' లోంచి)





# సుంకిరెడ్డి నారాయణరెడ్డి

## కులీ కుతుబ్‌షా

ప్రేమతోనో మోహంతోనో
తడిసిన రవికె ట్రాన్స్‌ఫరెంట్ చూచుకాల్లో
నీలిమేఘ శకలాల్ని
కనిపెట్టి
నేల మీద కురిపింప జూసిన కవీ!

కందకావృత దుర్గాన్ని కాదు
గంధర్వులు నివసించే
బతుకమ్మల ద్వీప దీపాల నగరాన్ని
నిర్మించినవ్
నీ పేరేది కులీ!

కుమారగిరి సింగభూపాల
కృష్ణరాయల రాసిక్య రచనా పల్లకీల మోతల్లో
నువ్వు లేవు గానీ
తరాజు ముల్లు నీవైపే
తొలి ఉర్దూ రాజకవీ!

జన హృదయాల్ని రంగరించి
బోనాల పాలవెల్లి చార్మినార్‌ను
తెలంగాణ ఐకాన్‌ను

నిర్మించినవ్
నీ పేరేది కులీ!

ఒక తెలంగాణ తల్లి భాగీరథి
ఒక తెలంగాణ ప్రేయసి భాగమతి
"తెలంగీ"ని హత్తుకున్న ప్రేమ ఫలానివి!

రెండు దరుల
రెండు కాందాన్‌ల
పరిమళ తరంగిత
మూసీ నదివి
నీ పేరేది కులీ!

నీ పేరులేని హుసేన్‌సాగర్ విగ్రహాల
విధ్వంసం
కర్తవ్యమేనంటే
నువ్వేమంటవోగాని
నీ పేరు ఉచ్చరించనివాడికి
ఈ నగరం మీద హక్కు లేదంటున్న!





# స్కైబాబ

## పంచీరే... పంచీ!

పక్షి
స్వేచ్ఛను కోరుకుంటున్నది
స్వేచ్ఛ తన హక్కు అని తెలపడానికి
రెక్కలు కొట్టుకుంటున్నది
రెక్కలకు ఊచలు తగులుతున్నయ్...
పంజరం ఊచలు
అడ్డం పడుతున్నయ్
కెవ్వున అరుస్తున్నది పక్షి
లోకానికి ఆ అరుపు
'జై తెలంగాణ' అని వినబడుతున్నది

పక్షి కొమ్మల్నీ.. పువ్వుల్నీ... పచ్చికనూ... ప్రేమిస్తుంది
ఊచలను కాదు
తమను పట్టుకొనే ఊచల్లాంటి
వేళ్లను కాదు
వేళ్ల లాంటి
లాఠీలను తుపాకులను కాదు
పక్షి పక్షితనాన్ని ప్రేమిస్తుంది
తమను బంధించే మనిషితనాన్ని కాదు

పక్షుల్ని మారణాయుధాలు ఆపలేవు
పక్షి అంటే ఎగరడం
ఎగరడం అంటే స్వేచ్ఛ
స్వేచ్ఛ అంటే ఆకాశం
ఆకాశాన్ని ఎవరు ఖబ్జా చేయగలరు?

వలసవాదీ!
జీవితంలో ఒక్కసారైనా ఒక పక్షిని
పంజరంలోని పక్షిని
ఆకాశంలోకి వదిలేసి చూడు...
మనసెంత సంతోషంతో గిరికీలు కొడుతుందో..!

('జఖ్మీ ఆవాజ్' లోంచి)





# హిమజ

## మేడారం జాతర

అడివి తల్లీ బిడ్డల పండుగకు
గిరిపుత్రులే పెద్దలు

వేద మంత్రోచ్ఛారణలు
యజ్ఞయాగాదులు
మతగ్రంథ ప్రబోధాలు
ఇసుమంతైనా లేని
అచ్చమైన అడివి బిడ్డల పండుగ

రాచరికపు అరాచకం పైన
అన్యాయపు పెత్తనం పైన
కత్తిదూసి కదం తొక్కి
జాతికోసం నెత్తురోడిన
ధీర వనితలు సమ్మక్క సారలమ్మలకు
అడవి బిడ్డలు చేసే అమర వందనం

కోయ వనితలు కొండ దేవతలైన
ఏడు శతాబ్దాల వీరగాధా వారధి
మేడారం జాతర

గోండులు కోయలు లంబాడాలు
భిల్లులు ...వరలు బంజారాలు

దండకారణ్యమంతా దండోరాయై
జనపద ఘట్టనల్లో మారుమోగే గిరిజనోత్సవం

మాఘశుద్ధ పౌర్ణమి వెన్నెల్లో
నాగరికతకు సుదూరంగా
అనాది అడివి ఒడిలో వినిపించే
ఆదివాసీ జీవన సంగీతం
గోండు బిడ్డల పురాసంస్కృతీ
సంప్రదాయాల కొండ మల్లె సౌరభం
మేడారం జాతర!

ఇక్కడ కోడిపుంజులు
కొబ్బరికాయలే ముడుపులు
బెల్లమే నిలువెత్తు బంగారం

పూజలు ఎదుర్కోళ్ళు
కంకబియ్యం సమర్పణం
శివసత్తుల పూనకాలు
వనమూలికల వగరు వాసనలు
ఇప్పసారా పరిమళాలు
తలనీలాలిచ్చి జంపన్నవాగులో
జనసముద్రం చేసే జలకాలు ఒకెత్తయితే
దిక్కులు పిక్కటిల్లే జననినాదాల నడుమ
తల్లీ బిడ్డలను గద్దెల వద్దకు తీసుకొచ్చే దృశ్యం
హృదయోద్విగ్నం - మహదానందం

రెండేండ్లకోసారి తల్లులిద్దర్ని తలచుకొని
ఇంటికి పిలుచుకొని
అడివి అడివంతా పులకించిపోయే
స్మృతి పండుగ - మేడారం జాతర!



## బ్రతుకమ్మ పాటలు

శ్రీలక్ష్మీదేవియు చందమామ - సృష్టి బ్రతుకమ్మయ్యె చందమామ
పుట్టినరీతి చెప్పె - భట్టు నరసింహ కవి

ధర చోళదేశమున । ధర్మాంగుడనురాజు ।
ఆరాజు భార్యయు । అతి సత్యవతి యంద్రు ।
నూరునోములు నోచి నూరు మందిని గాంచె ॥
వారు శత్రురులయ్యు । వైరులచే హతమైరి ॥
తల్లిదండ్రులపుడు ॥ తరగనీ శోకమున ॥
ధనరాజ్యముల బాసి । దాయాదులను బాసి
వనితతో ఆ రాజు వనమందు నివసించె !
కలికి లక్ష్మిని గూర్చి । ఘన తపం బొనరించె ।
ప్రత్యక్షమై లక్ష్మి పలికె వరమడుగమని ।
వినుతించి వేడుచు । వెలది తన గర్భమున ॥
పుట్టుమని వేడగా పూబోణి మది మెచ్చి ।
సత్యవతి గర్భమున జన్మించె శ్రీలక్ష్మి
అంతలో మునులునూ । అక్కడికి వచ్చిరి ।
కపిలగాలవులునూ । కశ్యపాంగిరసులు ।
అతి వశిష్టులూ ఆ కన్నియను జూచి ।
బ్రతుకుగనె ఈతల్లి ॥ బ్రతుకమ్మయని రంత ॥
పిలుతురదివరనుండి ప్రియముగా తలిదండి ॥
బ్రతుకమ్మయను పేరు ॥ ప్రజలంత అందురూ ॥
తాను ధన్యుాదంచు । తన బిడ్డతో రాజు ॥
నిజపట్టణము కేగి నేల పాలించంగ ॥
శ్రీమహావిష్ణుందు చక్రాంకుడను పేర ।
రాజు వేషంబున రాజు ఇంటికి వచ్చి
ఇల్లింటమని వుండి అతివ బ్రతుకమ్మను ।

పెండ్లాడి కొడుకులా ॥ పెక్కుమందిని గాంచె ॥
ఆరువేల మంది ॥ అతి సుందరాంగులు ।
ధర్మాంగుడను రాజు । తన భార్య సత్యవతి ॥
సరిలేని సిరులతో ॥ సంతోషమొందిరీ ॥
జగతిపై బ్రతుకమ్మ । శాశ్వతంబుగ వెలసె ॥

★

రుద్రాక్ష చెట్లల్ల ఆటచిలుకల్లార పాటచిలుకల్లార
కలికి చిలుకల్లార కొలికి చిలుకల్లార కందువ్వ గువ్వలు
నా నోము నీకిత్తునే గౌరమ్మ – నా నోమ్ము ఫలమివ్వవే

కట్లాయి చెట్లల్ల ఆటచిలుకల్లార పాటచిలుకల్లార
కలికి చిలుకల్లార కొలికి చిలుకల్లార కందువ్వ గువ్వలు
నీ నోమునీకిత్తునే గౌరమ్మ – నానోము ఫలమివ్వవే॥

గోరంట చెట్లల ఆట చిలుకల్లార పాట చిలుకల్లార
కలికి చిలుకల్లార కొలికి చిలుకల్లార కందువ్వ గువ్వలు
నీ నోము నీకిత్తునే గౌరమ్మ – నా నోము ఫలమివ్వవే।

తంగేడు చెట్లల్ల ఆటచిలుకల్లార పాట చిలుకల్లార
కలికి చిలుకల్లార కొలికి చిలుకల్లార కందువ్వ గువ్వలు
నీ నోము నీకిత్తునే గౌరమ్మ – నా నోము ఫలమివ్వమే॥

★

"ఒక్కేసి పువ్వేసి సందమామ ఒక్క జాము ఆమె సందమామ
శివుడొచ్చె యాల్లాయె సందమామ శివుడు రాకపాయె సందమామ
శివునికి సిరిగద్దె సందమామ నాకు తులసి గద్దె సందమామ"

"తూరుపు దిక్కునా ఉయ్యాలో తులిసి వానలు కురిసె ఉయ్యాలో
పడమటి దిక్కునా ఉయ్యాలో పాలవానలు కురిసె ఉయ్యాలో
ఉత్తరం దిక్కునా ఉయ్యాలో ఉరుము కురిసిందీ ఉయ్యాలో

దక్షినం దిక్కునా ఉయ్యాలో దండి వానలు కురిసె ఉయ్యాలో
ఆ వాన ఈ వాన ఉయ్యాలో చెరువు పాలాయె ఉయ్యాలో"

## బొడ్డెమ్మ పాట

మాలుమర్తి మేడమీద చందమామ
వెండియ్య వేనగరలు చందమామ
ఇత్తడియ్య చేరలకు చందమామా
రాగియ్య కడువలు చందమామ
ముత్యాల ముగ్గులకు చందమామ
వజ్రాల వాకిండ్లు చందమామ
వజ్రాల వాకిండ్లకు చందమామ
పవడాల పందిళ్ళు చందమామ
పవడాల పందిళ్ళకు చందమామ
మంచినీళ్ళ బావి ప్రక్క చందమామ
మంచి మల్లె తీగబుట్టె చందమామ
కోసేవారెవరు లేక చందమామ
కొండెత్తు పెరిగిపోయె చందమామ
కోయించి చందప్ప చందమామ
పంచిపెట్టు గౌరమ్మ చందమామ

## హోళి పాట

చింతలు బూసె చింతలుగాసె హోళీ చెమ్మకేళిరె హోళీ
చింతలు దులుప ఎవ్వరు లేరు హోళీ చెమ్మకేళిరె హోళీ
చింతలు దులుప నన్న రాడు హోళీ చెమ్మకేళిరె హోళీ
పండుగొట్ట ఎవ్వరు లేరు హోళీ చెమ్మకేళిరె హోళీ
కొంగుబట్ట ఎవ్వరు లేరు హోళీ చెమ్మకేళిరె హోళీ
కొంగు బట్టనన్న రాడు హోళీ చెమ్మకేళిరె హోళీ
గోగులు బూసె గోగులు గాసె హోళీ చెమ్మకేళిరె హోళీ

గోగులు దులుప ఎవ్వరు లేరు హోళీ చెమ్మకేళిరె హోళీ
వచ్చిపోయె దొరవారు హోళీ చెమ్మకేళిరె హోళీ
బంతిగట్ట ఎవ్వరు లేరు హోళీ చెమ్మకేళిరె హోళీ
బంతి గట్టనన్న రాడు హోళీ చెమ్మకేళిరె హోళీ
గోగు బువ్వ దెచ్చినాడె హోళీ చెమ్మకేళిరె హోళీ
కుమ్మరింటికి బోయినాడె హోళీ చెమ్మకేళిరె హోళీ
కొత్తకుండ దెచ్చినాడు హోళీ చెమ్మకేళిరె హోళీ
రోట్లేసి దంచినాడు హోళీ చెమ్మకేళిరె హోళీ
మేదరింటికి బోయినాడు హోళీ చెమ్మకేళిరె హోళీ
పిల్లన గొయ్య దెచ్చినాడు హోళీ చెమ్మకేళిరె హోళీ
పిల్లన గొయ్యి నింపినాడు హోళీ చెమ్మకేళిరె హోళీ
సంది సంది తిర్గినాడె హోళీ చెమ్మకేళిరె హోళీ
సందిలోన యెవ్వరు లేరు హోళీ చెమ్మకేళిరె హోళీ
కామూని కంతల్ల హోళీ చెమ్మకేళిరె హోళీ
కన్నతల్లి యెదురయ్యే హోళీ చెమ్మకేళిరె హోళీ
చిత్తన గొయ్యను నింపినాడె హోళీ చెమ్మకేళిరె హోళీ
చింగు చింగు గుప్పినాడె హోళీ చెమ్మకేళిరె హోళీ

## కాముని పాట

పొడల దల గట్లమీద – పొడిసినాది చందమామ
యీదులూరి గట్లమీదనో – ఓ పాటేల– యీదులెక్కిజూదమాడవో
సూత్త సూత్తనన్న రావు – సుక్కవోలెనన్నరావు
మేయిలిత్త నువ్వు రావయ్యో – ఓ పాటేల రాజ్యమెలె మల్లెమొగ్గవో
దస్తిగుడ్డ గప్పుకోని – దర్వాజెల్లి నువ్వేరాంగ
వరివరి సంగీతముండెనో – ఓపాటేల – వచ్చియన్ని చూసిపోవయో
కొట్టి కొట్టి చేతులుబాయో – పాడి పాడి పండ్లు బాయె
ఈగన్నదయరాదయో – ఓ పాటేల – కల్లుకొక్క రూపయియ్యయో

## కోలాటం పాట

చిత్తాచిత్తారి బొమ్మ శివునీ ముద్దుల గుమ్మ
వెన్నెలాడి బొమ్మ దొరికెనమ్మ ఈ వాడల
సుక్రార మొకపొద్దు ఒంటికాలు తౌసు చేస్తే
వనెన్నలాడి బొమ్మ దొరికెనమ్మ ఈ వాడల
అయితార మొకపొద్దు అన్నీ పూజలు జేస్తే
అనువాండ్ల పేరు దొరికెనమ్మ ఈ వాడల
కాముడం కలలాయెనమ్మో ఈ వాడల
మంటిబిందె తీసుక మగువ నీళ్ళకు పోతె
కంచుబిందె తీసుక కైక నీళ్ళకు బోతె
మాదేవుడెదురాయెనమ్మో ఈ వాడల

## తెలంగాణ స్త్రీలు ధాన్యం విసురుతూ పాడుకునే విసుర్రాయి పాట

"చిటచిటా ఎండగొట్టి చెట్టుగురుబెట్టే
చందురూని కన్నంత చెట్టూమీదుండే
నా తల్లి కన్నంత నామీదా ఉండె
నాగ వడియాల చీరే నా పట్టు రయికే
నాతల్లి కన్నంత నామీదా ఉండె"

## రోట్లో ధాన్యం వేసి దంపుతూ స్త్రీలు పాడుకునే రోకటి పాట

"ఊబిది మన గోడవలలో ఉల్లి నిట్టాడు వలలో
మట్టిది మన గోడావలలో మల్లె నిట్టాడు వలలో
ముత్యాలు పవుడాలు వలలో అమ్మచ్చీనాయి వలలో
కొనుమని కోమలీ వలలో కొంగులు పరిసిందీ వలలో
వద్దాని కోటయ్యా వలలో గద్దరిచ్చినాడు వలలో"

## పొలం పనులు చేస్తూ స్త్రీల బృందం పాడుకునే పాట

"మదన సుందారి మదన సుందారి నీలంగి రాజుబిడ్డ మదనాసుందారి
మదన సుందారి మదన సుందారి నీళ్ళోసుకున్నాది మదనా సుందారి
మదన సుందారి మదన సుందారి ఆ ఇంటి పనీకి నన్నంపినాది మదనాసుందారి
మదన సుందారి మదన సుందారి దంచగ రాజు కన్నేసినాడు మదనాసుందారి
మదన సుందారి మదన సుందారి దంచగ దనుమడిమె దగ్గునా మెరిసె మదనా సుందారి"

## జాజిరి పాట

జాజిరి జాజిరి జాజిరి జాజ- రుంగుడుబిల్లరూకలదండ
దండగాదురా దామెర మొగ్గ - మొగ్గగాదురా మోదుగనీడ
నీడగాదురా నిమ్మలబాయి- బాయిగాదురా బల్సంతకూర
కూరగాదురా గుమ్మడిపండు - పండుగాదురా పావడమీసం
మీసంగాదురా మిర్యాల పొడి - పొడిగాదురా పొలిమేర గట్టు
గట్టుకాదురా చీపురు కట్ట - కట్టదీసి నీ నెత్తిన కొట్ట

(బాలరెడ్డి అనుపిల్లగాడు)

కప్పతల్లి కప్పతల్లి కడివెడే నీళ్ళు
దొంతాల్ దొంతాల్ దొడ్డెడ్డే నీళ్ళు
చీమతల్లి చీమతల్లి చిట్టెడే నీళ్ళు

## పిల్లల పాటలు

### చెమ్మ చెక్క

చెమ్మచెక్క - చేరెడేసి బుక్క
అట్లుపోయంగ - ఆరగించంగ
రత్నాల చెమ్మచెక్క -రంగులేయంగ
ముత్యాల చెమ్మచెక్క - ముగ్గులేయంగా
పగడాల చెమ్మచెక్క పందిరేయంగ
పందిట్ల బాలుడు - పరుగులెత్తంగ

## గుడుగుడు గుంచెం

గుడగుడు గుంచెం – గుండేరాగం
పాముల పట్టా – చిట్టేరాగం
చిన్నన్నపెండ్లి – చెట్టేరాగం
పెద్దన్న పెండ్లి – పెట్టే రాగం

## కొంగా కొంగా

కొంగ కొంగ పువ్వెయ్యే
దేవుని గుళ్ళే దెబ్బెయ్యే
రాయి చెట్టు మీద రప్పెయ్యే
తెల్ల బియ్యమా పచ్చ బియ్యమా?

★

ఏడవకు ఏడవకు వెర్రినాయన్నా
ఏడిస్తే నీకండ్ల నీలాలు గారూ
నీలాలు గారితే నే చూడలేను
పాలైన గారవే బంగారు కండ్ల!

★

నారాయణ నారాయణ నక్కతోక
నన్నెందుకుంచినావు కొంచబోక
పుట్నాల గంపకాడ దించిరాక

★

పిట్టరావే పిట్ట
పిట్టరావే పిట్ట పిల్లలకు తల్లీ
పిల్లలకు పాలిచ్చి పల్లెలకు పోవే
పల్లెలకు పోయొచ్చి బుట్టల్లుకోవే
బూచివాడా రార బుట్టల్లుకోనీ
బుట్టలో నాయినను పట్టుకొనిపోరా..

★

ఉయ్యాలో జంపాలో
కొత్తకొండా ఊరన్నా

కొమురెల్లీ మల్లన్నా
ఐలోనీ మల్లన్నా
అల్లల్లల్లల్లలా..

★

చందమామరావే - చక్కంగరావే
గోల్కొండకు బోయి - గొర్రెనుదెచ్చీ
నడింట్లేసి - నాలికదీసి
చీకినబొక్కలు - కాకీకేస్తే
కాకీమోపెడు - గడ్డీదెచ్చె
గడ్డీ తీస్కపోయి - బర్రెకేస్తే
బర్రే బుడ్డెడు - పాలనిచ్చే
పాలుకొంటబోయి - అమ్మకిస్తే
అమ్మనాకు - అటుకులుబెట్టె
అటుకులు తీస్కబోయి - కోమటికిస్తె
కోమటినాకు - కొబ్బరిబెట్టె
కొబ్బరికొంటబోయి - పంతులుకిస్తే
పంతులునాకు - పజ్జెంజెప్పె
పజ్జెంకొంటబోయి - మామకిస్తె
మామా నాకు - పిల్లనిచ్చె
పిల్లపేరు - మల్లెమొగ్గ - నా పేరు జమీందారు

(ఆచార్య బిరుదురాజు రామరాజుగారు సేకరించిన ఈ జానపద పాటలు ఆచార్య బిరుదురాజు రుక్మిణిగారు అందించారు)



jigar | telangana vishishta kavithvam



నిజానికి ప్రతీకలు అనేవి తరాలు, ఆలోచనలు మారుతున్న కొద్దీ మారుతూనే వుంటాయి. ఏ తరానికి ఆ తరం ప్రతీకను నిర్మించుకుంటూనే సర్వజనామోదమైన శాశ్వత ప్రతీకల్ని ఏర్పాటు చేసుకోవాలి. తరాలకే గాదు, వర్గాలకు కూడా ప్రతీకలుంటాయి. ఆ వర్గ ప్రతీకలే మొత్తం జనావళి ప్రతీకలుగా గుర్తించలేము. తెలంగాణవంటి సంక్లిష్టమైన, భిన్నమైన ఆలోచనల మేళవింపుతో ఏర్పడ్డ సమాజంలో ఇది మాత్రమే 'తెలంగాణ ప్రతీక' అని తేల్చి చెప్పడం కష్టం. ఊహా జనిత 'తెలంగాణ తల్లి' స్థానంలో రుద్రమను ఎంచుకోవచ్చు. చరిత్ర నుంచి స్ఫూర్తిని ఆవాహన చేసుకోవడంలో భాగంగా పోరాట పటిమను, ఆత్మగౌరవ పతాకను ఎత్తిపట్టిన చైతన్య శిఖరం 'రుద్రమ'ను తెలంగాణ ప్రతీకగా ప్రచారం చేయవచ్చు. ఈ పనిని ఈ సంకలనం ద్వారా ముందుకు తీసుకెళ్ళవచ్చు. ఇది సాధ్యమే! కాకతీయుల వెయ్యేండ్ల పాలనా ఉత్సవాలు జరుపుకుంటున్న ప్రస్తుత తరుణంలో తెలంగాణవాదులుగా ఆమెను 'ఓన్' చేసుకోవడం అంటేనే ఆమె పోరాట వారసత్వాన్ని కొనసాగించడమే!

– సంగిశెట్టి శ్రీనివాస్

